## మహామండలేశ్వర్, శ్రీరామశరణ్

## కుందుర్తి వేంకటనరసయ్యగారి గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. | శ్రీరామ మంత్రానుష్ఠానము | 2. |
| 2. | నవవిధ భక్తులు | 2. |
| 3. | భాగవత కథ 1, 2, 3, 4, 5 ఒక్కొక్క భాగము | 2. |
| | ,, 6, 7, 8, 9 భాగములు | 2 |
| 4. | భారతీయ దర్శనము | 1 |
| 5. | కలిసంతరణోపనిషత్ | 1 |
| 6. | అర్థపంచకము | 0 |
| 7. | పరమార్థతత్త్వము | 0 |
| 8. | నరసదాసు కీర్తనలు | 0 |
| 9. | మహాసంకీర్తన | 0 |
| 10. | హరినామసంకీర్తన విధానము (40 స్వరములతో) | 1 |
| 11. | కేవలము స్వరములు | ( |
| 12. | సంకీర్తన మీమాంస | |
| 13. | నామమహిమార్ణవము | |
| 14. | శ్రీరామనామ ప్రభావము (పరివర్ధితము) | ( |
| 15. | భగవన్నామ ప్రభావము | |
| 16. | శ్రీరామ పూజావిధానము | |
| 17. | హనుమాన్ చాలీసా - పూజావిధానముతో | |
| 18. | ప్రణవ ప్రభావము | |
| 19. | శ్రీరామ పటలము | |
| 20. | తత్త్వత్రయము | |
| 21. | ధ్యానపద్ధతి | |
| 22. | బ్రహ్మచర్యము | |
| 23. | ఆధ్యాత్మిక సాధనక్రమము | |
| 24. | అనుష్ఠానక్రమము | |
| 25. | ప్రశ్నోత్తరి | |

నామప్రయాగ - బుద్ధాం వయా చందోలు అని వ్రాయు:

శ్రీ రామ

# శ్రీ భాగవత దర్శనము

# భాగవతకథ

[దశమ ఖండము]

శ్లో॥ వ్యాసశాస్త్రోప వనతః సుమనాంసి విచిన్వతా,
కృతావై ప్రభుదత్తేన మాలా భాగవతీ కథా॥



గ్రంథకర్త:
శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు
అనువాదకుడు:
శ్రీరామశరణ్ కుంమర్తి వేంకటనరసయ్య



ప్రకాశకులు:
శ్రీరామ శరణ మందిరము, బుద్ధాం.
నామ ప్రయాగ.

 1964 [వెల: రు. 2-50.

# విషయసూచిక

శ్రీరామ

# భాగవతకథ

## దక్షయజ్ఞమున సతీదేవి భస్మమగుట

## (౧౬౭)

శ్లో॥ తతః స్వభర్తృశ్చరణాంబుజాసవమ్
జగద్గురోశ్చింతయతీ న చాపరమ్,
దదర్శ దేహో హతకల్మషా సతీ
సద్యః ప్రజజ్వాల సమాధిజాగ్నినా॥

— శ్రీ భాగ. ౪. స్కం. ౪ అ. ౨౭ శ్లో.

గీ. అమ్మహాత్ముని యంకపీఠమ్మునందు
నాదరంబున నుండు దేహంబు దక్షు
వలని దోషంబునను విడువంగఁ దలఁచి
తాల్చెఁ దనువున ననిలాగ్ని ధారణములు.

వ. ఇట్లు ధరియించి గతకల్మషంబైన దేహంబుగల సతీదేవి నిజయోగ సమాధిజనితంబైన వహ్నిచేఁ దత్క్షణంబ దగ్ధమయ్యె నంత.

— శ్రీమదాంధ్రమహాభాగవతము.



భగవంతుని చరణములందు ప్రేమ యున్నచో నా ప్రేమలోఁ జచ్చుటయు నమరత్వమును బొందుటయే. చందనమును వాసన చూడుము, సుగంధము నొసంగును. అరుగఁ దీసినను సుగంధము నొసంగును. నఱికినను సుగంధము నొసం

గును. అగ్నిలోఁ గాల్చినను నింకను నధికసుగంధము నొసం గును. ప్రభు పాదపద్మములందు ప్రేమకలిగినను భగవంతునితో సంబంధమును బెట్టుకొనినను నవగుణములును గుణములగును. కోపమును జెందుటయు, ఆత్మహత్య నొనర్చుకొనుటయు రెం డును బాపములే; కాని వీని సంబంధము శివుని ప్రేమతో నున్నచో నది దోషముగాక గుణమగును. గోపికలకు శ్రీకృష్ణుని యందు ప్రేమకలదు. వారికి కామమున్నను భగవత్సంబంధ ముచే వారు శ్లాఘనీయులైరి. కంసుఁడు, జరాసంధుఁడు, శిశు పాలుఁడు మొదలగువారు భగవంతుని ద్వేషించిరి. కంసుఁడు భయముచే నిత్యమాతనిఁ జింతించుచుండెను. భగవత్సంబంధ ముచే నాతని యపరాధములన్నియును క్షమింపఁబడినవి. భగ వంతునిచేతఁ జచ్చి యాతఁడు పరమపదమును బొందెను. సర్వజ్ఞుఁడును, సర్వాత్మయు నగు ప్రభువును శిశుపాలుఁడు తిట్టు చుండెడువాఁడు; కాని యేమైనది ? బురదను విసరిన బురదయే పడును, పాలను విసరినఁ బాలే పడును. తిట్టుట పాపమైనను ఆతఁ డితరులను దిట్టక భగవంతునే తిట్టెను. అందువలన నాతని క్షుద్రజ్యోతి భగవంతుని దివ్యజ్యోతిలోఁ గలిసినది. ఆతఁడు సంసారబంధమునుండి శాశ్వతముగ ముక్తుఁడయ్యెను.

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! సతీదేవి వివిధవిధముల దక్షుని సమ్ముఖమున శివమహిమను జెప్పినను నాతఁ డహంకారవశమున లక్ష్యపెట్టకపోవుటచే సతీదేవి ప్రాణ మొసంగుటకు నిశ్చయించుకొనెను. ఆ యజ్ఞమండపమందే యామె యా దక్షునివలన నుత్పన్నమైన అశుద్ధశరీరము నంత మొనర్చుటకు సంకల్పించి యిట్లనెను:- "తండ్రీ! నీ శిరస్సునఁ

పాపము తాండవించుచున్నది. నీవు శివద్రోహివైనావు. శివద్రోహితో సంబంధమును బెట్టుకొనుట యట్లుంచుడు, ఆతనితోఁ బలుకుటయును పాపమే. ఆతని ముఖము జూచినను పాపము సంభవించును. నా యీ శరీరము నీవలన నేర్పడినది. కావున నిది శివుని కుపయోగపడదు. శివుఁడు సరళతావశమున - బోళా శంకరుఁ డగుటచే - నిన్నుఁ బరీక్షింపకయే నన్ను గ్రహించి నాఁడు. ఆతఁడు కృపాసాగరుఁడు. పరుల దోషమును జూచుట ఆతఁ డెఱుంగఁడు. ఎవరైన పొరపాటున విషాన్నమును దినుచో వెంటనే వమనము గావించి పొట్టనుండి వేరుచేయవలయును. తన శరీరమున బుట్టినదికదా యని మల మూత్రముల నెవరును నాదరింపరు కదా! క్రుళ్లిన యంగమును ఖండించి శేషాంగ శ్రేణికి రక్షణమొనర్చుట బుద్ధిమంతుల లక్షణము. అట్లే నేనీ శరీరమును వదలి అన్యశరీరమును ధరించి శివసేవ చేయుదును.

ఆ యంతర్యామియగు ప్రభువు నా మనోగతములగు విషయములన్నిటి నెఱుఁగును. ఛాయ శరీరమును వదలనట్లును, పృథివిని గంధము వదలనట్లును, జలము తన శీతలత్వమును వీడ నట్లును, అగ్నినుండి దాహకశక్తి వేఱుకానట్లును నెన్నడును నేను శివునకు వేఱుగ నుండఁజాలను. ఆతఁడు నాకు సర్వస్వము, ప్రాణేశ్వరుఁడు, జీవనధనము. అయినను నీ సంసర్గముచే నీ శరీర మిప్పు డాతనికి ఉపయోగించుటలేదు. ఇఁక దీనిని నేను ధరింపను. నీవు చూచుచుండగనే భస్మమొనర్చెదను."

'శరీరమును వదలుట మాటలుకాదు, ఈమె యూరక బెదరించుచున్నది. ఒకవేళ వదలినను నాకేమిహాని? సతీదేవి

మరణించినదని నే నిదివఱకే నిశ్చయించుకొంటిని. బ్రదికియుండిన నేమి? చచ్చిన నేమి?' అని దక్షుఁడనుకొని క్రోధోద్రేకమున నాతఁడిట్లనెను:– "నీవు చావనైన చావుము లేక నీయింటికి వెళ్లుము. నాకు నీతో నేమియును సంబంధములేదు. అందఱముందు తన తండ్రి నిట్లవమానము గావించిన కుమార్తె చచ్చుటయే మేలు. నీవు నా శరీరమునుండి పుట్టినను అఘోరియు, అశుచియు, ప్రేతాచరణ మొనర్చు శివుని సంసర్గముచే నీవు తాఁకరానిదాన వైతివి."

సతీదేవి విదిలించుకొని యిట్లనెను:– "తండ్రీ! ఇఁక ముదరనీయకుఁడు. ఈ సాంసారికులతో శివునిఁ బోల్పకుము. ఆతనికి విధినిషేధములు లేవు; ఆతఁడు విధినిషేధముల కతీతుఁడు. అందఱును స్వభావానుసారముగ వర్తించుచుండ మన మితరులను నిందించుట కధికారమేమున్నది? శివుఁడు స్వభావమునకుఁ బరుఁడు. శాస్త్రములందు నివృత్తిమార్గము, ప్రవృత్తిమార్గములని రెండేమార్గములున్నవి. ఈ రెంటికిని అధికారులు వేఱువేఱుగ నున్నారు. శివుఁ డీ రెంటికినిఁ బరుఁడు. నీకీ దంభయజ్ఞమున నల్లనిపొగచే దృష్టి మసగయగుటయేకాదు అంతఃకరణముకూడ మసిపారినది. నీవు శివుని మహిమను దెలిసికొనఁజాలవు. నీవు ద్వేషవశమున శివుని నిందించుచున్నావు. ఆతని పదవిని నీవు పొందఁజాలవు."

రోషస్వరమునఁ దక్షుఁ డిట్లనెను:– "శివుని పదవి శివునకే ఉండనిమ్ము. భగవంతుని దయవలన నా పదవి మా కెన్నటికి నక్కఱలేదు. ఒక్క వస్త్రమైనను లేక నిర్లజ్జుఁడై దిగంబరిగఁ దిరుగుచు, భిక్షమెత్తుకొనుచు నాఁకలికి కడుపునిండకున్న

నుమ్మోత్త, జిల్లేడాకులను మెసఁగు దిగంబరి యైశ్వర్యము పగ వానికైనను వలదు."

సతీదేవి యిట్లనెను:- "నీ వీ స్వాహాకారమునే సర్వస్వ మనుకొనుచున్నావా ? వీరందఱును నీ కూడును దిని నిన్నుఁ బ్రశంసించుచున్నారు. ఇదియే నీ సర్వస్వమనుకొనుచున్నావా? మా యైశ్వర్యమును త్యాగులు, మహాత్ములు, జ్ఞానులు, ధ్యానులు యోగులుమాత్రమే గ్రహింపఁగలరు. నీబోటిమూఢు లీ బాహ్యాడంబరమునే సమస్తముగ భావించుచున్నారు. ద్వేష వశమునఁ బెద్దవారిని విరోధించి శివునిఁ దిరస్కరించి, విధిహీన ముగఁ జేయఁబడిన యజ్ఞ మెన్నటికిని సఫలము కాఁజాలదు. నీ యీ యజ్ఞము నశింపఁగలదు. నీవు దీని నైశ్వర్యముగ భావించుచున్నావు. నీ యీ యైశ్వర్యము నా నాథుని చరణ ధూళిలోని ఒక్కకణమునకైనను బోలదు."

దక్షుఁడు శుష్కహాస మొనర్చి ఉపేక్షాస్వరమున నిట్ల నెను:- "అందుకనియే నీవు పిలువని పేరంటమునకు వచ్చితివి. నీ యిల్లు ఐశ్వర్యమయమైనదగుచో నీ వచ్చుటి కేల వెళ్లవు ? నాకు ఆహ్వానపత్రిక అందలేదు, నా నాథునకు పిలుపందలేద నియు, గుడ్డలు గోచులు పెట్టలేదనియు, మా భాగములను మాకీయలేదనియు, మా జీవికను హరించినారనియు జగడమాడ నేల ? నీ నాథుఁ డైశ్వర్యశాలియగుచో నీ వీ చిన్న విషయము కొఱకై చచ్చుట కేల సిద్ధపడెదవు ?"

సతీదేవి యిట్లనెను:- "తండ్రీ ! నీ గుడ్డ గోచులకొఱకు నేను వాచిపోయియుండలేదు. శివుని సమ్ముఖమున నష్టసిద్ధు

లును, నవనిధులును సదా చేతులు కట్టుకొని నిలిచియుండును. నే నాతని యాజ్ఞ నుల్లంఘించి వచ్చితిని. ఆతఁడు సర్వజ్ఞుఁడు. నీ భావముల నన్నిటి నెఱుఁగును. మోహావశమున నేనాతని యాజ్ఞలను మన్నింపలేను. ఆతఁడు కడుదయాళుఁడు. నేనిప్పుడు వెళ్లినను కాదనఁడు. సన్మానించుకొనును. కాని నేనే మొగము పెట్టుకొని ఆతని సమీపమునకుఁ బోవుదును ? ఇప్పు డతఁ డెన్నడైనను నెగతాళికి నీ సంబంధమున, నీ గోత్రకారణమున నన్ను దాక్షాయణి యని పిలుచుచో సిగ్గుచే నేను చావవలసి నదే. ఆ సమయమున నే నాతనివైపు చూడఁజాలను. అందు వలన నేడు నా యీ శరీరమును నీ సంబంధమునుండి శాశ్వత ముగఁ ద్రెంచివేసెదను. ఈ మలినసంసర్గమును, దూషిత దేహ మును అగ్నియందు గాల్చి, శుద్ధమొనర్చి – నా పాపమునకుఁ బ్రాయశ్చిత్తమొనర్చుకొని, నేను శివసేవ కధికారిణి నగుదును.''

మైత్రేయమహాముని యిట్లనెను:– "విదురా! ఇట్లు పలికి సతీదేవి మెదలక ఊరకుండెను. ఆమె వాఙ్నిరోధము కావిం చెను. చిత్తమును జంద్రమౌళి చరణములందు లగ్నము కావిం చెను. శుద్ధజలమున మూఁడుసార్లాచమించెను. ఆమె దక్షుని ఆసనమునైన స్పర్శింపలేదు. నేలపైననే కూర్చుండెను. ఆ సమ యమున నామె తనకు నాల్గువైపులనున్న పచ్చని చీరచెఱఁగు లను సర్దుకొనెను. పద్మాసనమును వైచుకొని కూర్చుండెను. సూర్యాస్తమయసమయమున సరోవరములోని కమలములు ముకుళించినటుల నామె కమలనేత్రములు రెండును మూసి కొనెను. చంద్రునివలె నామె దేదీప్యమానమగు ముఖమండ లము ప్రకాశించుచుండెను. హృదయమున నిరంతరము ధ్యాన

మొనర్చుచుండెను. ఆమె బాహ్యాగ్నిని స్పర్శింపనైన స్పర్శింప లేదు. క్రోధమును త్యజించెను. యోగాగ్నినిఁ బ్రజ్వలింపఁ జేసెను.

శరీరస్థితి ప్రాణాపానముల చేతనే యుండును. నాభికిక్రింద వస్తిప్రదేశమున నపానవాయువుండును. నాభికిపైన హృదయ ప్రదేశమందుఁ బ్రాణవాయువుండును. ప్రాణము పైకి లాగు చుండును. అపానము క్రిందకు లాగుచుండును. ఈ రెంటిని మధ్య నాభిప్రదేశమందు సమానవాయువుండును. ఆ రెండును సమతూకముగ నుండును. వానివలననే శరీరము నిలుచును. సమానవాయువు వీనిని వదలెనా ప్రాణాపానములు వేఱగును. అప్పుడీ జీవాత్మ యీశరీరమును వదలిపోవును. పాపులగువారు, అధోగతులై మరణకాలమున వారి ప్రాణము మల మూత్ర ద్వారములకుండా క్రిందుగా వెడలును. ఊర్ధ్వగతికిఁ బోవువారి ప్రాణము కన్నులు, ముక్కులు, నోరు మొదలగు ద్వారముల కుండా పోవును. మనః, ప్రాణ, వీర్యేంద్రియములను వశమం దుంచుకొనిన వారి ప్రాణము బ్రహ్మాండమును భేదించుకొని దశమద్వారమున వెడలును. ఇట్టి యోగి మృత్యువును జయిం చును. సాధారణముగఁ బ్రాణము, వీర్యము వీనిగతి క్రిందకు ఉండును. ఇవి విషయసమ్ముఖములగఁ గ్రిందకుఁ బోవుచుండును; కాని యోగులు ప్రాణమును వశమందుంచుకొందురు. వారిష్టము వచ్చినపుడు ప్రాణములను స్వేచ్ఛగా విడువఁగలుగుదురు. సతీ దేవి యోగాభ్యాసముచేతనే శరీరమును త్యజించెను.

ఆమె మొట్టమొదట ఆసనమును దృఢము కావించు కొని, ప్రాణాపానములను సమానమొనర్చెను. అనఁగా

మూఁడింటెనిఁ గలిపి నాభిదేశమున స్థిరమొనర్చెను. నాభి చక్రమునుండి లేవఁదీసి మెల్లమెల్లఁగాఁ దత్తచ్చక్రములయొక్క భూత, దేవతా, బీజాక్షరములను లయమొనర్చుచుఁ బ్రాణము లను హృదయచక్రమునకుఁ గొనివచ్చెను. హృదయమునుండి లేపి కంఠమునకుఁ గొనివచ్చి, మరల భ్రుకుటియొక్క ఆజ్ఞా చక్రమునకుఁ గొనివచ్చి సావధానముగ స్థిరమొనర్చెను. అపరిపక్వయోగియైనవాఁడు ప్రాణములను గంఠభాగమునకుఁ దెచ్చుట చాలకష్టము; ఏలననఁగాఁ గొంచెము పొరపాటు జరిగెనా ప్రాణము వెంటనే కన్నులు, చెవులు, ముక్కు నోరు మొదలగు ఛిద్రములకుండా వెడలిపోవును. అందువలనఁ గంఠ చక్రమునుండి ఆజ్ఞాచక్రమునకుఁ బ్రాణములను దీసికొని వచ్చుటలోఁ దొందఱపాటు పనికిరాదు. మిక్కిలి జాగ్రత్తగా జాలంధర బంధముద్వారా ఆయాద్వారపు నాడులను బిగించి ఆజ్ఞాచక్రమునకుఁ బ్రాణములను దీసికొని వచ్చెదరు. అచ్చట నుండి వాయువును మూర్ధమందలి సహస్రారచక్రమునకుఁ గొని వచ్చెదరు. లోకములను జూచు కోరిక యున్నచో సూక్ష్మ శరీరమును వెంటఁదీసికొని యోగి వెళ్లును. క్రమముగ మాయా వరణము లన్నిటినిఁ ద్రెంచుకొని ముక్తుఁడగును. దీనిని గ్రమ ముక్తి యందురు. ఇట్టికోరిక లేకున్నచో నీ దేహాత్మనే సర్వాంతర్యామియగు ఆత్మయందు లీనము గావించెదరు.

సతీదేవి ముక్తస్వరూపిణి. ఆమెకు ముక్తిప్రదాత యగు శివుఁడు కావలయును. అందువలన శరీరమందు వాయువును అగ్నిని భావనచేసి యా శరీరమును యోగాగ్ని యందు భస్మ మొనర్చెను. అందఱును జూచుచుండఁగనే

సతీదేవి శరీరము భస్మమయ్యెను. ఆమె నిర్జీవయయ్యెను. దశదిశలను హాహాకారములు చెలరేగెను. సమస్త దేవదానవ, యక్ష, రాక్షస, గుహ్యక, భూత, ప్రేత, పిశాచాదులు దక్షుని ధిక్కరించుచుండిరి. అందఱి హృదయములు శంకాభయములచే నిండిపోయెను. నలుదిశల కోలాహలము చెలరేగెను."

మైత్రేయ మహాముని యిట్లనెను:– "విదురా! సతీదేవి యోగాగ్నిలో భస్మముకాఁగానే యజ్ఞముయొక్క సమస్త శ్రీ విలీనమయ్యెను. ఇప్పుడా యజ్ఞము స్మశానభూమివలెఁ గనబడు చుండెను. అందఱి చిత్తములు చింతాక్రాంతము లయ్యెను. స్త్రీలందఱును హా సతీ! యని రోదనము చేయసాగిరి. సర్వత్ర శోకము వ్యాపించెను. దక్షుని ముఖమును దిగజారిపోయెను. ఆతఁడు కొంచెమైన స్థిరముగ నుండఁజాలకపోయెను."



# దక్ష ధిక్కారము - శివగణ ప్రకోపము.

(౧౬౭)

శ్లో॥ సోఽయం దుర్మర్షహృదయో బ్రహ్మధ్రుక్ చ,
లోకేఽపకీర్తిం మహతీమవాప్స్యతి ।
యదంగజాం స్వాం పురుషద్విడుద్యతామ్
న ప్రత్యషేధన్మృతయేఽపరాధతః॥

— శ్రీభాగ. ౪ స్కం. ౪ అ. ౩౦ శ్లో.

గీ. దుష్టచిత్తుండు బ్రహ్మబంధుండు నయిన
యీతఁ డనయంబుఁ దా నపఖ్యాతిఁ బొందు
నిందఁబడి మీఁద దుర్గతి జెందుఁగాక
యనుచు జనములు వలుకు నయ్యవసరమున.

— శ్రీమదాంధ్రమహాభాగవతము.



కొందఱు స్వార్థవశమునను, ఈర్ష్యావశమునను సత్కార్యములను గూడ నిందించెదరు. కొందఱు భయవశమునను, లోభవశమునను నితరులను బ్రసన్నుల నొనర్చుటకై దుష్కార్యములనైనను బ్రశంసించుచుందురు. కాని మానసికముగ సర్వులు నిందితకార్యమును నిందించెదరు, ప్రశంసితకార్యమును బ్రశంసించెదరు. అట్లు కాకున్నచోఁ బ్రపంచమందు శుభకార్య మొనర్చుటలో నెవనికినిఁ బ్రవృత్తి యుండదు. సర్వసమర్పణము నకు మహత్త్వమేమియు నుండదు. పరిస్థితివశమున నెవఁడైన నేదైనఁ బలికినను జివరకు సత్కార్యముల కాదరమును, గుత్సితకార్యముల కనాదరమును బ్రపంచమునఁ గలుగును.

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! అంత ఱును జూచుచుండఁగనే సతీదేవి యోగాగ్నినిఁ బ్రజ్వలింపఁ జేసికొని శరీరమును త్యజించెను. ఇప్పుడామె శరీరము 'ఇ' శక్తి రహితమై 'శవ' మయ్యెను. దిశలం దంధకారము వ్యాపించెను. లజ్జావశమున సూర్యదేవుఁడు ముఖమును గప్పుకొనెను. దిశలన్నియును నీహారరూపమగు ముసుఁగును వైచుకొనినవి. భూత, ప్రేత, పిశాచము లాహాకారము చేయసాగినవి. గగనచారులగు దేవతాగణము త్రాహి త్రాహి యనుచు 'చెఱుపు జరిగినది, చెఱుపు జరిగిన'దనిరి. కొందఱు దేవాంగన లిట్లనిరి:- "అయ్యో! సతీదేవి తన శరీరమును వ్యర్థముగఁ ద్యజించినది."

ఇంకొకతె యిట్లనెను:- "శరీరత్యాగ మొనర్చుట యట్లుంచుఁడు, పాపమెంతో ప్రేమతోఁ దండ్రిమీఁద భక్తిచేఁ బరువిడి వచ్చినది. ఏదో బీదయింటిదియును గాదు. సమస్త చరాచర విశ్వమునకు స్వామియగు విశ్వనాథున కర్ధాంగిని. అట్టి యామెయెడల దక్షుని కిట్టి వ్యవహారము సర్వథా అనుచితము."

అంత నింకొకతె యిట్లనెను:- "ఎంతటి క్రూరులైనను దన పిల్లలందు ప్రేమ పెట్టుకొందురు. సింహ, వ్యాఘ్ర, శరభాదులన్నియును దమ పిల్లలను బ్రేమించును. సతీదేవి మిక్కిలి ఉదారచిత్త. ప్రాణులందఱకు నాదరపాత్ర. ఆమెను దిరస్కరించి దక్షుఁడు సుఖమును బొందఁజాలఁడు. ఈతనికి సర్వత్ర అపకీర్తి కలుగును. అందఱీతనిని ధిక్కరించెదరు."

ఇట్లెన్ని నోళ్లుండిన నన్ని మాటలు. లోకులందఱును వివిధ విధములఁ జర్చించుకొనుచుండిరి. ఇచ్చట శివపార్షద గణము సతీదేవియొక్క ప్రాణత్యాగమును గాంచి అత్యంత కుపితులైరి. వారు తమ స్వామినికి అవమానము జరుగుటచేఁ గ్రుద్ధులైరి. ఆమె ప్రాణమును వదలఁగానే వారందఱ క్రోధమునకు మేఱలేకుండెను. వారత్యంత కుపితులై తమతమ యస్త్ర శస్త్రములను గైకొని దక్షుని జంపుటకుఁ బరువిడిరి. వారు యజ్ఞ విధ్వంసనము చేయసాగిరి. అచ్చటనున్న వారందఱను జంపుటకు సిద్ధపడిరి. ఆ భూత పిశాచుల యీ యభిప్రాయమును గ్రహించి దక్షుఁడు తన యజ్ఞమున కాచార్యుఁడగు భృగు మహర్షితో నిట్లనెను:- "స్వామీ! ఈ భూత ప్రేత పిశాచాది శివగణములు చాల యుపద్రవము కావించుచున్నారు. మీ మంత్రసిద్ధిని గొంచెముగఁ జూపింపుఁడు, కాకున్న యజ్ఞమును నాశమొనర్చెదరు."

ఇది వినఁగానే భృగుమహర్షి యిట్లనెను:- "మీరు చింతింపకుఁడు. నా మంత్రములముందీ భూత, ప్రేత, పిశాచము లేమియును జేయఁజాలవు. నేను వీరందఱను బారఁద్రోలెదను." ఇట్లు పలికి భృగుమహర్షి యజ్ఞవిఘ్నముల నొనర్చువారిని నాశనమొనర్చు మంత్రములను సాంగోపాంగముగ సస్వరముగఁ బఠించి విధ్యుక్తముగ నగ్నియందు హోమము గావించెను. ఆతని మంత్రముల కమోఘమగు శక్తి గలదు. ఆతఁడు మంత్రములను విధ్యుక్తముగ సిద్ధికావించుకొనెను. అవి యెన్నడును వ్యర్థమగు మంత్రములు కావు. ఆతఁడా మంత్రములద్వారా దక్షిణాగ్నియందు హవనముచేయఁగానే యజ్ఞకుండమునుండి

ఋభువను దేవగణము లుద్భవించిరి. వారు సోమపులు. వారికి యజ్ఞమందు సోమపానమున కధికారము కలదు. యజ్ఞములందు విఘ్నములొనర్చువారిని నాశమొనర్చుటయే వారి పని. యజ్ఞములలో సాధారణముగా భూత, ప్రేత, పిశాచ, రాక్షసాది తమోగుణప్రధానులగు దేవతలే విఘ్నము లొనర్చుచుందురు. వారిని నాశమొనర్చుటకు బ్రహ్మతేజముచే దేదీప్యమానులగు నీ దేవగణములే సమర్థులు. అందువలన వీరు యజ్ఞభాగమున కధికారులైరి. యజ్ఞకుండమునుండి బయలువెడలుగానే ఋభువులు, చేతులం దగ్నిని గ్రహించి యజ్ఞవిధ్వంసనేచ్ఛచే ముందుకు దుముకుచున్న శివగణములను బాదిరి. బ్రహ్మతేజముచే దేదీప్యమానులైన దేవతల ప్రహారమును భరింపలేకపోవుటచే వారందఱును బారిపోయి నిలుచుండిరి. వారు పారిపోవుటను గాంచి దక్షుడు మిక్కిలి యానందమును జెందెను. ఒక విఘ్నము వచ్చి అది తప్పిపోయినది. భృగుమహర్షి కిని మిక్కిలి హర్షము కలిగెను. నా మంత్రములలో నెంతటి శక్తి కలదు! ఇంతటి ప్రబలులగు గుహ్యక, ప్రమథ, భూత, ప్రేత, పిశాచ, భేతాళాదులు భయముచే దశదిశలును బాఱిపోవుచున్నారు. ఇది క్షణికమగు శాంతిప్రయోగమనుసంగతి వీరికి తెలియదు.

అంత విదురుడిట్లడిగెను:-"స్వామీ! దక్షుడు ప్రత్యక్షముగ నన్యాయపథమున నున్నాడు. ఆతని యజ్ఞమును దంభయజ్ఞమే. శివగణములు సర్వసమర్థములు. వారి క్రోధమును న్యాయమే. అట్టియెడ శివగణము లేల బరాజితులైరి? న్యాయమార్గమున బోవుచున్నను ధర్మరక్ష జరుగదని తేలుచున్నది."

ఇది విని మైత్రేయమహాముని యిట్లనెను:– "విదురా! నీ ప్రశ్న గూఢమైనది. దీనిని నీవు బాగుగా శ్రద్ధతోఁ దెలిసి కొనవలయును. దక్షుని యజ్ఞము ద్వేషపూర్ణమైన దనుట సత్యమే యైనను దానిలో శాస్త్రీయవిధి యథాసాధ్యముగ గమనింపఁబడుచున్నది. ఏమైన గానిండు. దేవపూజాది శుభ కర్మ లున్నవి. ఈ యజ్ఞకారణమున నాతని దంభ, పాషండ, అహంకారముల బల మింకను నధికమైనది. కర్మ నిష్ఫలము కాదు. అది యేదో విధముగ వృద్ధికావించును. స్వస్థపురుషుఁడు ఘృతమును దినినచోఁ దేజో బల పరాక్రమాదులు వృద్ధినిఁ బొందును. కాని యా ఘృతమునే కాసరోగి తినినచో నా ఘృతము శారీరకబలమును వృద్ధిపొందింపకపోఁగా రోగబల మునే వృద్ధినిఁ బొందించును. బలవత్తరమగు నధర్మము నిర్బల మగు ధర్మము నణఁచివేయును. ప్రబల తమోగుణము మంద సత్త్వగుణము నణఁచివేయును. హిరణ్యకశిపు, హిరణ్యాక్షాది దైత్యులు తమోగుణప్రధానులే. రాత్రింబవళ్లు అన్యాయము, అత్యాచారములే చేయుచుండెడువారు. అయినను ప్రబల తమస్సు సత్త్వమును గప్పివేసెను. దేవతలు వారిముందు పారి పోవలసి వచ్చెను. భగవంతుఁడును దేవతలు ప్రార్థింపఁగా నాతఁ డిట్లనవలసివచ్చినది:– "నాయనలారా! ఇంకను వేచియుండ వలెను. ఇప్పుడింకను నేను జంపఁజాలను. కాలమాసన్నము కాఁగానే వారికివారే చంపఁబడుదురు. కాలమును బ్రతీక్షిం పుఁడు." ఆ తమస్సు ప్రహ్లాదుని ప్రబల సాత్త్వికభావముచేఁ గప్పఁబడఁగా భగవానుఁడు స్తంభమునుండి బయలువెడలి అందఱముందఱ హిరణ్యకశిపునిఁ జంపెను. సామెత కలదు –

ప్రపంచములో దుర్బలులకు గతిలేదు, ప్రబలతలోనే సిద్ధికలదు. నిర్బలుఁడు వైరమునుబెట్టుకొనిన వానికి వినాశమే కలుగును. కాని వైరముపెట్టుకొన్నను ప్రబలునితోడను, శత్రుత్వమును బెట్టుకొన్నను నత్యంత పరాక్రమవంతునితోడనే. చాలమంది అసురులు వైరభావమున భగవంతునితో శత్రుత్వమునువహించి ముక్తులైరి.

దక్షుని అభిమానగర్వములు, ప్రభావైశ్వర్యములు ఈ సాధారణ భూతప్రేత పిశాచములకంటెఁ ప్రబలమైనవి. కావున శివగణములు పరాజితులై పారిపోయిరి. అందఱికంటెఁ బరాక్రమములగు శివగణములు రాఁగానే వీరందఱ తేజస్సు హాత మారి పోఁగలదు. వీరందఱును దాము చేసినపనికి ఫలమును బొందఁగలరు. అందఱకును ఫల మనుభవమునకు రాఁగలదు. శివగణము ఏటిఏటి అందఱకును దడి తగిలింపఁగలరు.''

ఇది విని విదురుఁ డిట్లనెను:– ''స్వామీ! విషయము నాకు తెలిసినది. జయ పరాజయములు ప్రబలతమీఁద నాధార పడియున్నది. చివరకు విజయము ధర్మమునకే సంభవించును. ఏలననఁగా ధర్మ మధర్మము కంటెఁ బెద్దది. అయినప్పటికి అధర్మముయొక్క ప్రాబల్య మప్పుడప్పుడు కలుగుచుండును. అయితే తర్వాత నేమైనది?''

అంత మైత్రేయుఁడిట్లనెను:– ''విదురా! తర్వాత నేమైనది? ఏమికావలయునో అదియే యైనది. వైరమునకుఁ బరిణామము కలహము. కలహరూపమగు వృక్షమునకు ఫలము దెబ్బలాట, జగడము, రక్తపాతము. అదియే చివరకు జరిగినది.

దేవర్షి యగు నారదుఁ డిచ్చటి విషయము లచ్చట చెప్పుటలో నానందము ననుభవించుచుండును. సతీదేవి భస్మము కాఁగానే నారదుఁడు తన వీణను ధరించి గబగబ శివుని సమీపమునకుఁ బోయెను.''

మైత్రేయమహాముని యిట్లనెను:- ''విదురా! సదాశివుఁడగు భోలేనాథుఁడు తన ప్రాణప్రియయగు సతీదేవిని గూర్చి ఆలోచించుచుంతలో నారదుఁడు వెళ్లి శివచరణారవిందములకుఁ బ్రణామము కావించెను.''



# శివక్రోధము - వీరభద్రోత్పత్తి.

## (౨౦౦)

శ్లో॥ భావో భవాన్యా నిధనం ప్రజాపతే
రసత్కృతాయా అవగమ్య నారదాత్ ।
స్వపార్షదసైన్యం చ తదధ్వరర్భుభి
ర్విద్రావితం క్రోధమపార మాదధే॥

—శ్రీభాగ. ౪ స్కం. ౫ అ. ౧ శ్లో.

వ. "ఇట్లు దక్షిణాగ్నియందు వేల్చిన నందుఁ దపంబొనర్చి సోమ లోకంబున నుండు సహస్రసంఖ్యలు గల ఋభు నామధేయు లైన దేవతలుదయించి బ్రహ్మ తేజంబునం జేసి దివ్యవిమా నులై యుల్ముకంబులు సాధనంబులుగా ధరియించి రుద్ర పార్షదులయిన ప్రమథ గుహ్యక గణంబులఁ బాఱందోలిన వారును బరాజితులైరి తదనంతరంబ నారదువలన నభవుండు దండ్రిచే నసత్కృతురాలగుటం జేసి భవాని పంచత్వంబు నొందుటయుం బ్రమథగణంబులు ఋభునామక దేవతలచేఁ బరాజితులగుటయు విని." —శ్రీమదాంధ్రమహాభాగవతము.



ఎదుట నుండినఁ బ్రేమ విడిపోవును. దాని యనుభవ ముండదు. ఒక వ్యాపారికిగల ధనము పనివాండ్రలో నున్నది. అదియంతయు నాతని యధీనమే అయియున్నను విడివిడిగా నుండుటచే దాని గురుత్వము కనఁబడదు. అవియే ఒక్కసారిగా వసూలైనపుడు 'ఇంతధనము నావద్ద నున్న'దనిపించును. తనకుఁ బ్రేమాస్పదులైనవారు సమ్ముఖమున నుండినచో నొక్కొక్క

క్కప్పుడు వాని చిత్త మామె సుమధురహాస్యమందు లగ్నమగును. ఒక్కొక్కప్పుడు ఆమె యమృతమయ, మధుమయ, కర్ణరసాయనమగు వాక్కునందు మగ్నమగును. మఱొకప్పుడు ఆమె సుందర శరీరసౌందర్యమందు మఱచిపోవుదురు. ఇంకొకప్పుడు ఆమె సౌందర్యమాధుర్యమందు తన్నుఁ దానే మఱతురు. ఆకటా నాఁకత్తైనవానిముం దనేక పళ్లెరములలో రుచ్యములగు వ్యంజనములను బెట్టినచో నెంతగాఁ దినవలయునో అంతగాఁ దినఁజాలఁడు. ఇన్ని పదార్థముల నొక్కసారిగాఁ జూచునప్పటికి వానికి మొగము మొత్తును. ఆఁకలిమహిమ భోజనము దూరముగ నున్నప్పుడును, అన్నము దొఱకనప్పుడును దెలియఁగలదు. ప్రియులు దూరముగ నున్నప్పుడు చిత్తము సదా వారిమీఁదనే యుండును. చిత్తమునకు గోచరించినప్పుడు ప్రేమ పొంగినట్లు ప్రత్యక్షముగ లభించినఁ బొంగదు. మానవప్రేమ గుణములు పరోక్షముననే తెలియఁగలవు.

మైత్రేయమహాముని యిట్లనెను:— “విదురా! సతీదేవి భర్తకుఁ జెప్పకయే, శివుఁడు వలదన్నను హఠపూర్వకముగ, స్వేచ్ఛగా, శివుని యాజ్ఞను అవహేళనము కావించి వెళ్లినది. ఆసమయమున నీక్రియవలన శివునకు హఠకారణమున క్షోభము కలిగినప్పటికిని నామెయెడల నాతఁడుదాసీనుఁడయ్యెను. ఇట్లుండియు నారదుఁడు వచ్చి యామె వినాశము విషయము చెప్పునప్పటికి శివుఁడు తన్నుఁదాను నిగ్రహించుకొనఁజాలకపోయెను. సతీదేవి యోగాగ్నియందు భస్మమైన సమాచారమువలననే అతనిహృదయమునఁ బ్రేమ ముప్పొంగెను. ‘అయ్యో! ప్రియా! నేను నీకు నా యర్ధాంగము నొసంగితిని. అది నీయోగాగ్నిలో

దక్షుని అవమానకారణమున భస్మమైనది. నా కారణమునఁ దన కడుపునఁ బుట్టిన పుత్రికనైనను శత్రువుగా నెంచుకొను నంతటి విధముగ దక్షుఁడు సిద్ధపడినాఁడు. నేను నా యవమానమునైన సహింపఁగలనుగాని నా భక్తుల యవమానమును సహింపఁజాలను. నాకు ద్రోహ మొనర్చినను నిస్తారముకలుగును గాని **నా** భక్తుల కపరాధ మొనర్చినచో నాతఁడు రక్షింపఁబడఁ జాలఁడు. నేఁడు దక్షుని యభిమానమును నాశ మొనర్చెదను, ఆతని గర్వమును ఖర్వము కావించెదను. ఆతని మదమును జూర్ణము కావించెదను. ఆతఁడు చేసిన పనికి ఫల మనుభవింపఁ జేసెదను. సతీదేవి కవమాన మొనర్చిన నెవనికిని కల్యాణము లేదని చెప్పెదను' అని యనుకొనుచుండఁగనే రుద్రునకుఁ గ్రోధము వచ్చెను. ఆతని భుజదండము లదరసాగెను. కన్ను లెఱ్ఱనయ్యెను. భ్రుకుటీద్వయమును ముడుచుకొనెను. దంతములతోఁ బెదవులను గొఱుకుచుఁ బసుపుపచ్చగా సువర్ణము వలెను, మెఱుఁగు తీఁగవలెను వెలుఁగుచున్న జడలలోనుండి యొక జడను పెఱికి వేగముగ నేలకువైచి కొట్టెను. ఆ దెబ్బతో శివునికి సమానుఁడగు నొక భయంకర పురుషుఁ డుత్పన్న మయ్యెను. ఆ పురుషుఁడు శ్రేష్ఠ హిమాలయశిఖరము సజీవమై శివుని యెదుట నిలువఁబడినట్లుండెను. ఆతఁడు తన విశాల కాయముచే దశదిశల నావరించెను. ఆతని కిరీటము గగనమును జుంబించుచుండెను. నీలాంజన పర్వతమువలె నాతఁడు శ్యామ వర్ణముగ నుండెను. జలభరితమగు మేఘము నేలనుండి నింగి

వఱకు వ్యాపించినట్లుతఁడుండెను. ఆతని ముఖమండలము విశా లముగను, వెడల్పుగను, భయంకరముగను నుండెను. సూర్య చంద్రాగ్ను లోకానోక పర్వతశిఖరమున వెలుఁగుచున్నట్లాతని త్రినేత్రములు వెలుఁగుచుండెను. ఆతనికిగల కేశము లెఱ్ఱగా మడమల వఱకు వ్రేలాడుచు నొకానొక గిరిశృంగమునకుఁ బ్రాకుచున్న మంటలున్నట్లుండెను. ఆతని ముఖము గిరి గహ్వరమువలె నుండెను. ఆతనినోట కఱ్ఱువలె నెఱ్ఱని నాలుక తీక్ష్ణముగ మెఱయుచుండెను. ఆతనికి వేయిచేతులుండెను. వానిలో ననేక విధములగు నస్త్రశస్త్రములుండి విశాల వట వృక్షముపై గరుడుఁడు కూర్చుండి గజ కచ్ఛపములను దిను చున్నట్లుండెను. దాని కొమ్మలు నూఱునూఱు యోజనముల పొడవుండెను. వానియందు తలక్రిందుగా వ్రేలాడుచున్న వాల ఖిల్యమునులు తపస్సు చేయుచున్నట్లుండెను. నారదుఁ డాతని యీరూపమును గాంచి భయపడెను. ఆతఁడు మెదలకుండ తన వీణెను గైకొని మెల్లగా జారుకొనెను. శివునకుఁ బ్రణామ మొనర్చుటయును మఱచిపోయెను. ఆతఁడు రుద్రపుత్రుఁడు కదా! ఇచ్చటనుండియే దాడి ప్రారంభించుచో నిఁక నేమున్నది? నారదుఁడు రొప్పుచు నావలికిఁబోయి వ్రేళ్లతో వీణెను మీటుచు స్వస్థచిత్తుఁడై జయజయ రామకృష్ణ హరి యనుచుఁ బాడసాగెను.

అచ్చట వీరభద్రుఁ డుద్భవింపఁగనే నలువైపులఁ జూచెను. ఆతఁడు త్రిలోకములను మ్రింగ నుంకించుచున్నాడా యనునట్లుండెను. తనకు దగ్గఱగా నెవ్వరును లేకుండుటను గాంచి, చేతులను జోడించుకొని మిక్కిలి దీనముగ శివునితో

నిట్లనెను:- "ప్రభూ! మీరు నన్నేలఁ బుట్టించితిరి? నాకు మీరేమి పనినిఁ జెప్పెదరు? మీరాజ్ఞాపించుచో నేనీక్షణము ననే సప్తసముద్రముల నింకింపఁజేసెదను. మీయాజ్ఞ యగుచో సుమేరు పర్వతమును బెల్లగించి చూర్ణము కావించెదను. మీ యాజ్ఞయగుచో నేను త్రిలోకములను నాశము కావించెదను. నాలో సర్వసామర్థ్య మున్నది. నే నీ పృథివి నెత్తి రసాతలమునకుఁ బడవేయఁగలను. దిగ్గజముల దంతములను బట్టుకొని నూగులాడింపఁగలను. లోకపాలుర రాజధానులను పెకలించి రసాతలమునఁ బడవేయఁగలను. ప్రళయకాల మాసన్నము కాకపోయినను ప్రళయము కావింపఁగలను."

వీరభద్రుఁ డిట్లు వీరభరితవాక్యములను బలుకఁగా సదాశివుఁ డాతనియెడలఁ బ్రసన్నుఁడై యిట్లనెను:- "ఈ సమయమునఁ బ్రళయ మొనర్ప నాకు కోరిక లేదు. ఏ దుష్టుఁడగు దక్షుని కారణమున నా ప్రాణప్రియయగు సతీదేవి తన దుస్త్యజ ప్రాణములను త్యజించినదో ఆతనిని నీవు వెళ్లి చంపివేయుము. వాని దంభయజ్ఞమును విధ్వంసము కావింపుము. ఆతనిననుమోదించు అనుయాయుల నందఱను దండించుము. సతీదేవి కపకార మొనర్చినవారి నందఱను నాశము చేయుము. నీవు భయపడకుము. నీవు నా యంశమునఁ బుట్టితివి. నేఁటినుండి నీవు నా గణములందు సర్వశ్రేష్ఠుఁడవుగఁ బరిగణింపఁబడుదువు. నా ప్రధానపార్షదు లందఱకును నిన్నధ్యక్షునిగా నొనర్చుచున్నాను. నీవు సతీదేవితండ్రిపై కసిని దీర్చుకొనుము. ఆతఁడు చేసిన యపరాధమునకు తగిన శిక్ష నొసంగుము."

ఇది వినఁగానే వీరభద్రుఁడు ప్రసన్నతను ప్రకటించుచు నిట్లనెను:– "ఈ యల్పకార్యమునకేనా నన్నుత్పన్నము కావించినది. నేను త్రిలోకములను సంహరించుటకు సమర్థుఁడను. దక్షుఁడు నాముందు దేనికి పనికివచ్చును? ఆతఁడేమి లెక్క? ఆతని యజ్ఞమును, ఆతని యనుయాయులను, ఆతని సంబంధులను, ఆతని ననుమోదించువారలను నాశనము కావించి మీ చరణసన్నిధికి రాఁగలను."

మైత్రేయుఁడిట్లనెను:–"విదురా! ఇట్లు పలికి వీరభద్రుఁడు శివునకుఁ బ్రదక్షిణ మొనర్చెను. ఆతనికి శ్రద్ధాభక్తులతోఁ బ్రణామ మొనర్చి యాతఁడు దక్షయజ్ఞమువైపునకుఁ బోయెను."



# దక్షయజ్ఞవిధ్వంసనమునకు వీరభద్రుండు వెళ్లుట.

(౨౦౧)

శ్లో॥ అన్వీయ మానః స తు రుద్ర పార్శ్వదై
ర్భృశం నదద్భిర్వ్యనదత్సు భైరవమ్ ।
ఉద్యమ్య శూలం జగదంత కాంత కమ్
స ప్రాద్రవద్ఘోషణ భూషణాంఘ్రిః ॥

—శ్రీభాగ. ౪ స్కం. ౫ అ. ౬ శ్లో॥

చ. అనఘుఁడు రుద్రుఁ జేరి ముదమారఁ బ్రదక్షిణమాచరించి వీ
డ్కొని యనివార్యవేగమునఁ గుంభిని గ్రక్కదలన్ ఝుళంఝుళ
ధ్వని మణినూపురంబులు పదంబులమ్రోయఁగ భీషణప్రభల్
దనరఁ గృతాంతకాంతకశితస్ఫుటశూలముఁబూనిచెచ్చెరన్ ॥

—శ్రీమదాంధ్రమహాభాగవతము.

---

ఒక సామెత కలదు:— "అసలే తిప్పతీఁగె చేదు, అది వేఁపచెట్టెక్కినది" ఇఁక దాని చేదు నడుగవలసిన పని యేమున్నది? రుద్రుఁడు అసలే సంహారకుఁడు. మూర్తీభవించిన క్రోధము. క్రోధముచే నాశనమొనర్చుటకు సృష్టించిన వీరభద్రుని గూర్చి అడుగవలసిన దేమున్నది? వీరభద్రుఁడు మూర్తీభవించిన ప్రలయమువలెఁ గనఁబడుచుండెను. ఆతని భయంకరరూపము, క్రోధముచే నెఱ్ఱబడిన ముఖమండలమును గాంచి ప్రపంచములోని సమస్త ప్రాణులును గడగడ వణఁకుచుండిరి. ఆ సమయమున నాతఁడు ప్రత్యక్ష ప్రలయాగ్నివలెఁ గనఁబడుచుండెను.

మైత్రేయమహాముని యిట్లనెను:— "వీరభద్రుండు దక్ష యజ్ఞ విధ్వంస మొనర్చుటకు విశ్వేశునివలన నాజ్ఞనుగొని వేల సహస్రభుజములందు వివిధవిధములగు నస్త్రములను గొనిపోవుట కుద్యుక్తుండయ్యెను. అప్పు డాతండు సతిశిరస్సుక్రిందుగ శివునితో నిట్లనెను:— "ప్రభూ! నేనొక్కండనే చాలును. నా వెంట నితర శివగణములు, పార్షదులయొక్క అవసర మేమున్నది ?"

శివుండిట్లనెను:— "అట్లుకాదు, అట్టహాసముగ సేనసహిత ముగ పొమ్ము. ఈతండెవండో అసాధ్యుడనుకొనుటకు వీలుగ నుండును గావున గుంపును వెంటను దీసికొని పొమ్ము. ఒంటరిగా వెళ్లినం గొందఱు తెలిసికొనవచ్చును, కొందఱు తెలిసికొనం జాలకపోవచ్చును. కావున నా గణములన్నిటిని, పార్షదులను గైకొని, కోలాహల మొనర్చుచు, భూమిని వణంకించుచు, నందఱను భయపెట్టుచు, గర్జించుచు, దక్షుని స్వజనులను భయభీతుల నొనర్చుచు నాడుచుం బాడుచు, కేకలు వేయుచు వెళ్లుము."

వీరభద్రుండు చేతులు జోడించుకొని యిట్లనెను:— "మంచిది, స్వామీ !"

అప్పుడాతండు నందికిని, భృంగికిని నాజ్ఞ నొసంగెను. "సేన తయారుకావలెను. నల్లవారు, కరాళముఖమువారు, బొచ్చెలవారు సిద్ధపడవలెను. రుద్రపార్షదులందఱును దమతమ వేషములను వేసికొని యుద్ధమునకు సన్నద్ధము కావలెను."

వీరభద్రుని యాజ్ఞ కాంగానే అందఱును దమతమ శరీ రములందు భస్మమును బూసికొనిరి. రుద్రాక్షమాలలను ధరిం

చిరి. అందఱి శిరస్సులమీఁదఁ జంద్రుఁడు శోభించుచుండెను. అందఱును వృషభముల నధిరోహించిరి. అందఱికును మూఁడు నేత్రము లుండెను. ఈ విధముగ నాయత్తులై భూత, ప్రేత, పిశాచ, డాకినీ, శాకినీ, ప్రమథ, గుహ్యక, కూశ్మాండ, కర్పట, వటుక, భైరవ, బ్రహ్మరాక్షస, క్షేత్రపాల, వినాయక, యక్ష, రాక్షసాదు లందఱును నస్త్రశస్త్రములచే సుసజ్జితులై, కోలాహల మొనర్చుచు వెళ్లుట కుద్యుక్తులైరి. అఱువదినలుగురు యోగినులు తమతమ పుఱ్ఱెచిప్పలను సవరించుకొని, కేశములను విఱియవైచుకొని, జిహ్వలను బయటకు లోపలకు లాగుచుఁ జప్పరించుచుఁ ద్రిశూలములను ద్రిప్పుచు, దంతములను జూపించుచుఁ, బెదవులను నాకుచు వెళ్లుచుండిరి. ముందుగాఁ గాళి, కాత్యాయనీ, ఈశానీ, చాముండా, మర్దిని భద్రకాళి, భద్రా, త్వరితా, వైష్ణవీ యను నీ నవదుర్గలు కిలకిలారవములొనర్చుచు వెళ్లిరి. భూతప్రేతములు హాహా, హూహూ శబ్దము లొనర్చుచు దిశలను గంపింపఁజేయుచుండిరి. అందఱును నత్యుత్సాహమున నిండియుండిరి. సతీదేవి పోవుటవలన నందఱికును రోమరోమము లందు గ్రోధము వ్యాపించియుండెను. అందఱును రక్తపాన తృషార్తులై యుండిరి. ఈ విధముగ నందఱును సుసజ్జితులై అస్త్రశస్త్రధరులై శివపార్షదగణము కనఖలమువైపుగా వెళ్లుచుండిరి. వారు వాయువేగమునకంటె మిక్కిలి ద్రుతగతితో వెళ్లుచుండిరి. అందఱు దక్షుని నాశ మొనర్పవలయునని యువ్విళ్లూరుచుండిరి. అందఱికంటె ముందు తమ పాద నూపురములను గలగలమని మ్రోగించుచు, త్రిశూలమును ద్రిప్పుచు, శివపార్షదుల కుత్సాహము నినుమడించుచు, దిశలను గంపింపఁజేయుచు,

ధూళిని రేపుచు, నత్యధికోత్సాహమును బ్రదర్శించుచు వీర భద్రుఁడు వెళ్లుచుండెను. ఆ సమయమున నాతని వేగ మసహ్యముగ నుండెను. ఎవ్వఁడు నాతని నెదుర్కొనఁజాలకుండిరి. ఈ విధముగ క్షణకాలమున కాతఁడు సపరివారముగ యజ్ఞశాల కడకుఁ జేరెను.

ఇచ్చట రుద్రపార్షదులు పరాజితులగుటచేఁ బ్రసన్నులై ప్రజాపతులును, వారి పురోహితులును యజ్ఞకార్యమును మరల నారంభించుట కుద్యుక్తులగునంతలో నుత్తరదిశనుండి వారికి గొప్ప కోలాహలము వినఁబడెను. దాని వెంటనే సముద్ర భీషణ వేగమువలె నెగురుచున్న ధూళి కనఁబడెను. ఈ కోలాహలమును, ధూళినిఁ జూడఁగనే అందఱియొక్క ధైర్యములు దిగ జారిపోయెను. యజ్ఞములోఁ గూర్చుండిన ఋత్విజులు, యజమాని, సదస్యులు, అన్యబ్రాహ్మణులు, అతిథులు అందఱును గాభరాపడిరి. పురుషులకంటె స్త్రీ లెక్కువగ భయపడిరి. వారు పరస్పరము భయముచేఁ గాతరులై, ఆ వైపునకే చూచుచుఁ దమలోఁ దాము వివిధతర్కములను జేయసాగిరి. ఒకతె యిట్లనెను:—"ఈ కోలాహల మెచ్చటనుండి వినఁబడుచున్నది? ఇంకొకతె యిట్లనెను:—"ఎచ్చటనైన నిప్పంటుకొనినదేమో, దానిలోఁ దగులబడి అసంఖ్యాకులు హాహాకారములు చేయుచుండియుందురు." ఇంకొకతె దానిని ఖండించుచు నిట్లనెను:— "లేదమ్మా, అగ్ని లేదు. ప్రత్యక్షముగ ధూళి కనఁబడుచున్నది. పదాహతిని ధూళి రేగుచున్నట్లుండెను"

అంత నింకొకతె యిట్లనెను:— "ధూళి రేగుటకు కారణ మేమియును గనఁబడుట లేదు. తుపాను రేగు సమయము కాదు,

వాన మబ్బు లేదు. పోనిండు, దొంగలు, దోపిడిగాండ్రు గుంపు లుగా వచ్చుచున్నారందమా దక్షప్రజాపతియుండగా దొంగల కింతటి సాహస ముండఁజాలదు. దొంగ లుండనే యుండరు. గోవులమందలు వచ్చిన ధూళి రేగును కాని యిది గోవులువచ్చు సమయము కాదు. గోధూళికావేళయందే యిట్టి దుమ్ము రేగును."

స్త్రీల యీమాటలను వినఁగానే దక్షునిభార్య ప్రసూతికి మిక్కిలి దుఃఖము కలిగెను. ఆమె తన కత్యంత ప్రియపుత్రియగు సతీవియోగముచే నత్యంత దుఃఖిత యయ్యెను. తన పుత్రియెడల దక్షుని యీ వ్యవహారము చాల చెడ్డదిగ నుండెను. అత్యంత ఖిన్నమనస్కయై అట్లు మాటలాడుకొనుచున్న స్త్రీలతో నిట్లనెను:- "ఇచ్చట తుపాను లేదు, గోఖురధూళియును లేదు. ఇది దోపిడివాండ్ర హాహాకారమును గాదు, శత్రురాజసేనా కోలాహలమును గాదు. వీరు మూర్తీభవించిన శివునికోపము శరీరమును ధరించి మనల నందఱను వినాశము కావించుటకు వచ్చుచున్నారు. శివుఁడు క్రుద్ధుఁడై మన సర్వస్వమును నాశము గావించును. క్రుద్ధుఁడగుటకుఁ గారణము కలదుకదా! పాపము నిరపరాధియగు సతీదేవికి తల్లి, తోఁబుట్టువులు, నరనారీమణులు చూచుచుండ ప్రజాపతి ఘోరాన్యాయము ఘోరావమానము గావించెను. ఈ కారణమునఁ గపర్ది క్రుద్ధుఁడయ్యెను. ఇప్పుడు మనకందఱకును కల్యాణములేదు. ఈ కోపమునుండి తప్పించు కొనుటకు వేఱుపాయములేదు."

అంత నొకానొక ఆశ్రితస్త్రీ యిట్లనెను:- "మన మహారాజు తక్కువవాఁడా యేమి? యజ్ఞమున కెవరైన విఘ్నము

గావించినచో నాతఁడు దానికిఁ బ్రతీకార మొనర్పఁగలఁడు. మీరందఱే యందఱును బ్రత్యక్షముగఁ జూచిరికదా! భూత ప్రేత పిశాచగణము మన స్వామివైపు క్రుద్ధులై చూచుచుఁ బారి పోయిరి. భృగుమహర్షి నిమిషములోఁ దన మంత్రముల ప్రభావముచే వారినిఁ బాఱఁద్రోలిరి. అందఱును నెత్తినఁ గాళ్లు పెట్టుకొని పరుగిడిరి. ఇప్పుడింక నెవరైన వచ్చుచో వారికి నిట్లే చేయఁగలము. వారును బరాజితులై పోఁగలరు."

అంతఁ బ్రసూతిమహారాణి యిట్లనెను:—"ఇప్పుడు వచ్చుచున్నది సర్వనాశము శివక్రోధము. ఇది పాఱిపోవునది కాదు. శివుని కోపాగ్నిముందు నిలుచుండుట కెవరికి సామర్థ్యముకలదు? సృష్ట్యంతమున నాతఁడు తన జటాజూటమును విఱియఁబోసికొని, మూఁడవకన్నును దెఱచి శివుఁడు కోపించి, తన త్రిశూలపు మొనచే దిగ్గజములను గ్రుచ్చి విశ్వసంహారప్రవృత్తుఁడైనపు డా వేగము నాపుటకు సామర్థ్య మెవనిలోఁగలదు? ఆతఁ డట్టహాసముతో పదిదెసలను గంపింపఁజేయుచుఁ ద్రిశూలము నెత్తి, డమరువు మ్రోగించి, గజచర్మమును జాడించి, జడలు విఱియఁబోసికొని, నృత్యమొనర్చుచున్న సమయమున నా పరాక్రమమును సహించుశక్తి యే శరీరికి కలదు? ఆతని భ్రుకుటివిలాసమున నుత్పన్నమైన ప్రళయాగ్ని సమ్ముఖమున నిలుచు శక్తి యెవనికిఁ గలదు? ఎవని వికరాళ కరాళ దంతములమధ్య నసంఖ్యాక బ్రహ్మాండములు సెనగలువలెఁ జూర్ణమగుచుండగా నా యొక్క క్రోధమూర్తియగు విశ్వనాథుని వేగముందఱ విధాతయు నిలువఁజాలఁడు. ఇఁక దక్షప్రజాపతి, ఆతని యనుయాయులు లెక్కయేమి?"

ఈ విధముగ దక్షుని యజ్ఞశాలయందుఁ గూర్చున్న స్త్రీలు వీరభద్రుని సేనావేగసంబంధమున వివిధవిధముల మాటలాడుకొనుచుండుసంతలో తన ముకుటము స్వర్గమును జుంబించుచుండ, సహస్రభుజములందు వివిధాస్త్రములను ధరించుచు, శివగణములు రుద్రపార్షదులు పరివేష్టించియుండ వీరభద్రుఁడు కనఁబడెను. ఆతని వెంట శివగణము విచిత్రప్రకారములుగ నుండిరి. ఆతని రూపము భయానకముగ నుండెను. ఆకృతి భయంకరముగ నుండెను. వారిలోఁ గొందఱు చిన్నవారు, కొందఱు పెద్దవారు, కొందఱవి పిల్లికండ్లు, కొందఱకు మూఁడు కండ్లు, కొందఱ కైదు, ఏడు, పదునొకండు, వేయి, రెండు వేలు నేత్రములుండెను. కొందఱు గూనివారు, కొందఱు పొట్టివారు, కొందఱు పొడుగువారు, కొందఱు బక్కవారుగ నుండిరి. కొందఱకు గాడిదముఖములు, కొందఱవి పందిముఖములు. కొందఱ పెదవులు మొఱికివి. కొందఱ పెదవులు కాళ్లవఱకు వ్రేలాడుచున్నవి. కొందఱకు రెండు శిరస్సులు. కొందఱకు పది. ఇరువది, నూరు తలలుండెను. కొందఱు తలలు లేకుండిరి. కొందఱకుఁ బొట్టలోనే తలలుండెను. కొందఱు నవ్వుచుండిరి. కొందఱు పాడుచుండిరి, కొంద ఱేడ్చుచుండిరి, కొంద ఱఱచుచుండిరి. కొందఱు కొట్టుఁడు, కోయుఁడు, పట్టుఁడు, కట్టుఁడు, తన్నుఁడు, బాదుఁడు అను శబ్దములు పలుకుచుండిరి. వారి వైఖరి విచిత్రముగ నుండెను. కొంద ఱేనుఁగులపైనను, కొందఱు గుఱ్ఱములపైనను, కొందఱు ఒంటెలపైనను, కొందఱు గాడిదలు, కంచరగాడిదలు, కుందేళ్లు, తోడేళ్లు, నక్కలు, కుక్కలు, మేఁకలు, గొఱ్ఱెలు, జింకలు, సింహ, వ్యాఘ్రములు, ఎలుకలు,

గ్బిలములు, పావురములు, గుడ్లగూబలు, ఊరబిల్లులు వీని మీఁద నెక్కిరి. వారి యాకృతులు విచిత్రములుగ నుండెను. కొందఱు నోరు తెఱచుచుండిరి. కొందఱూరక యఱచుచుండిరి. కొందఱు గ్రుడ్లనుఱిమిరి. స్త్రీలను భయపెట్టుచుండిరి. కొందఱు తాకధినా ధిను తాకధినా ధిక్ తాక్ ధినా ధిక్ తాక్ అని తాళములు కొట్టుచు, మూఁతిని ముడుచుచు, రుద్రాక్షలను ద్రిప్పుచుఁ దాండవనృత్య మొనర్చుచుండిరి. వారు రాఁగానే యెవరి నడుగక పెట్టకయే, నిర్లక్ష్యముతో యజ్ఞమంటమునకు నలువైపులను జుట్టుకొనిరి.

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! ఈ విధముగ రుద్రపార్షదులు యజ్ఞమంటమును జుట్టుకొనఁగా నచ్చటఁ గూర్చుండిన స్త్రీలును, బురుషులును భయకారణమున గడగడ వణఁకుచుండిరి. ఇఁక శుభములేదని అందఱును దెలిసికొనిరి. దక్షునికారణమునఁ దమ ప్రాణములకే హాని వచ్చినదనుకొని అందఱు నటునిటుఁ బరువిడసాగిరి. యజ్ఞమంటమున సర్వత్ర కోలాహలము ప్రారంభమయ్యెను."



# రుద్రపార్షదులచే దక్షయజ్ఞ విధ్వంసనము.

## (౨౦౨)

శ్లో॥ సర్వ ఏవర్త్విజో దృష్ట్వా సదస్యాః సదివౌకసః ।
తైరర్ద్యమానాః సుభృశం గ్రావభి ర్నైకధా ద్రవన్॥
జుహ్వతః స్రువహ స్తస్య శ్మశ్రూణి భగవాన్భవః ।
భృగోర్లులుంచే సదసి యోఽహసచ్ఛ్మశ్రు దర్శయన్॥

—శ్రీభాగ. ౪ స్కం. ౫ అ. ౧౮, ౧౯ శ్లో.

వ. ......ఇవ్విధంబున సదస్య దేవ ర్త్విజ్నికాయంబుల శిలల నువ్వియు జానువులఁ బొడిచియు నఱచేతుల నడిచియు గుల్ఫంబుల బొడిచియు వివిధబాధలు వఱచిన వారు కాందిశీకులై యెక్కడెక్కడేనిం జనిరి మఱియును.

కం. తగ వేది దక్షుఁడా సభ
నగచాపుఁ దిరస్కరించునాఁడట శ్మశ్రుల్
నగుచుం జూపుట నా భృగు
పగకై శ్మశ్రువులు వీరభద్రుఁడు వెఱికెన్.

—శ్రీమదాంధ్రమహాభాగవతము.

---

మానవుఁడు కర్మననుసరించి ఫలమును బొందును. మన మొకరిని నేడ్పించుచో మనమును గంట నీరు పెట్టవలసినదే. మన మెవరినైన దుఃఖముపెట్టుచో మనమును మహాక్లేశమును బొందవలసివచ్చును. మన మెవరినైన నిందించుచో మనమును ప్రపంచమున నిందపడవలసివచ్చును. మన మెవనికైన గోతులను

ప్రపంచమున నెట్టి ధ్వనిఁ జేయుదుమో అట్టి ప్రతిధ్వనియే వినఁబడును. నేఁ డీ ప్రపంచమున నెవనినైన నెగతాళిచేసినచో నీవిషయము లన్నియు నొకానొకప్పు డొక పెద్ద కార్యాలయమున లిఖింపఁ బడునను సంగతి మఱచిపోవుచుందుము. ఇతరులను బాధపెట్టు సమయమునను, నిందించుసమయమునను మన మంధుల మగు దుందుము అట్టిదే మనకు వచ్చినపుడు మనకు బుద్ధి కలుగును. ఇదెక్కడిపాపము వచ్చినదని మన మనుకొందుము.

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! ప్రజాపతి యజ్ఞమందు భృగుమహర్షియే తన గడ్డము నూగించి దక్షు ననుమోదించినాఁడు. భగుడు గ్రుడ్లనుఱిమినాఁడు. పూషుఁడు శివుని నపహాస్యమాడి పండ్లను జూపించుచు నట్టహాస మొనర్చెను. మన పనుల నెవరుచూచినారని వీరనుకొనుచుం డిరి; కాని నందీశ్వరుఁ డన్నిటిని హృదయమున లిఖించుచుం డెను. సమయమువచ్చినపు డందఱును దెలిసికొందురులే యని యతఁ డనుకొనెను. శివపార్షదులు నేఁడు యజ్ఞముపై దాడి వెడలఁగానే నందీశ్వరునకు ప్రజాపతియజ్ఞములోని సమస్త విషయములు మరల స్మరణమునకు వచ్చెను.

రుద్రగణములోని వారందఱు నున్మత్తులైరి; అందఱును క్రోధభరితులైరి. అందఱు నుద్దండులే. అందఱును వికృత వేషము కలవారే. వారికి సభ్యతాసభ్యతలతో నేమి ప్రయోజనము? మదసంభరితులై సమస్త భూత, ప్రేత, పిశాచగణము నిర్భయులై యజ్ఞమండపమునఁ జొరబడి వెంటనే అన్నిటిని విఱుగఁగొట్టి నాశనముచేయ నారంభించిరి. యజ్ఞశాలకు పశ్చిమము

స్తంభములమీఁద పూర్వపశ్చిమములుగఁ గట్టఁబడిన నడ్డ స్తంభ
మును భూతములు ముందుగా విఱుగఁగొట్టిరి. దాని ప్రక్కనే
యజమాని పత్నికొఱకు నిర్మింపఁబడిన శాలను ఛిన్నభిన్నము
కావించిరి. చాలమంది వేదినిఁ బెల్లగింపసాగిరి. కొందఱు ద్రేక
మున భోజనశాలలోనికిఁ బ్రవేశించిరి. అచ్చట సుగంధము
వలన వారు నాశనమొనర్చుటను మఱచిరి. కొందఱు లడ్లను
నోటనింపుకొనిరి. ఒకానొకఁడు హల్వాయున్న బాణలిలో
జేతినిఁ బెట్టఁగాఁ జేతులు కాలెను. ఆతఁడు చేతులు విదిలించు
కొనుచుఁ బాఱిపోయెను. ఒకానొక బ్రహ్మరాక్షసికి హల్వా
చేయువిధి తెలియును. ఏలననఁగా నాతఁడును నిదివఱకు
వేదజ్ఞుఁడగు బ్రాహ్మణుఁడే. విధిహీనమగు యజ్ఞము నొనర్చు
టచే బ్రహ్మరాక్షసుఁడైనాఁడు. ఆతఁడు బాణలినిఁ గ్రిందకుఁ
ద్రోసివైచెను. అప్పుడది చల్లారెను. అప్పుడందఱును మెక్క
సాగిరి. కొందఱు పాయసము ద్రావసాగిరి. కొందఱు
బొబ్బట్లను జప్పరించిరి. ఒకానొకఁడు యజ్ఞశాలలో వానినిఁ
బప్పుకాగులోఁ బడవైచినాఁడు. వాని కళ్లలోఁ గారమును
బోసెను. ఆతఁడు లబోదిబోయని కొట్టుకొనుచుండెను. గంతు
లిడుచుండెను. కొంద అన్నముపైఁ బడిరి. కొందఱు కూరలను
వెదఁజల్లిరి. పులుసును బొట్టలపైఁ బూసికొనిరి. కొందఱు
పూర్ణముల నెగురవేసిరి. తాంబూలముల నమిలి అందఱిపైన
థూథూ యని నుమిసిరి. ఎవరికేది దొరికిన వారు దానినిఁ దిని
వేయసాగిరి. వారిప్పుడు యజ్ఞవిధ్వంసమును మఱచిపోయిరి.
వారేవస్తువును జూచిన నావస్తువును నోట వేసికొనుచుండిరి.
ఒకఁడింకొకరి చేతినుండి లాగుకొనును. ఒకఁడు మఱియొకనినిఁ

బడఁద్రోయును. ఇంకొకనిని దోర్లించును. వారు ప్రేత పిశాచములుకదా! అచ్చట యుద్ధము, పోట్లాట, తినుట, త్రాగుట, హాహా, హూహూ నవ్వులాటలు, ఎగతాళులు చెలరేగెను. ఈ తిండిపోతు ప్రేతములు స్వాదిష్టపదార్థముల మీఁదఁబడినట్లు వీరభద్రుఁడు తెలిసికొని గద్దించుచు నిట్లనెను:— "ఓరీ మీరు తిండిపోతులే. మీరు దరిద్రులు. మీ రేపని మీఁద వచ్చితిరో ఆపనినిఁ జేయుఁడు. ఎవ్వరైన తినవలదందురా?" ఇది వినఁగానే అందఱును భోజనాలయముఁనుండి పరువిడిరి. కొందఱపోట్లలకు పాయసమంటుకొనెను, కొందఱకుఁ బప్పంటుకొనెను. కొందఱ వెంట్రుకలు పులుసులోఁ బడిసెను. కొంద ఱింకను లడ్డును నమలుచునే యుండిరి. కొంద అధికముగ పెరుగును, బంచదారను బొక్కుటచే లఘుశంక యెక్కువయ్యెను. ప్రేతములు ప్రేతములే కదా. అచ్చటనే నిలుచుండి నాకుచుండిరి. కొందఱెక్కువగఁ దినుటచేఁ గడ్డు నొప్పి వేయుచుండెను. ఆతఁడు కుండమందే అందఱముందు మలత్యాగ మొనరించెను. అందఱిట్టి ఘృణితచర్యను గాంచగానే ముఖ్యముగ బ్రాహ్మణులు, ఋత్విక్కులు కన్నులను మూసికొనిరి. బాగుగాఁదని శివగణము మిక్కిలి యుద్దండులైరి. వారచ్చటి పీటలను బగులఁగొట్టివేసిరి. యజ్ఞకుండములోని యిటుకలను బెల్లగించిరి. వేదికా సీమాసూత్రములను ద్రెంపి వేసిరి. యజ్ఞముచేయు మునులను జాలమందినిఁ బట్టుకొనిరి. కొందఱ నోళ్లను దెఱచి, పండ్లూడఁగొట్టిరి. గద్దించి స్త్రీలను భయపెట్టిరి. స్త్రీలగోల యెక్కువయ్యెను. ఒకరిమీఁద నొకరు పడసాగిరి. ముసలివారుపడి నలిగిరి. వారు తమ

బోసినోళ్ళతో నిట్లనిరి:- "మమ్ముల నేల కొట్టెదవయ్యా !" కాని వారిమాట వినునదెవరు ? అందఱును బొట్టలలోఁ గాళ్ళు పెట్టుకొని పరుగిడిరి. చిన్న చిన్న పిల్లలు కేకలువేయుచు నేడ్వ సాగిరి. కొందఱకు ముడులూడెను, కొందఱకు ఱెక్కలు విరిగెను. కొందఱకుఁ జెవులపోగు లూడెను. కొందఱుఱువ సాగిరి. కొంద ఱేడ్వసాగిరి. కొందఱు గాబరాబడి మూర్ఛితు లైరి. కొంద ఱోదార్చుచుండిరి. కొందఱు జారిపడిన వృద్ధు లను లేవఁదీయ యత్నించుచుండిరి. స్త్రీలలో నల్దిశలను హాహాకారము వ్యాపించెను. స్త్రీ లీవిధముగ భయభీతలగుటను గాంచి వీరభద్రుఁడు దూరమున నుండియే తన దీర్ఘబాహువు లను జాచి యిట్లనెను:- "చూడుఁడు, జాగ్రత్త! ఎవరైన స్త్రీల కవమానమును గావించినచో మీ పుత్తె లెగురఁగలవు. స్త్రీలు సర్వదా సర్వకాలములం దవధ్యలు. వారి నెవరు నవమానము చేయరాదు. ఈ దక్షునిఁబని పట్టించుఁడు. ఈతఁడు చేసిన పనికి ఫల మనుభవింపఁజేయుఁడు."

ఇది వినఁగానే అందఱును యజ్ఞముచేయించువారిపైఁ బడిరి. కొందఱు ఋత్విజులను బట్టుకొనిరి. కొందఱు హోతను గట్టిరి. కొందఱు అధ్వర్యులను నింటఁబడవైచిరి. కొందఱు యజ్ఞపాత్రములను బగులఁగొట్టి చూర్ణమొనరించిరి. కొందఱు యజ్ఞకుండమున నగ్నియుండుచోట జలమునుపోసిరి. పెద్దవాఁడగు శివుని ముఖ్యపార్షదుఁడు మణిమంతు డాదిక్కుగా వచ్చుచుండగా దౌర్భాగ్యవశమున భృగు వాతని యెదుటఁ గనఁబడెను. ఆతనిని గాంచఁగానే మణిమంతుఁడు పకప నవ్వెను. ఆతని కన్ని విషయములు జ్ఞాపకమునకు వచ్చెన

ప్రజాపతి యజ్ఞమున నీతఁడే దక్షునిముందు కూర్చుండి గడ్డము నాడించుచు నెన్నియో బీరములు పలికెను. ఆతఁడు మాటి మాటికిని శివనింద నొనర్చుచుండెను. అందువలన దక్షుఁడు తన మహాయజ్ఞమున కీతని నాచార్యునిఁగ నొనర్చెను. అందు వలన మణిమంతుఁ డీతనినిఁ బట్టుకొనెను. భృగు విట్లనెను:- "ఏమిటి నీవు చేయుచున్నది ? ఇంతటి యసభ్యతా వ్యవహారము మంచిదికాదు. నేను యజ్ఞమునకుఁ బ్రధానాచార్యుఁడనుసంగతి నీకుఁ దెలియదా?"

మణిమంతుఁడు కపట గంభీరతను జూపుచు నిట్లనెను :- "ఆచార్యదేవా ! దండములు. మీ కొఱకే నేను వెదుకు చున్నాను. నే నాచార్యదక్షిణ నొసంగవలసియున్నది. తీసుకొని పొందు" అని యిట్లు పలికి మణిమంతుఁ డాతని శిరస్సును ఛేదింప నుద్యుక్తుఁడయ్యెను. దీనినిఁగాంచి నందీశ్వరుఁడు వారించుచు దూరమునుండి యిట్లనెను :- "అట్లు చేయవలదు. బ్రాహ్మణహత్య నొనర్చుట మంచిదికాదు." అని పలికి యాతఁడు మణిమంతుని చేతులనుండి భృగువును దప్పించుటకుఁ బరువిడెను. మధ్యలో భగదేవత చిక్కెను. నందీశ్వరుఁడాతనినిఁ బట్టుకొని, యాతని ముఖమందు ముఖముంచి యిట్లనెను :- "ఏమయ్యా ! ప్రజాపతుల యజ్ఞము జ్ఞాపకమున్నదా ? నీవే కాదు గ్రుడ్లు త్రిప్పినది!"అని పలికి ఆతని నీడ్చుచు మణిమంతుని వద్దకు వచ్చెను. అచ్చట భృగమహాముని కట్టఁబడి వణఁకు చుండెను. ఒకఁడు చండీశుఁడగు పూషునిఁబట్టుకొని వచ్చు చుండెను. భృగుని జంపవలదని నందీశ్వరుఁడు మణిమంతుని వారించుచుండెను. కాని సతీదేవిహత్య కాతఁడే కారణమనియు

నాతనినిఁజంపక వదలనని కూర్చుండెను. వీరభద్రునకొక చింత పట్టుకొనెను. ఆతఁడు దక్షప్రజాపతిని వెదకుచుండెను. శివు డాతనినిఁ జంపవలదనెను. ఆతఁడు ఋత్విజులలో దాగుకొను టచే వీరభద్రునకుఁ గనఁబడలేదు. వారిట్లు వెదకుచుండఁగనే పత్నీశాలవైపుగాఁ బాఱిపోవుచున్న దక్షుఁడు కనఁబడెను. వీర భద్రుఁడు వెళ్ళి, ఆతని మెడను బట్టుకొని యిట్లనెను:- "తాత గారు, ఎచ్చటికిఁ బాఱిపోవుదురు? ఇప్పుడు యజ్ఞఫలమును గొనిపొండు. శివనిందా ప్రసాదమును గ్రహింపుఁడు." అని నాతని కంఠమునకుఁ ద్రాడునుగట్టి పశువునువలె లాగుచుండెను.

ఇప్పు డాతఁడు దూరమునుండియే నందీశ్వర మణి మంతులు వాదించుకొనుటను గాంచుచుండెను. ఒక్క దుము కున వీరభద్రుఁడచ్చటికిఁ జేరుచుండెను. ఈతనికి వెనుక దక్షుఁడు కసాయివాని వెంట బలిపశువువలె నీడ్వఁబడుచు వచ్చు చుండెను. ఆతఁడువచ్చి మణిమంతు నిట్లడిగెను :- "ఏమి విషయము?"

మణిమంతుఁడిట్లనెను:-"ఈ హత్యకు మూల మీ భృగు మహర్షి. ఈతఁడే తన యీ మేఁకగడ్డము నాడించుచుఁ బ్రజా పతి యజ్ఞమందు దక్షుని సమర్థించుచుండెను. నేను వీనినిఁ జంపఁదలఁచుచున్నాను. నందీశ్వరుఁడు నన్నడ్డగించుచున్నాఁడు. వీరభద్రుఁడిట్లనెను :- "మీరు పోట్లాడుకొను టెందులకు ? నేను తీర్పుతీర్చెదను. నందీశ్వరుఁడు బ్రహ్మహత్యయని వలదనుచున్నాఁడు కాదూ, నీవు వీఁడపరాధి వీఁడు వధ్యుఁడే యనుచున్నావు కాదూ, మీ యిద్దరి మాటల నొప్పుకొందును. బ్రాహ్మణుఁ డవధ్యుండు కావున నీతనినిఁ జంపుటమంచిదికాదు.

ఆసభాస మొసర్చిన దీతఁడు కాదు, ఈతని గడ్డము. నేను గడ్డము పట్టుకొందును నీతని మీసములను దరుగుఁడు, తర్వాత గడ్డమును దరుగుఁడు."

ఇది వినఁగానే అందఱును బ్రసన్నులైరి. వారికొక నూతనఖేలనము సిద్ధమయ్యెను. ఒకఁడిటునుండి లాగిపట్టుకొనఁగా నింకొకఁడటునుండి భృగునిగడ్డమును మీసములను గోవిందాయనమః కావించివైచిరి. వాటినిఁబీకి అగ్నిలోఁ బడవైచిరి. భృగు నిట్లు కావించి, యిప్పుడు భగదేవునిపనిపట్టిరి. ఇప్పుడు నందీశ్వరునకు ఉపాయము తెలిసెను. ఆతఁడు వీరభద్రునితో నిట్లనెను :- "ఈతఁడు కన్నులు గలుపుచు దక్షుని నుత్సాహపఱుచుచుండినాఁడు" ఈ విషయమును వినఁగానే వీరభద్రుఁడు వానినిఁ గ్రిందఁబడవైచి, రొమ్ముమీఁదఁ గూర్చుండి, పిల్లల గుంటలలో దూరిన మిణుఁగుపురుగులను లాగినట్లు లాగివైచెను. పాపమా భగునకుఁ బ్రపంచమేపోయినది. ఆతఁడు చేతులతోఁ గన్నులను మూసికొని, కనుగుంటలలోనుండి రక్తము కారుచుండ నటునిటుఁదిరుగుచుండెను. శివపార్షదులు హా హా హూ హూ యనుచు నవ్వసాగిరి. చండీశుఁడగు బూషుఁడు పట్టుకొనఁబడి వీరభద్రునిసమ్ముఖమునకుఁ దేఁబడెను. నందీశ్వరుఁ డిట్లనెను:- "ఈతఁడును బ్రధాన అపరాధులలోనివాఁడే."

వీరభద్రుఁడిట్లనెను :- "ఈతఁడేమి తప్పుచేసినాఁడు?"

నందీశ్వరుఁడిట్లనెను:-దక్షుఁడు శివుని నిందించుచున్నప్పుఁడు తన కుంద సదృశములగు శ్వేతదంతములను వెళ్ళఁబెట్టి వందమును వెలిబుచ్చుచు పకపక నవ్వినాఁడు."

ఇది వినఁగానే వీరభద్రునకుఁ గన్ను లెఱ్ఱనయ్యెను. ఆతఁడు పూషుని దవడపై బాదఁగా దీపావళీ దినమున ముత్యాల పూలు రాలినట్లు ముప్పదిరెండు పండ్లు నేలపై రాలెను. ఆతని నోరు బోసినోరయ్యెను. ఆతఁడు పాయసమును జప్పరించినట్లు జప్పరించుచుండెను.

ఇప్పుడు చివరకుదక్షునివంతువచ్చెను. వీరభద్రుఁడుగర్జించి యిట్లనెను:- "అందఱును సావధానులరై వినుఁడు. బ్రాహ్మణుఁ డవధ్యుడే. ఎట్టి బ్రాహ్మణుఁడైనను వానిని మన మాదరింప వలసినదే. అయినను నేనీ దక్షుని బ్రదికియుండఁగా వదలి పెట్టను. కారణమేమనఁగా నీతని యవమానముచేతనే తల్లి తన శరీరమును త్యజించినది. రెండవది నిండుసభలో సదాశివుని నవమానించినాఁడు. మూఁడవది ఈతఁడు శివభాగ విరహిత మగు యజ్ఞము నొనర్చినాఁడు. అట్లుచేయుట కీతఁడు చేయించు వారల కాశపెట్టి తెచ్చినాఁడు. వీనినిఁ జంపుటకు శివుఁడాజ్ఞా పించినాడు కావున వీనినిఁ జంపక విడువను. వీనిని వదలమని నా కెవ్వరునుజెప్పి అడ్డగింపరాదు." అందఱిట్లరచిరి: వీని నవ శ్యము చంపుఁడు, వీనినిఁ జంపి అగ్నిలో వ్రేల్చుఁడు. ఈ శివద్రోహమే హత్యకు మూలము. మా తల్లి ఈతని మూలము ననే మరణించినది. కావున వీనిపై దయచూపింపరాదు."

పార్షదులందఱు యనుమతినిఁ బొంది వీరభద్రుఁడు దంతములను గటకటఁ గొఱుకుచుఁ గ్రోధముతో దక్షుని ఱొమ్ముపైఁ గూర్చుండి, ఒక తీక్ష్ణమగుఁ గత్తినిఁ దీసికొని వాని శిరస్సును గోయ నారంభించెను. కాని పరాక్రమవంతుఁడగు వీరభద్రుని తీక్ష్ణ ఖడ్గమున నాతఁడు చెక్కు చెదరకుండెను.

ఎంతగాఁ బ్రయత్నించినను ఖడ్గమాతని శరీరమున దిగలేదు. ఆతని చర్మము వజ్రకఠినముగ నుండెను. దానిపై నొక్క గాయముకూడ కాలేదు. అప్పుడు వీరభద్రుఁడు చాల చిక్కులోఁ బడెను. ఈతఁ డవధ్యుఁడుగఁ దోఁచెను. ఆతఁడు చావఁడు.

వీరభద్రునకు మిక్కిలి నిరాశ కలిగెను. ఈతఁడు జీవించిన నింకఁ బ్రయోజనమేమున్నది? ఈతఁడు చావకుండు టకుఁ గారణమేమి? ఆతఁడాలోచింపఁగా నాలోచింపఁగా నిట్లు జ్ఞాపకమునకు వచ్చెను. ఈతనిని బ్రాహ్మణులు తమ మంత్ర ప్రభావముచే నవధ్యునిఁగాఁ జేసినారు. ఈ యజ్ఞమందు బలి పశువుతప్ప మంత్రప్రభావముచే నెవనికిని మృత్యువు కలుగదు. కావున నీతనిని బలిపశువువలెఁ గొట్టినఁగాని చావఁడు. ఈతఁ డస్త్ర శస్త్రములచేఁ జచ్చువాఁడు కాఁడని యాలోచించు కొని, వానికి దగ్గఱనే పడియుండిన పశుబలిదాన యంత్రమును దీసికొని, దానిచే యజ్ఞముయొక్క యజమానినే బలిపశువుగాఁ జేసి, వాని మెడను బట్టుకొని, శిరస్సును మొండెమునుండి వేఱుకావించెను. మొండెమును వేఱు కావించి యాతఁ డిట్లనుకొనెను:- "ఈ బ్రాహ్మణుల మంత్రములందుఁ జాల యధికమగు నపరిమేయమగు సామర్థ్యము కలదు. వీరి శిరస్సును మరల మొండెమున కతికించి బ్రదికింప వచ్చును. కావున నీశరీరమును వేణువును బ్రద్దలుకొట్టినట్లు బ్రద్దలుకొట్టవలెను. అసలు మూలమే ఉండరాదని జ్వలించుచున్న అగ్నిలో నాతఁడు దక్షుని శిరమును స్వాహాకారమున హుతము కావించెను. దక్షుని శిరమగ్నిలోఁ బడఁగానే భూత, ప్రేత,

పిశాచ, డాకినీ, శాకినీ, మొదలగు గ్రహములు 'సాధు సాధు, ధన్య ధన్య, బాగు బాగు' అను శబ్దము లొనర్చి కోలాహల మొనర్చిరి. కొందఱాడసాగిరి, కొందఱు పాడుచుండిరి. కొంద ఱెగురుచుండిరి. కొందఱు దుముకుచుండిరి. కొంద ఱన్యులను ద్రోయుచుండిరి. కొందఱు మల్లయుద్ధమే యొనర్చుచుండిరి. కొంద ఱితరులపై నీరును జల్లుచుండిరి. యోగినులు పుఱ్ఱెలలో రక్తమును నింపుకొని త్రాగసాగిరి.

అగ్నియొక్క భార్య స్వాహాదేవి బాగుగా నలంకరించుకొని వచ్చెను. ఈ మహాయజ్ఞమునఁ దన పేరును మాటి మాటికిని బలుకుచుందురు గదాయని సంతోషించుచుండెను. పితరుల రాణి స్వధాదేవియు షోడశ శృంగారము లొనర్చుకొని వయ్యారముగఁ గూర్చుండెను. శివగణము యొక్కయు, అసభ్య పార్షదుల యొక్కయు నీ హత్యాకాండను గాంచి వారును జాల కోలాహలము జరుగుచున్నదని భయపడిరి.

యజ్ఞమునకు మూలమే నశించెను. దేవతలు దశదిశలు పరువిడి పాఱిపోయిరి. పితరులు కాళ్లు నిలువఁద్రొక్కుకొని మెదలక తమతమ గృహములకుఁ బోయిరి. బ్రాహ్మణులు పంచాంగముల కట్టను జంకను బెట్టుకొని మెదలకఁ దమ తమ గృహములకు వెడలిపోయిరి. కొందఱు పంచాంగములను దండ కమండులువులను వదలి, వానికై ఆశించి నిలిచినచోఁ దడి తగులునని వాటిని వదలిపెట్టియే పారిపోయిరి. ఈ భూత ప్రేత పిశాచములు నూర్గురను జంపి ఒక్కరిని లెక్కచెప్పెదవు. మిక్కిలి సావధానముగఁ దడి తగిలించెదరని వారికే దిక్కునఁ దారి లభించిన నా దిక్కునకు బరువిడి నిలుచుండిరి. స్త్రీలు

అంతఃపురములోనికిఁ బోయి దాగుకొనిరి. నల్దిదిక్కులను కోలా హలము చెలరేగెను.

దక్షుని శిరస్సును హవనము కావించి వీరభద్రుఁ డిట్లనెను:- "యజ్ఞము పూర్తియైనది. ఇపుడిఁకఁ బూర్ణాహుతినిఁ గావింపుఁడు. ఇప్పుడింక నవభృత స్నానమునకుఁ గైలాసము నకుఁ బోవుదము. శివపాదధూళియను గంగయం దవగాహనము కావించెదము. ధూర్జటియొక్క యీ పరమపావన ధూళినే శరీరమున నలదుకొని యీ యజ్ఞముయొక్క సమస్త ఫలమును బొందెదము" అని యిట్లు పలికి ఆతఁడు యజ్ఞమండపమునఁగల పాత్రలను, హవనీయపదార్థములను ప్రోవుచేసి అగ్నినిఁ దగి లించిరి. పెద్ద పెద్ద మంటలు స్వర్గమునంటుచు నగ్ని భగభగ మండసాగెను. ఈ విధముగ దక్షయజ్ఞమును విధ్వంసము కావించి, తన యనుయాయులను వెంటఁబెట్టుకొని వీరభద్రుఁడు కైలాసమునకు శివచరణసన్నిధికిఁ దిరిగివచ్చెను."

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురరా! వీరభద్రుఁడు దక్షయజ్ఞమును విధ్వంసనము కావించి, దక్షుని శిరమును నగ్నియందు హవనము కావించిన సమాచారములను శివుఁడు తెలిసికొని చాల సంతోషము పొందెనుగాని సతీదేవి శరీరము త్యాగమైనదను సంగతి మఱవఁజాలకపోయెను.



# జగత్తు శివుని క్రీడాస్థలము.

## (౨౦౩)

శ్లో॥ విద్యా తపో వ్రత ధరా న్ముఖతః స్మ విప్రాన్
బ్రహ్మాత్మ తత్త్వమ వితుం ప్రథమం త్వమస్రాక్ ।
తద్బ్రాహ్మణా న్పరమ సర్వ విపత్సుపాసి
ప్రాః పశూనివ విభో ప్రగృహీత దండః ॥

—శ్రీభాగ. ४ స్కం. ౭ అ. ౧४ శ్లో॥

సీ. అసఘాత్మ తగ నీవు నబ్జనాభుండును
బరికింప బ్రాహ్మణాభాసు లయిన
వారలయెడల నెవ్వలన నుపేక్షింప
రటు దృఢవ్రత చర్యులైనవారి
యెడ నీకుపేక్ష యెక్కుడిది సర్గాదిని
నామ్నాయ సంప్రదాయ ప్రవర్త
నము నెఱింగించుట కమరవిద్యాతపో
వ్రతపరాయణులైన బ్రాహ్మణులను
తే. వరుసబుట్టించితివి కాన వారి నెప్పుడు
గేల దండంబుఁబూని గోపాలకుండు
బలసి గోవుల రక్షించు పగిది నీవు
నరసి రక్షించుచుండుఁగదయ్య రుద్ర ॥

—శ్రీ మదాంధ్రభాగవతము.



నిర్వికార నిర్లేప బ్రహ్మమందు సృష్టి సంభవింపదు. నిర్గుణుఁడగు నతఁడు సగుణుఁడువలెనై నపుడు జీవుల భోగార్థమై, క్రీడార్థమై, భక్తానుగ్రహమునఁ దన భక్తవత్సలతను బ్రకటిం

చుట కా నిష్కళంకుఁడు, నిరంజనుఁడు నిర్వికారుఁడునగు హరి యీ విశ్వమును రచించుచున్నాఁడు. ఈ విశ్వమం దందఱును సనక, సనందన, సనత్కుమార, సనాతన నారదాదులవలె నైనచో నీ సృష్టిచక్ర మెట్లు తిరుగఁగలదు? కోరిక లేనిది సృష్టి లేదు. కోరిక అపూర్ణతలోనే కలదు. అపూర్ణత వికారము వలనఁ గలుగును. అందువలన సృష్టిచక్రమును ద్రిప్పుటకై బ్రహ్మ మనస్సునుమథించు వికారము నుత్పన్నము కావించును. బ్రహ్మ నిర్వికారుఁడై నప్పటికిని సృష్టి, స్థితి, లయములకొఱకు మూఁడు రూపముల ధరించుచున్నట్లు భ్రమవశమున వికారికి గోచరించును. అట్లే ఆతనికెన్నటికిని నేదశయందును వికారములు లేవు. ఏలననఁగా నాతఁడు దివ్యగుణ సంపన్నుఁడగు నచ్యుతుఁడు. సాలీడు తన నోటినుండి తీసి నిర్మించుకొనిన గూటిలో దిరుగుచుండును. అట్లే బ్రహ్మయు నీసృష్టినిఁ గావించి నీ సుఖదుఃఖములలో వికృతుఁడై నట్లు కనఁబడుచుండును. నిజముగ నాలోచించిన శివునకుఁ గోపమేమిటి? రాగద్వేషము లేమి? ఆతఁడు సదా నిర్వికార నిరంజనుఁడు.

దక్షయజ్ఞ విధ్వంస ప్రకరణమును విని శౌనకుఁడు సూతునిట్లడిగెను:- "సూతా! ఈ శివుఁడెట్టి ప్రాకృతపురుషుని వలె లీల నొనర్చినాఁడు? శక్తి స్వరూపిణియగు సతీదేవి యిట్టి హఠమేల యొనర్చెను? దక్షుఁడు తన యల్లునియెడల నిట్టి దుర్వ్యవహారమేల యొనర్చినాఁడు? సతీదేవి యచ్చట ఆత్మహత్య నేలఁగావించుకొనినది? శాంతమూర్తియగు శివుఁడింతటి కోపమేల గావించినాఁడు? వైదిక వైష్ణవ యజ్ఞమున కిట్టి యశుద్ధతాపూర్వకమగు వినాశనము నేల కావించెను? ఇంతటి

రాగద్వేషములు తోచుట కిది యేమైనఁ బ్రాచీనమగు కలహామా సమయము చూచుకొని పైకి రేగుటకు?''

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను:- ''మహాభాగా! శివునకుఁ గ్రొత్త యేమియును లేదు. అంతయును బ్రాచీనమే. ఇది యాతని వినోదము. పసివాఁడు అద్దమందు దనముఖమును గాంచి నవ్వినఁ నవ్వును, కోపించినఁ గోపగించును, గుద్దఁ బోయినచోఁ బ్రతి బింబమును గుద్దఁబోవును. చాల సేపటి వఱకు బాలుఁడు దర్పణముతో నాటలాడుచుండును. తర్వాత విసుఁగుపుట్టినపు డా పిల్లవాఁ డద్దమును నేలకువైచి కొట్టును, అది పగిలిపోవును. అప్పుడాతఁడు తనలోఁదానే క్రీడించుచుండును. అదేవిధముగా నీ విశ్వబ్రహ్మాండమంతయు నాతని దర్పణము. దీనితో నాటలాడుచుండును. శివు నెదురొ్కనుటకుఁ గాని, శివునితో విరోధమును బెట్టుకొనుటకుఁగాని యీ జీవుల కేమి సామర్థ్యము కలదు? కాని యాతఁడే యిట్టి రూపములను ధరించుచుండును. లోహముతో ననేక వస్తువు లేర్పడుచున్నవి. ఇనుము కత్తెరగానై రేకును గత్తిరించును. ఇనుపసుత్తె దానిని సాగఁగొట్టును. ఇనుప పట్టుకారు దానిని మడచి వివిధ వస్తువుల నొనర్చును. చివరకన్నియును లోహమే. ఇదేవిధముగ నీ బ్రహ్మ విష్ణు, రుద్ర, మను, ప్రజాపతులందఱును శివస్వరూపులే. సాంసారికులకు వారి చరిత్రలమీఁద రుచికలుగుటకై ఖేలనమునకై విచిత్రచరిత్రల నొనర్చును. విషయాభిలాషులయొక్క ఆ యీ చరిత్రలను వినక శివునిచరిత్రములనే వినవలయును. శివచరిత్రను జూచుటలో నెంతటి యశ్లీలములైనను, నెంతటిభీభత్సములైనను గనఁబడినప్పటికి నన్నియు శివస్వరూపములే.

మీరీ విరోధమునకుఁ గారణ మడిగితిరి. కార్యకారణ ములు లేక నేమియును జరుగదు. ఇంతకు యథార్థమిది—శివుఁడీ విశ్వమును సృజించి, తాను బ్రహ్మ, విష్ణు, రుద్రరూపములను ధరించఁగానే బ్రహ్మ దేవ, దానవ, యక్షరాక్షస, పశు, పక్షి, లతా, వృక్షాది చతుర్విధ జీవులను నవవిధ సృష్టిగా నొనర్చెను సనకాదులను సృష్టించిన తర్వాత నాతఁడు మరీచ్యాది మానసపుత్రులను బదుగురను సృష్టించెను. ప్రజావృద్ధి యొనర్చుటచే వీరందఱును ప్రజాపతులను నామమునఁ బ్రసిద్ధులైరి. ప్రజావృద్ధి కాకపోవుటచే బ్రహ్మకుఁ గోపము వచ్చెను. ఆ క్రోధ మాతని భ్రూమధ్యమునుండి క్రోధరూపుఁడగు రుద్రుఁ డుద్భవించెను. అట్లైనను నెవని మనస్సునందును ప్రజావృద్ధి చేయవలయునను గోరిక కలుగలేదు. అప్పుడు బ్రహ్మ ప్రసన్న మనమున నిట్లాలోచించెను:— "వీరి మనస్సులు ప్రజావృద్ధి యందెట్లు లగ్నము కాఁగలదు?" ఇట్లనుకొనుచుండఁగనే ఆతని శరీరమునుండి పరమ సుందరియు, విశ్వవిమోహనము కావించునదియు నగు సంధ్యాదేవి ఉత్పన్నమయ్యెను. ఆమెకు తోడుగా నొక సుందర పురుషుఁడును నుత్పన్నమయ్యెను. ఆతని సౌందర్యమును జూడఁగానే సర్వులమనస్సులు మథితమయ్యెను. అందఱ మనస్సులలోఁ గామముత్పన్నమయ్యెను. ఆతఁడు కుసుమాయుధములను జేతఁబట్టుకొని యుండెను. పుట్టఁగానే ఆతఁడు చేతులు జోడించుకొని బ్రహ్మతో నిట్లనెను:— "స్వామీ! నన్నెందులకుఁ బుట్టించితిరి? నాపేరు చెప్పుఁడు. నాబలమును జెప్పుఁడు. నాపని యేమిటో చెప్పుఁడు. నాకొక భార్య నొసంగుఁడు."

ఆతని యీ మాటలను విని బ్రహ్మ దగ్గఱ గూర్చుండి యుండిన తన పుత్రులగు ప్రజాపతులతో వీనికి నామకరణ సంస్కారము చేయుమనెను. ఋషులు బ్రహ్మయాజ్ఞను శిరసా వహించి వానికి నామకరణ మొనర్చిరి. ఋషులిట్లనిరి:- "పుట్టఁగానే ఈతఁ డందఱ మనస్సులను మథించినాఁడు కావున నీతనికి మన్మథుఁడను పేరు చెల్లును. ఈతనిని గాంచఁగానే అందఱ మనస్సులనుఁ గామముత్పన్న మగును గావునఁ గాముఁడనుపేరును జెల్లును. కుసుమముల నాయుధములుగ గ్రహించును గావునఁ గుసుమాయుధుఁ డనఁబఱగును."

ఇది విని బ్రహ్మ చాల ప్రసన్నుఁడై యిట్లనెను:- "నీవు ప్రపంచమందు సర్వశ్రేష్ఠుఁడగు సుందరుఁడవు కాఁగలవు. నీకు సమానుఁడగు సుందరుఁడు త్రిలోకములం దుండఁడు. నీ ప్రభావము సమస్తజీవులందుఁ బడఁగలదు. జీవులమాట యట్లుండుఁడు. త్రిమూర్తులమును నీ ప్రభావమునుండి తప్పుకొనఁ జాలము. మేమును నీకధీనులమయ్యెదము. నీవు స్త్రీ పురుషులందఱియందు సమానముగ వ్యాపించెదవు. స్త్రీ పురుషునిఁ గాంచియు, పురుషుఁడు స్త్రీని గాంచియు నీకధీనులగుదురు. నీ పుష్పబాణములముందు నిలువరించుకొను శక్తి యెవ్వరికి నుండఁజాలదు."

ఇది వినఁగానే కామునకు తన సామర్థ్యమును బరీక్షించుకొనవలయునను గోరిక కలిగెను. ఆతఁడు తన బాణములను బ్రహ్మపైనను, ప్రజాపతులపైనను విసరెను. 'మొఱుగుటనేర్పఁగా గఱవవచ్చిన'దను సామెత కలదు. భస్మాసురునివలె మన్మథుఁడును దన వరదానములను బ్రహ్మపైననే బరీక్షింప

నారంభించెను. బ్రహ్మప్రక్కనే సంధ్యాదేవి నిలుచుండియుం డెను. బ్రహ్మ వర మెన్నటికిని నసత్యము కాఁజాలదు. ఆతని మనస్సులోఁ గొంచెముగ వికారము కలిగెను. ప్రజాపతుల మనస్సులలోను నట్లే కలుగవలసియుండెను. సంధ్య చిత్తమును నిర్దోషముగ లేదు. తన యీ సామర్థ్యమును జూచుకొనఁగానే కామునకు మిక్కిలి యానందము కలిగెను. శివుఁడు నిర్వికారుఁడుగ నుండెను. బ్రహ్మయుఁ బ్రజాపతులును నిట్టిదశలో నుండుటను గాంచి యాతఁడు వారినందఱ గద్దించి బ్రహ్మతో నిట్లనెను:- "నీ మనస్సులో నిట్టిభావము కలుగుట చాల లజ్జింపవలసిన విషయము." ఇది వినఁగానే అందఱును మిక్కిలి సిగ్గుపడిరి. లోలోన శివునిఁజూచి క్రుళ్లుకొనసాగిరి.

కాముని ప్రభావము శాంతింపఁగానే అందఱమనస్సులు పూర్వమువలె నిర్మలములయ్యెను. బ్రహ్మకు కామునిపై నాగ్రహము కలిగి నాతనికి శాప మొసంగెను. "నీవు శివునివలన భస్మమయ్యెదవు గావుత !"

కాముఁడు దుఃఖితచిత్తముతో నిట్లనెను:- "స్వామీ ! నా యపరాధమేమి ? మీరే నాకు వరముద్వారా బలైశ్వర్య ప్రభావ సామర్థ్యములను బ్రసాదించితిరి. మీరొసంగిన బలముతోడనే నేనిట్లొనర్చితిని. మీరే చివరకు శాప మొసంగుచున్నారు. స్వామీ! మీరు మాయెడల నన్యాయ మొనర్చుచున్నారు."

ఇది విని బ్రహ్మ యిట్లనెను:- "నా వరముగాని, నా శాపముగాని యెన్నటికిని మిథ్యకాఁబోదు. అందువలన నీ శరీరము నశించునుగాని నీ వనంగుఁడవైనను నీ ప్రభావ మందఱపైనఁ బడఁగలదు. మఱల నీవు భగవంతునకుఁ బుట్టఁగలవు."

అప్పుడు మన్మథుఁ డిట్లనెను:- "స్వామీ ! నాకు భార్య నొసంగుము. ఒంటరిగా నేనేమి చేయఁగలను ?"

అప్పుడు దక్షప్రజాపతి తన స్వేదముచే నొక మానసిక కన్యక నుత్పన్నము కావించెను. ఆమె అతిసుందరి. మును లామెకు 'రతి' యను పేరిడిరి. అందఱును గలిసి చాల వైభవముగ రతీ మన్మథులకు వివాహము కావించిరి. ఈ దంపతులు ప్రపంచమం దనుపమ సౌందర్యయుక్తులైరి. అత్యంత లావణ్యా సౌందర్యమయమగు వధువామె, త్రైలోక్యమోహన అనుపమ సౌందర్యయుక్తమగు వరుఁడాతఁడు. వీరిద్దరును గలిసి అందఱ మనస్సులను మథింపసాగిరి. వీరి ప్రభావమునకు లోఁబడనివా రెవరో అరుదుగ నుందురు.

ఇచ్చట సంధ్యాదేవికి చాల సిగ్గువేసెను. అట్లు మనస్సులో సిగ్గువేయుఁగానే తండ్రి, తోఁబుట్టువులముందు వికారము కలిగెను. అందువలన నామె యేకాంతమునకుఁబోయి ఘోర తపంబొనరించెను. ఆమె తపస్సునకు సంతుష్టినిఁజెంది శివుఁడామె సమ్ముఖమునఁ బ్రత్యక్షమై వరము కోరుకొనుమనెను. ఆమె శివుని నిట్టి వరమును గోరెను. "పుట్టఁగానే నా మనస్సునందు మాలిన్యము సంభవించినది. కావున నిప్పటినుండి పుట్టువారికి మనస్సున మాలిన్యము సంభవింపరాదు. తండ్రి, తోఁబుట్టువుల సమ్ముఖమున నా భావము దూషితమైనది, కావున నిప్పటినుండి, ఎన్నడైనను తండ్రియెడలను, సోదరులయెడలను

సృష్టిభావముకలుగుచో నత్యంత ఘోర రౌరవనరకము ప్రాప్తించుగాక! నాకు యోగ్యుఁడును బ్రహ్మవేత్తయు నగు బతి లభింపవలయును. నా మనస్సు ఎన్నఁడైన నన్యపురుషుని గాంచి వికారము ప్రాప్తింపకుండవలయును. నేను పతివ్రతలందఱిలో శ్రేష్ఠురాలను గావలయును.”

శివుఁడు ప్రసన్నుఁడై యిట్లనెను:- “మంచిది, నేను నీ కీ వరము లన్నిటి నొసంగితిని. (౧) ప్రాణులకు నాల్గు అవస్థలు కలుగును. ౧ బాల, ౨ కిశోర, ౩ యువ, ౪ వృద్ధావస్థలు. కామవికారము బాల కిశోరావస్థల మీఁదటనే కలుగును. (౨) సోదరుఁడు, తండ్రి వీరిముందు మనస్సునందు కుత్సితవికారమును పెంపెనా వానికి ఘోరాతిఘోర రౌరవనరకములు ప్రాప్తింపఁగలవు. (౩) నీ వీ శరీరమును వదలవలసియుండును. రెండవ శరీరముతో నీవు బ్రహ్మవేత్తయగు వశిష్ఠునకుఁ బత్నివి కాఁగలవు. (౪) నీ మనస్సు సదా ధర్మమందే యుండగలదు. (౫) ప్రపంచములో నీవు సర్వశ్రేష్ఠురాలవగు పతివ్రతవు కాఁగలవు.” అని యిట్లు వరముల నొసంగి శివుఁడచ్చటనే అంతర్థానమయ్యెను. ఆ సమయమున మేధాతిథిమునియొక్క యజ్ఞము జరుగుచుండెను. ఆ యజ్ఞమం దలక్షితభావముతో సంధ్యాదేవి తన శరీరమును త్యజించినది. శరీరత్యాగమును గావించి యామె సూర్యలోకమును బొందెను. ఆమెయొక్క ఒక్కయంశమున సాయంకాల ప్రాతఃకాల సంధ్యలుదయించెను. ఒక యంశచే మేధాతిథి

ముని పుత్రికగా నరుంధతి యుదయించెను. ఆమె వివాహము వేదవేత్తయగు వశిష్ఠభగవానునితో నయ్యెను. ఆమెకు శక్తి మొదలగుఁ బుత్రు లుదయించిరి."

ఇది విని శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా ! ఇదివఱకు నీవు అరుంధతి కర్దమముని పుత్రి యని చెప్పియుంటివి. ఇప్పుడు సంధ్యయే మేధాతిథికి పుత్రియయ్యె ననుచున్నావేమి ?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఇవి కల్ప భేదముచేఁ గథలలో భేదము గోచరించుచుండును. ఒక కల్పమునఁ గర్దమ సుతయగు నరుంధతీదేవి యుండెను. ఈమె గొప్ప పతివ్రత. నేఁటికిని సప్తర్షి మండలములో వశిష్ఠ నక్షత్రము ప్రక్కన నరుంధతియు వెలుఁగుచుండుట కనఁబడుచునేయున్నది."

ఇచ్చట శివుని యవమానముచే లజ్జితుడై బ్రహ్మ దేవుఁడు కాముని, వసంతుని, మారుతాదులను శివుని మన మునఁ గామము నుత్పన్నము కావింపుఁడని పంపెను. మన్మథుఁడును దన సేనతో నట్టహాసముగ శివుని సమీపము నకుఁ బోయెను. ఆతఁ డన్నివిధముల వివిధ చేష్టలద్వారా శివునిపైఁ దన ప్రభావమును బ్రయోగింపఁదలఁచెను, కాని యాతఁడు భోలానాథుఁడు కదా! ఆతని మనస్సులో లేశ మాత్రమైనను వికారము జనింపలేదు. హతాశుఁడై కాముఁడు తన సేనతో బ్రహ్మకడకుఁ దిరిగివచ్చి యిట్లు నివేదించెను:- "ప్రభూ! నేనచ్చట విఫలుఁడనైతిని. శివునిపై నాయాటలు సాగలేదు. శివుఁడుకూడ నాకు వశీభూతుఁడగునట్లేదైన నుపా యమును గావింపుఁడు."

సూతుఁ డిట్లనెను:– “శౌనకా! తన వినాశము విష యమును గూడ మఱచిపోవునంతగా నీ ప్రాణి భగన్మాయా విమోహితుఁడగును. ఈవిధముగాఁ గామదేవుఁడు శివమాయా విమోహితుఁడై బ్రహ్మ శాపమును మఱచి, శివుని దన మాయలోఁ బడవైచికొనుట కుపాయములను వెదకుచుండెను. ఇచ్చట ప్రజాపతుల మనస్సునందు మనము వికారమును జెందితిమే శివుఁడు నిర్వికారుఁడుగ నున్నాఁడే యను నసూయ జనించెను. ఎట్లైనను శివుఁడును వివాహమాడి గృహస్థుఁడై యుండునట్లైదెన నుపాయమును జూడవలయునని ప్రజాపతులు యోచించుచుండిరి. దీని కొఱకై వివిధ విధములగు నుపా యముల నాలోచించుచుండిరి.”



# శివాశివుల వివాహము

## (౨౦౪)

శ్లో॥ త్రయోదశాదా ద్ధర్మాయ తథైకా మగ్నయే విభుః।
పితృభ్య ఏకాం యుక్తేభ్యో భవాయైకాం భవచ్ఛిదే॥

— శ్రీ భాగ. ౪. స్కం. ౧ అ. ౪౮ శ్లో.

వ. ఇట్లావిర్భవించిన కన్యకలందు శ్రద్ధయు మైత్రియు దయయు శాంతియుఁ దుష్టియుఁ బుష్టియుఁ గ్రియయు నున్నతియు బుద్ధియు మేధయుఁ దితిషయు హ్రీయు మూర్తియు నను నామంబులు గల పదుమువ్వురను ధర్మరాజునకిచ్చె నొక్క కన్యక నగ్ని దేవునకును నొక్కతెం బితృదేవతలకును నొక్కతె జన్మమరణాది నివర్తకుండగు నభవునకుం బెండ్లిసేసె.

— శ్రీమదాంధ్రమహాభాగవతము.



సమస్త క్షేత్రములందును వృద్ధి సృష్టులు స్పర్ధచేతనే జరుగుచుండును. ధనవంతుఁడు ధనవంతుని, విద్వాంసుఁడు విద్వాంసుని, విద్యార్థి ఇంకొకవిద్యార్థినిఁ జూచి స్పర్ధ వహించుటచేతనే వృద్ధికి రాఁగలరు. స్పర్ధచేఁ గలహామునకు వృద్ధి కలుగును, ఉన్నతియుఁ గలుగును, దుఃఖవృద్ధియుఁ గలుగును. స్పర్ధ లేనిచోట అశాంతిలేదు, సృష్టిలేదు, వ్యాపారము లేదు, కలహాము లేదు, క్షయము లేదు, నాశము లేదు, ఉన్నతి లేదు, అవనతి లేదు. అచ్చట పరిపూర్ణ, నిర్వికార, నిరంజన, నిర్లేప బ్రహ్మమే కలదు. పృథివియందే కాదు, బ్రహ్మలోకమువఱకు

ఈ స్పర్థాభూతము వ్యాపించినది. స్పర్థచేతనే సృష్టిచక్రము నడుచుచున్నది. స్పర్థ అనేకులుగానున్న నుండును. ఒంటరిగానున్న వాఁ డెవరితో స్పర్థించును. అద్వైతములో స్పర్థ యుండనే యుండదు. అద్వయుఁడుగను నిరాకారుఁడుగను నుండునాతఁడు నేనొక్కఁడను జాల నగుదునని సంకల్పింపఁగా నా సచ్చిదానంద శివుఁడే మూఁడురూపములను ధరించును. అన్నియు నొక్కటే యైనప్పటికిని మాయ నష్టముపై చుకొని కలహించుకొనుచుందురు. ఒక్కఁడయ్యుఁ గలహామూడు టెంములకు? ఏలననఁగా నష్టుచేయుటలో నాతని కానందము కలుగును, జగత్తు నానంద పఱచును. నాటకమం దందఱును బరస్పరము ప్రేమించుకొందురు. చాలమంది తోఁబుట్టినవారే యుందురు. కాని వారు వేషములువైచి రంగస్థలమునకు వచ్చినపుడు పరస్పరము పోరాడుకొందురు. తెఱపడఁగానే అందఱును గలిసియే యుందురు. ఏకాకారమును జెందెదరు. ఇదియే నిరాకారమునుండి సాకారమగు సారము.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! శివుఁడు తాను మూఁడురూపములు ధరించినపుడు కొంత యెగుడుదిగుడు లుండ యును గదా! బ్రహ్మపై ఆతని పుత్రుఁడగు గాముఁడు తన ముమును బరీక్షించెను. బ్రహ్మ వరప్రభావమును బరీక్షింపఁ లఁచెను. అది సఫలమయ్యెను. బ్రహ్మమనస్సునందు కొంచెము వికృతికలుగఁగా శివుఁడు కోపఁబడెను. దానివలన బ్రహ్మకు 'ఈ రుద్రుఁడు నాకు కుమారుఁడు, నా భ్రుకుటినుండి యుద్భవించినాఁడు, అట్టివాఁడు నన్నుఁ గోపపడుచున్నాఁ'డని లజ్జవేసి, యెట్లైనను నీతనిహృదయమందును గామప్రభావము పడవలెనని

తలఁచుచుండెను. స్పర్థ ప్రబలముకాఁగానే ప్రయత్న మారంభ
మయ్యెను. వసంత, మలయానిల, రతీదేవి మొదలగువారితోఁ
గామదేవుని శివునికడకుఁ బంపెను; కాని వీరందఱును గూడియు
శివుని మనస్సును విచలితము కావింపఁజాలకపోయిరి. అప్పుడు
బ్రహ్మ కామసహచరులను మారులను గణముల నుత్పన్నము
కావించెను. వారినిఁ దీసికొని కాముఁడు శివుని వెనువెంటఁ
దిరుగసాగెను. శివుఁడెచ్చటికి వెళ్ళినప్పటికిని నాతని విచలితునిఁ
గావించుటకై కాముఁడును సేనాసహితముగ వెడలుచుండెను.
కాని శివునిపై నాతని ప్రభావ మేమియును బడలేదు. అప్పుడు
పరాజితుఁడై కాముఁడు తన విఫలతను విధిసమ్ముఖమున నివే
దించెను. నిరాశుఁడై యాతఁడు తన లోకమునకుఁ బోయెను.

బ్రహ్మ హతాశుఁడు కాలేదు. ప్రయత్నమందు శిథిలత
కలుగలేదు. తన ప్రయత్నములన్నియు విఫలము కాఁగా
నాతఁడు హరిశరణము వేడెను. ఘోరతపస్సు నారంభించెను.
ఆతని తపస్సునకు మెచ్చి జనార్దనుఁడగు శ్రీవిష్ణువు ప్రత్యక్షమై
తపస్సు చేయుటకుఁ గారణ మడిగెను. బ్రహ్మ తన కథను
జెప్పఁగా నప్పుడు భగవానుఁడిట్లనెను:- "బ్రహ్మా! నీవు వేద
వేత్తవయ్యు నిట్టి ప్రయత్న మొనర్చుచున్నావు. శివుఁడు
నిర్వికార, నిరాకారుఁడు. ఆతని మనస్సునఁ గామవాసన యెట్లు
త్పన్నము కాఁగలదు. అయినను నేనొక యుపాయమును జెప్పె
దను. శక్తి లేక పురుషుఁడొక్కఁడే సృష్టి చేయఁజాలఁడు.
ఆ విశ్వవ్యాపిని నిరాకారమగు మహాశక్తి లక్ష్మి, బ్రహ్మాణి,
రుద్రాణియను మూఁడు రూపములను ధరించును. ఆ యచిన్త్య
మహిమాన్వితయగు నాదిశక్తియే తన యలౌకిక దివ్యప్రేమచే

శివునిఁ వశమందుంచుకొన సమర్థురాలు కాఁగలదు. నీవు మహా మాయయగు శంకరి నారాధింపుము. ఆమె నీకభీష్టవరముల నొసంగఁగలదు.'' అని పలికి భగవానుఁడంతర్ధానుఁడయ్యెను. భగవదాదేశమును బొంది బ్రహ్మ జగదంబికయు, సర్వ వ్యాపినియు, మహామాయయు నగు భవాని నారాధించుట యందు ప్రవృత్తుఁడయ్యెను. కాలాంతరమున భవాని ప్రసన్నయై, బ్రహ్మకు వరము లొసంగఁదలఁచెను. బ్రహ్మ యిట్లనెను:— "శివుఁ డేదోవిధమున వివాహమొనర్చుకొని గృహస్థుఁడు కావలెను. అట్టి యుపాయమును నోమహామాయా! యోచింప వలయును. ఆతఁడు దారగ్రహణమొనర్పక సృష్టికార్యము జరుగదు.''

ఇది వినఁగానే భవానీ జగదంబికాదేవి యిట్లనెను:— "శివుఁడు నిర్వికారుఁడు. ఆయనకు స్వప్నమందైనను గామవాసన యుత్పన్నము కాఁజాలదు. కామము లేక వివాహము జరుగదు. కావున నిది యసంభవము. కాని నాయారాధన మెన్నటికిని నిష్ఫలము కాఁజాలదు. కావున నేనే నీపుత్రుఁడగు దక్షునకుఁ బుత్రీరూపమునఁ బుట్టి శివుని వివాహమాడెదను.'' ఇట్లు వర మొసంగి మహాశక్తి అంతర్ధానమయ్యెను.

ఆదిశక్తివలన వరమును బొంది యాతఁడు తన ప్రధాన పుత్రుఁడగు దక్షప్రజాపతి కిట్లాదేశమొసంగెను:— "పుత్రా! నీవు మహాశక్తిని తపస్సుద్వారా సంతుష్టి యొనర్పుము. ఆమె నీకు బుత్రికారూపమునఁ బుట్టఁగలదు.'' బ్రహ్మ యాజ్ఞను బొంది దక్షుడు క్షీరసాగర సమీపమున సహస్రవర్షములవఱకు నిరాహారుఁడై యొంటికాలిపై నిలుచుండి ఘోరతపంబొన

రించెను. ఆతని తపస్సునకుఁ బ్రసన్నురాలై జగదంబిక ప్రత్యక్షమై వరమడుగు మనెను. దక్షుఁడు చేతులు జోడించుకొని యిట్లనెను:– "దేవీ! నీవు నాయెడలఁ బ్రసన్నురాలవగుచో నాకు సాకారవై పుట్టి శివుని వివాహమాడవలెను."

మహామాయయగు జగదంబిక యిట్లనెను:– "దక్షా! నేను నీ మీఁదఁ బ్రసన్నురాలనైతిని. నీకుఁ బుత్రికనై శివుని వివాహమాడెదను. నాయెడల నీ ప్రేమ యెప్పుడు శిథిలమగునో అప్పుడు నేనీ శరీరమును త్యజించెదను." అని పలికి శక్తి అంతర్ధానమయ్యెను. దక్షుఁడు తన గృహమునకుఁ బోయెను. కాలాంతరమున నామెయే దక్షునకు సతీరూపమునఁ బుత్రికయై పుట్టి, పెద్దదికాఁగానే వివాహయోగ్య యయ్యెను. వివాహయోగ్య కాఁగానే ఆమె శివప్రాప్తికై వనమునకుఁ బోయి ఘోరతపం బొనరించెను. శాస్త్రవిధిచే నామె నందా వ్రతారంభమును గావించెను. ఆమె తపస్సును గాంచి తమతమ స్త్రీలతోఁగూడి బ్రహ్మ, విష్ణువు, సమస్తదేవతలును వచ్చిరి. ఆమె శివప్రాప్తికై తపంబొనర్చుటను గాంచఁగానే అందఱకును బరమహర్షము కలిగెను. ఇప్పుడు బ్రహ్మకు కొంచెముగ నాశ కలిగెను. ఆతఁడు భగవతీ సతీదేవియొక్క అలౌకిక రూపలావణ్యమును గాంచి, శివప్రాప్తికొఱకు ఆమె చేయు ఘోరతపస్సును గాంచి, ఇఁక నిప్పుడు మనపని నెఱవేరఁగలదని తెలిసికొనెను. అందువలన నాతఁడు విష్ణుభగవానుని వెంటఁబెట్టుకొని కైలాసముననున్న శివుని సమీపమునకుఁ బోయెను. అచ్చట ఆ దేవత లిద్దరును తమ దేవులతోఁ గూడుకొని శివునిఁగూర్చి స్తుతించిరి. వారి స్తుతికి సంతుష్టుఁడై శివుఁడు వారి యాగమనకారణ మడిగెను

శివుఁడు సంతుష్టుఁడగుటను గాంచి బ్రహ్మ యిట్లనెను:- "స్వామీ! మేమిద్దరమును వివాహమాడితిమి. బ్రహ్మాణియు, లక్ష్మియు మీ యెదుట నిలిచియేయున్నారు. కాని మీరు వివాహముచేసికొననంతవఱకు సృష్టికార్యము జరుగదు. కావున స్వామీ! ఈ రూక్షత్వమును వీడి కొంచెముగ సరసత్వమును హృదయములోనికిఁ దెచ్చికొనుఁడు. వట్టి వైరాగ్యమున సృష్టికార్య మెట్లు నడువఁగలదు? మీరును మావలెనే ఒకటికి రెండుగను, రెండునుండి బహుళముగను గండు."

శివుఁడు భోలాశంకరుఁడగుటచే నిట్లనెను:- "నాయనలారా! నాకు వివాహమందును గివాహమందును నిచ్ఛలేదు. బుద్ధిపూర్వకముగఁ దన కాళ్ళకుఁ దానే సంకెళ్ళను వేసికొనువారెవరు? వివాహముకాఁగానే మరల నది తోఁకవలె మా వెంటఁ బడును. మీ వెంట వీరు దిరుగుచుండిరికదా! మా సమాధికి విఘ్నమగుచుండుననిన మీరు వినుటలేదు. మీకుఁ బూర్ణముగ నట్టి కోరికయే యుండినచో నన్వేషింపుఁడు వధువును. అనురూపయగు వధువు దొఱకినచో నామెయును నిచ్చుటనే పడియుండఁగలను."

ఇది వినఁగానే ఆ యిద్దరు దేవతలకును నత్యంత ప్రసన్నత కలిగెను. అతఁడిట్లనెను:-"స్వామీ! దక్షకుమారియగు సతీదేవి లోకవిఖ్యాతినిఁ జెందిన సౌందర్యము కలది. ఆమె మీ కొఱకు తపంబొనరించుచున్నది. మీ రొకసారి వెళ్లి ఆమెను జూచిరండు. ఆమె తపస్సునకు దర్శనమొసంగి, సఫలతను గావించుఁడు. తర్వాత మీ యిష్టము."

శివుఁ డీ ప్రస్తావము నంగీకరించెను. ఇచ్చట సతీదేవికి రెండు నెలలపాటు జరుగవలసిన నందా వ్రతమును బూర్తి యయ్యెను. ఆ వ్రతసమాప్తిదినమున విశ్వనాథుఁ డామె సమ్ముఖమునఁ బ్రత్యక్షమయ్యెను. ఆమెయొక్క తపోయుక్తమగు ముఖమండలమును గాంచి శివుఁడు తన పణమును విస్తరించి యిట్లనెను:–"దేవీ! నీవు నీ కిష్టమువచ్చిన వరమును గోరుకొనుము."

తన సమ్ముఖమున సాక్షాత్సదాశివుని సాకారరూపమునఁ గాంచి సతీదేవి గబగబ లేచి, సిగ్గుతో శివునకు సమస్కరించి యథోచిత సామగ్రులతో నాతనికిఁ బూజ నొనర్చి, తల వంచుకొని ఆతని సమ్ముఖమున నిలుచుండెను. శివుఁడామెను వరమును గోరుకొను మనుచుండినను నామె ముఖమునుండి లజ్జాకారణమున నొక్క శబ్దమైనను వెలువడలేదు. అప్పుడు శివుఁడే స్వయముగ నిట్లనెను:– "మంచిది, నీవు నన్ను వివాహమాడెదవా?"

ఇది వినఁగానే సతీదేవి ముఖకమలము వికసించెను. ఆమె యభీష్టమును నిదియే. శివుఁడు సంతుష్టుఁడై యాతఁడే యీ ప్రస్తావమును గావించెను ప్రస్తావమేమిటి, వరమునే యొసంగెను. ఆమె సంతసించి పరమేశ్వరుని పాదపద్మములకుఁ బ్రణామము కావించి, వరమును బొంది, తన తల్లిదండ్రుల కడకుఁ బోయెను.

సూతుఁడిట్లనెను:– "మునులారా! కామనయే మానవుని దీనునిఁగా నొనర్చును. కోరిక లేనంతవఱకు మానవుఁడు స్వతంత్రుఁడుగను నిస్పృహుఁడుగను నుండును. కామన లేక

సంకల్పము మనస్సున నుత్పన్నమయ్యెనా అన్నిఁ
నకు వచ్చును. అప్పుడందఱకు ననునయ వినయమ
నలసి యుండును. బ్రహ్మయు, విష్ణువును జెప్పి
వికృతికే వ్యతిరేకించినవాఁడు నేఁడు మనస్సున
కలుగఁగానే సిరు సీరై పోయెను. వారికి కోరికే
లీల నొనర్చుచున్నారు.

ఇప్పుడు శివునకు సదా సతీదేవియొక్క స
పనే ధ్యానమందుఁ గనఁబడుచుండెను. వసంత,
రతీదేవి మొదలగువారు చేయజాలని కార్య
దర్శన మాత్రముచేతనే అయిపోయెను. ఇం
మనస్సులో సతీదేవిని వివాహమాడుటెట్లులా యన
తప్ప వేఱొకటి లేకుండెను. ఆతఁడు బ్రహ్మను
బ్రహ్మ స్మరణమాత్రముననే పరువిడివచ్చెను.
డాతనిని మిక్కిలిగ నాదరించెను. ఇప్పుడాతఁడు
గుమర్చవలయును గదా! ఆతఁడు మిక్కిలి
బ్రహ్మతో నిట్లనెను:- "బ్రహ్మ! దక్షుఁడు త
యగు సతీదేవిని నాకిచ్చు నుపాయము నేదైనఁ
ఇది వినఁగానే బ్రహ్మ లోలోన మిక్కిలి యానంద
యిట్లనెను:- "స్వామీ! మీరు భయపడెదరెందుఁ
నాకుఁ బుత్రుఁడే. ఆతఁడు తప్పక సతీదేవిని నీ
చేయఁగలఁడు. నేను మీ వివాహముకొఱకు
త్న మొనర్చెదను."

అప్పుడు శివుఁడిట్లనెను:- "మంచిది, నీవు వెళ్లి దక్షుని యభిప్రాయమును గ్రహించి శీఘ్రముగ నాకుఁ దెలుపవలయును."

ఇది వినఁగానే సరియేఁని బ్రహ్మ దక్షప్రజాపతికడకుఁ బోయెను. నా కూఁతురి వివాహము శివునితో నెట్లు కాఁగలదను చింతలో దక్షుఁడు పడియుండెను. బ్రహ్మదేవుఁడు ప్రస్తావింపఁగా దక్షుఁ డత్యంత సంతోషమును బ్రకటించుచు నంగీకరించెను. బ్రహ్మ మరల శివుని కడకుఁ బోయెను. శివుఁడు సంకల్ప మాత్రముచేతనే విష్ణువు, మరీచ్యాది సమస్త ఋషులు, మునులు, దేవగణము వచ్చిరి. అందఱును మిక్కిలి వైభవముగ దరలి దక్షప్రజాపతి యింటికిఁ బోయిరి. వైదికవిధిచే సతీ పరమేశ్వరులకు వివాహము జరిగెను. సతిని దీసికొని శివుఁడు కైలాసమునకు వచ్చి, తన యర్ధాంగియగు సతీదేవితో వివిధ విధముల రసమయమగు క్రీడలొనర్చుచుండెను. కొంతకాలము పోయిన తర్వాత భగవంతుఁడును కౌసల్యాకిశోరుఁడగు శ్రీరామునిఁ బరీక్షించుటకు మోహవశమున సతీదేవి సీతాదేవి వేషమును ధరించెను. ఆ కారణమున శంకరుఁడామెను మానసికముగఁ ద్యజించెను. ఆ సమయముననే దక్షుఁడు శివభాగము లేని యజ్ఞము నొనర్చెను. దానిలోనే సతీదేవి తన ప్రాణములను ద్యజించెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! వీరభద్రునిచే యజ్ఞ విధ్వంసనమును గావింపఁజేసినఁ తర్వాత దక్షుని శిరము నఱకఁబడినప్పటికి శివునకుఁ గోపము శాంతింపలేదని విని యున్నాము. ఆతఁడు సతీవియోగమున నతి విహ్వలుఁ

జయ్యెను. ఆమె శవమును భుజముమీఁదఁబెట్టుకొని నృత్యము చేయసాగెను. ఆతని యిట్టిదశను గాంచి శ్రీవిష్ణుమూర్తి తన చక్రముచే సతీదేవి యొక్క సమస్తాంగములను ముక్కలు ముక్కలుగఁ గొట్టి విసరివేసెను. ఎచ్చటెచ్చట సతీదేవి యొక్క వివిధాంగములు పడినవో అచ్చట శక్తి పీఠములు వెలిసెను. అచ్చట యిప్పటికిని నట్టి భావముతోఁ బూజలు జరుగుచున్నవి. అట్టివి యేఁబదియొక్క పీఠము లేర్పడినవి. దేవీ భాగవతమందు నూటయెనిమిది పీఠములున్నట్లు చెప్పఁబడినది. సతీదేవియొక్క యేయే యంగము లెచ్చటెచ్చట పడినవో అచ్చట శివుఁడు వేఱు వేఱు పేర్లనుంచి భైరవ రూపమున విరాజిల్లు చుండును. కాశ్మీరమందు సతీదేవియొక్క కంఠము పడెను. అచ్చట మహామాయా పీఠ మేర్పడెను. అచ్చట త్రిసంధ్యేశ్వర భైరవుఁడుండెను. వైద్యనాథమునందు హృదయముపడెను. అచ్చట శక్తి దుర్గ. అచ్చట వైద్యనాథ భైరవుఁడుండెను. ప్రయాగరాజమందు చేతి వ్రేళ్లు పడెను. అచ్చట శక్తి లలితాశక్తి. అచ్చట భవుఁడను భైరవుఁడుండెను. ఇదే విధముగ సమస్త స్థానములందును శివుఁడు నివసించుచుండును. సతీదేవియొక్క అంగములన్నియు ఖండఖండములైనను నామె సాన్నిధ్యమును వదలక భైరవరూపమున నేఁటికిని విరాజిల్లు చుండునంతటి ప్రేమ ఆమెపై శివునకుండెను.

మునులారా! ఇదంతయును సిధూర్త కాముని కౌతుకము. అయ్యలారా! నిజమునకుఁ గామునకేమి శక్తి కలదు. ఇదంత యును శివలీల. జీవుల నుద్ధరించుటకై యిట్టి క్రీడ లొనర్చు చుండును. జీవులకిట్టి సరస విషయములందు చాలమందికి

మనస్సు లగ్నమగును. కఫరోగములలోఁ దీపివస్తువులన్నియును జెఱుపు చేయును. కాని తీపియైనను దేనినేమియును జేయదు. అదేవిధముగఁ గామకథలన్నియు నరకమునకుఁ గొనిపోవునవియే. కాని యవియే హరిహరులకు సంబంధించినవగుచో ముక్తికి హేతువు లగును. దక్షుఁడింతటి ద్వేషమునేల వహించెనని మీరడిగితిరి. సతీయుత్పత్తి ఈర్ష్యావశమున జరుగుటచే నిట్లైనది. మొదటినుండియు నీ స్పర్ధ వచ్చుచునేయున్నది. ఇట్టి లీలయే జరుగకుండిన శివుఁడేల లీలనొనర్చును. ఆతఁడు సదా బ్రహ్మానందసుఖమందే సదా నిమగ్నుఁడై యుండును. అట్లుండినచో శివభక్తుల యుద్ధార మెట్లు జరుగును? కర్ణములను బవిత్రమొనర్చు శివకథోత్పత్తి యెట్లు జరుగును? కావుననే శివుఁ డీ లీలల నొనర్చెను."

# దేవాదులు బ్రహ్మకడకు వెళ్లుట.

## (౨౦౫)

శ్లో॥ అథ దేవగణాః సర్వే రుద్రానీకైః పరాజితాః।
శూల పట్టిశ నిస్త్రింశ గదా పరిఘ ముద్గరైః॥

సంఛిన్న భిన్న సర్వాంగాః సర్త్విక్సభ్యా భయాకులాః।
స్వయంభువే నమస్కృత్య కార్త్స్న్యే నైతన్న్యవేదయన్॥
—శ్రీభాగ. ౪ స్కం. ౬ అ. ౧, ౨ శ్లో.

చ. హరభటకోటిచేత నిశితాసి గదా కరవాల శూల ము
ద్గర ముసలాది సాధన విదారిత జర్జరితాఖిలాంగులై
సురలు భయాకులాత్ములగుచున్ సరసీరుహజాతుఁ జేరి త
చ్చరణ సరోరుహంబులకు సమ్మతి జాఁగిలి మ్రొక్కి సమ్ములై.
—శ్రీమదాంధ్రమహాభాగవతము.



ఏ సభలోనికిఁ బెద్దలురారో, పూజ్యులకవమాన మెచ్చట జరుగునో ఆ సభ సఫలత చెదుననుటలో సందేహముండితీరును. ఆయా కార్యము లేభావమున నారంభింపఁబడినవో సర్వజ్ఞులగు వారికిఁ దెలియును. కార్యము సద్భావముతో, శుద్ధచిత్తముతోఁ జేయఁబడినచో శ్రేష్ఠులందఱును దానిలోఁ బాల్గొందురు. కార్యముయొక్క నిజాయతిలో సందేహ మున్నచో నా ర్యములోనికిఁ గొందఱు వచ్చెదరు, కొందఱు రారు. దక్షుని యజ్ఞము శివభాగ విహీనమైనదనియు, ద్వేషవశమునఁ జేయఁబడుచున్న దనియు విష్ణువును, జగత్పితామహుఁడగు

బ్రహ్మయు తెలిసికొనిరి. ఇదెట్లో సఫలము కాదని తెలిసికొని వారా యజ్ఞమునకు మొదటినుండియు రాలేదు. అంతే, అను కొన్నట్లైనది. యజ్ఞవిధ్వంసమగుటయే కాదు, యజ్ఞకర్తయుఁ జంపఁబడెను.

యజ్ఞవిధ్వంసన విషయమును విని శౌనకుఁడు సూతు నిట్లడిగెను:- "సూతా! మహాశక్తి సతీరూపమున నవతరించిన విషయమును మేము వినియుంటిమి. యజ్ఞవిధ్వంసమైన తర్వాత నేమైనదో మే మెఱుఁగఁగోరుచున్నాము."

ఇది విని సూతుఁ డిట్లనెను:- "మహాభాగా! విదురుఁ డడుగఁగాఁ దర్వాత సమాచారమును మైత్రేయుఁ డాతని కేమి చెప్పెనో దానినే నీకు జెప్పుచున్నాను. దక్షయజ్ఞ విధ్వంసనానంతరము మైత్రేయమహాముని యీ ప్రసంగమును ప్రారంభించి యిట్లు చెప్పఁదొడఁగెను."

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! వీరభద్రుఁడును, శివగణమును, హరపార్షదులును నందఱను నఱకి, బాదిన తర్వాతఁ గైలాసమునకుఁ దిరిగివెళ్లిరి. అప్పుడు దేవతలందఱును, ఋషులును లబలబ యని యేడ్వసాగిరి. కొందఱు విఱిఁగిన చేతులను జూచుకొని యేడ్చిరి, కొందఱు లొట్టలుపడిన కండ్లను జూచుకొనియుఁ, దెగిన చెవులను జూచుకొనియు గ్రందన మొనర్చుచుండిరి. కొందఱు విఱిఁగినకాళ్ళను జూచుకొనియు, తగిలిన దెబ్బలను జూచుకొనియు నేడ్చుచుండిరి. సారాంశ మేమనఁగా నందఱును క్షతవిక్షితులై రోదనము చేయసాగిరి. కొంద ఱిట్లనిరి:- "ఈ శివగణము అసభ్యులు, ఉద్ధతులు, అతి

క్రోధము కలవారు." ఇది విని దీని నెవరును వినుటలేదుగదా యని అటునిటు బిత్తరిచూపులు చూచుచుండిరి. కొందఱిట్లనిరి:- "ఇదంతయును మహాంధకారము. ఏదైన నుపాయ మొనర్పవల యును. ఇది పూర్తిగ నన్యాయము. సర్వథా గ్రుడ్డితనము. అడుగు వారెవరును లేరు. ఇది నిరంకుశత. పూర్ణముగ నరాజకతయే."

ఇది విని యొకానొకఁ డిట్లనెను:- "ఇదంతయును గ్రుడ్డి తనమే నను కొనుఁడు. నీ వేమి చేయఁగలవు? ఇంకెవరైన నన్యాయ మొనర్చినచోఁ బ్రజలు రాజు నాశ్రయించెదరు. రాజే గ్రుడ్డితనముఁగ నుండిన నింకఁ బ్రజలెవనిని శరణు వేఁడవలయును! ఇప్పుడు శివునకుమించినవాఁ డెవఁడున్నాఁడు? ఆతఁడే చరాచర విశ్వమునకు స్వామి. తల్లి కోపపడి పిల్లవానినిఁ గొట్టుచోఁ బిల్లవాఁ డెచ్చటికిఁ బోవును? తల్లి వడిలోనికే పరువిడును. ఆమె చెంగునే పట్టుకొనును. వాని కన్యశరణము లేదు. అన్యా శ్రయము లేదు. ఇప్పుడు శివుని శరణువేఁడుటచేతనే నిస్తారము కలుగఁగలదు. అప్పుడే అందఱదుఃఖము దూరము కాఁగలదు."

అంతఁ జాలమందొక్కసారిగా భయభీతులై యిట్లనిరి:- "కాదయ్యా, శివుని కడకుఁ బొరపాటుననైన వెడలరాదు. అచ్చటకు వెళ్ళితిమా మరల దడి తగులును. అచ్చట మనకు దిక్కులేరు. మనను బలుకరించువారైన నుండరు. ఇచ్చటనే రుద్రగణ మింతటి యున్మత్తులగుచో నిఁక శివసమ్ముఖమున నెంత చేయఁగలరో యూహింపుఁడు."

ఇది విని యాతఁడే యిట్లనెను:- "ఏమైనఁ గానిండు, శివశరణమునకు వెళ్ళక సుఖములేదు, శాంతిలేదు, కల్యాణము

లేదు, ఆపత్తునుండి బయటపడుటయు లేదు. శివుఁడు మసలను జూడఁగనే అభయదాన మొసంగునుపాయము నాలోచింపుఁడు."

అంత భృగుముని యిట్లనెను:- "రుద్రుఁడు క్రోధావతారము. ఆతఁడు తన ప్రియావియోగమునఁ గుపితుఁడై యున్నాఁడు. ఆతఁడు తన మూఁడవకన్నును దెఱచెనా అందఱును భస్మము కాఁగలరు. కావున మా యభిప్రాయ మిది — అందఱమును గలసి ప్రజాపతి పతియగు స్వయంభూ బ్రహ్మదేవుని చరణసన్నిధికి వెళ్లుదము. ఆచ్చటకు వెళ్ళిన తర్వాత నాతఁ డేవిధముగఁ జేయుమనిన నట్లు చేయుదము. ఒకవేళ నతఁడు శివునికడకే వెళ్లుదమనిన, నాతనినే వెంటఁబెట్టుకొని వెళ్లుదము. ఆయన మనవెంట నుండినచో శివపార్షదగణము, భూత, ప్రేత, పిశాచ, యక్ష రాక్షసాదు లేమియును మాటలాడరు. శివుఁడును నాతనిని మిక్కిలిగ నాదరింపఁగలఁడు.''

ఈ యభిప్రాయ మందఱకును నచ్చెను. అందఱును దమతమ వాహనములమీఁద జీనులను వేసికొనియుఁ, గొందఱు దేనిమీఁదనో యెక్కియుఁ, గొంద ఱది యిది తీసికొని, తమ తమ విమానముల నెక్కి బ్రహ్మలోకమునకు వెళ్ళిరి.

దూరమునుండియే బ్రహ్మ గ్రుడ్డి, కుంటి, అంగభంగ క్షత విక్షతులైన దేవతలు, ఋషులు వచ్చుటను గాంచెను. ఏదో పప్పుమాడినదని యాతఁడు గ్రహించెను. యజ్ఞములో నేదో గలభాయైనది. బ్రహ్మకంతయును దెలియును. ఆతనికి భూత భవిష్య ద్వర్తమానములలోఁ దెలియనిదేమియును లేదు. అయినను శిష్టాచారము ననుసరించి సహానుభూతినిఁ బ్రదర్శిం

చుచు నిట్లనెను:- "ఓయీ! యీ దశ యెట్లువచ్చినది? మీ కెవరితో యుద్ధము సంభవించినది? మిమ్ముల నిట్లంగహీనము కావించినవా రెవరు?"

ఇది విని భృగువు తన స్వభావానుసారముగ గడ్డము మీఁదఁ జేతులతో నిమురుకొనుచుఁ జెప్పఁబోఁగానే యిది వఱకే మీసములు గడ్డము పోవుటచే లజ్జను దాఁచుకొనుచు గడ్డము గోకుకొనుచు నిట్లనెను:- "స్వామీ! ఏమియు నడుగకుఁడు. మేము మీ బలపౌరుషములమీఁదనే సమస్తమును జేయుచుందుము. మీరు సమయమునకు రారు."

బ్రహ్మ గంభీరముగ నిట్లనెను:-"ఏమైనదో చెప్పుఁడు." విసుగుకొని యిట్లనెను:- "ఏమైనది? నా బొందైనది. దక్షుఁడు యజ్ఞము నొనర్చెను. దానిలో శివునకు భాగమొసంగలేదు. సతీ పరమేశ్వరులను బిలువలేదు. సతీదేవి పితృస్నేహముచే శివేచ్ఛకు విరుద్ధముగ వచ్చెను. దక్షుఁ డామె నాదరింపలేదు. ఆమె యోగాగ్నియందు భస్మమైపోయినది. అంత శివుఁడు కోపమున వీరభద్రు నుత్పన్నము కావించి భూత, ప్రేత, పిశాచాది శివగణములను వెంటనిడి దక్షాధ్వరమును విధ్వంసము గావింపఁ బంచెను. వారందఱు నుద్దండస్వభావము కలవారను సంగతి మీ రెఱిఁగినదే. చేతులలో త్రిశూల, పట్టిశ, ఖడ్గ, గదా, పరిఘ, ముద్గరాదులను గ్రహించి యజ్ఞమండపములోనికి వచ్చి ఆఁకలిగొన్న పులులవలె నందఱిపైఁ బడిరి. వారెవరి ప్రతిష్ఠను గాని, మాన సమ్మానములనుగాని, శీల సంకోచములనుగాని గమనింపక, యెదుటకు వచ్చినవారినందఱను బాది వదలిపెట్టిరి. ఎవఁడు కనఁబడిన వానిపై దణదణ దెబ్బలు పడుటయే. కొట్టు

టలోఁ గొందఱను జీల్చిరి, కొందఱను పిండిచేసిరి, కొందఱ నగ్నిలో వ్రేల్చిరి. ఒక్కసారి భూకంపమువలె వచ్చెను. యజ్ఞ మండపమున నేడ్పులు పెడబొబ్బలు చెలరేగెను. మీ రుండి యుండిన నీ కాండ యెవరికిఁ గలుగును. శివుఁడు రాకపోవుటచే త్రిమూర్తులలో మీరిద్దరును రాలేదు. చూడుఁడు, నా గడ్డము మీసములను నా దుష్టులు పెఱికివైచిరి.''

తన నవ్వు నాపుకొని బ్రహ్మ యిట్లడిగెను:- ''గడ్డమును మీసములను బెఱకుటచే వాని కేమి లభించినది ?''

రోషముతోఁ జేతులను విదలించుచుఁ బండ్లను బటపట గొఱకుచు భృగువిట్లనెను:- ''ఏమి లభించినది మట్టి. వారి కల్లరి చేయుటయే పని. వారి కిష్టమువచ్చినట్లు చేసిరి. భగదేవతల కన్నులను బెఱికివైచిరి. పూషునినోట నొక్కపంటినైన వదల లేదు. ముప్పదిరెండుపండ్లను రాలఁగొట్టి పర్వతకందరమువలె బోసినోటి నొనర్చిరి. కొందఱకుఁ గాళ్ళను విఱుగఁగొట్టిరి, కొందఱకుఁ జేతులను విఱుగఁగొట్టిరి. దక్షప్రజాపతి శిరస్సును ఛేదించి జ్వలితాగ్నిలో హవనము కావించిరి.''

ఆశ్చర్యముతో బ్రహ్మ యిట్లడిగెను:- ''అయ్యో ! దక్షుని జంపినారా ? ఇంకెవరి ప్రాణములను దీసిరి ?''

అంత భృగు విట్లనెను:- ''ఇంకెవరి ప్రాణములను దీయ లేదు. కాని చాల నిర్దయతతో బాదిరి. అందఱకును చిన్ననాటి పాలు జ్ఞాపకమునకు వచ్చెను. ఇంతకంటె జంపివేసినను బాగుండెడిది.''

బ్రహ్మ యిట్లనెను:- "మీరును నన్యాయము కావించితిరి. ఉన్నతినిఁ గాంక్షించువారు తేజస్వులతో విరోధమును బెట్టుకొనకుండుట మంచిది."

భృగు విట్లనెను:- "స్వామీ! మాకేమి విరోధము? ఇది మామ అల్లుండ్ర గృహకలహము. మధ్యలో వ్యర్థముగ మాకు దడి తగిలినది."

ఇది విని బ్రహ్మ రోషస్వరమున నిట్లనెను:- "మీ యపరాధ మేలలేదు, మీరే ఆతని నాకాశమున కెత్తితిరి. మీరాతని యన్యాయమును సమర్థింపకుండినచో నాతని కెన్నటికిని శివభాగ విరహితమగు యజ్ఞమునొనర్చు సాహస ముండెడిది కాదు. మీ రిట్టి యజ్ఞమును వదలి రావలసియుండెను. మీకు లోభవశమున దీని నిట్లు కావించిరి. శంకరుఁడు యజ్ఞభాగమున కధికారి యేమిటి, సమస్తయజ్ఞములకును నేకైకస్వామి. ఆయననే మీ రందఱును గలిసి బహిష్కరించిరి. అట్టి మీకు తడి తగులక యేమి కాఁగలదు?"

భృగువిట్లనెను:- "స్వామీ! ఇప్పటికైనదేమో అయినది. ఇఁక నిప్పుడిది ముదరకుండునట్లు చూడవలసియున్నది. శివుఁ డధికముగఁ గోపించి మనల నందఱను వినాశము చేయకుండునట్లు చూడవలెను."

ఇది విని బ్రహ్మ యిట్లనెను:- "నాయనలారా! శివుఁ డాశుతోషుఁడు. ఆతఁడిట్టి ద్వేషభావములను బెట్టుకొనువాఁడు కాఁడు. మీరందఱును మీమనస్సులలోని కల్మషముల నావలఁ ద్రోసివైచి శుద్ధచిత్తముతో నాతని నాశ్రయింపుఁడు. ఆతఁడు

మిమ్ములను దప్పక క్షమింపఁగలఁడు. ఆతని మనస్సులో రాగ ద్వేషము లుండవు."

భృగుమహర్షి యిట్లనెను:—"స్వామీ! మనస్సులో నాతనికి రాగద్వేషములే లేకున్న చో మాకిట్టి దుర్దశ నేలకావించును?"

అంత బ్రహ్మదేవుఁ డిట్లనెను:— "ఒక్కసారిగాఁ గారణము లన్నియును గలిసి వచ్చెను. ప్రజాపతి యజ్ఞమందు నా సమ్ముఖముననే దక్షుఁడు శివుని ననరాని మాటలాడెను. అనేకవిధముల దూషించెను. అయినను నాతఁడన్నిటిని సహించి యూరకుండెను. ఆతఁడు మఱచిపోయెను. దక్షుఁడాతనికి విరుద్ధముగ యజ్ఞమొనర్చి, ఆతనినిఁ బిలువక, వెనుకటి విషయములను మరలఁ గ్రొత్తవిగ నొనర్చెను. దానికిని శివుఁడుపేక్షించినాఁడు. ఆతనికి ప్రాణప్రియ పత్నియగు సతీదేవి ప్రాణత్యాగము చేయఁగా నాతనికిఁ గోపము వచ్చుట స్వాభావికమే. ఆతనిపత్ని యజ్ఞమునకు వచ్చి భస్మము కాకుండి యుండినచో నాతఁడు మాటలాడెడువాఁడే కాఁడు. మీరెన్ని చేసినను పలికెడువాఁడే కాఁడు."

భృగుమహర్షి యిట్లనెను:— "స్వామీ! ఇప్పుడేమి చేయవలెను? దక్షాధ్వరము పూర్తియగుటెట్లు? ఆతనిని బ్రదికించు టెట్లు? యజ్ఞము నెట్లైనఁ బూర్తి కావింపఁజేయుఁడు."

ఇది విని బ్రహ్మ యిట్లనెను:— "ఇది నా సామర్థ్యమున కతీతమగు విషయము. ఇదంతయును శంకరభగవానుఁడే చేయఁగలఁడు. ఆతని శక్తి అపరిమేయము. ఆతని సంకేతము చేతనే ప్రపంచములోని సమస్త కార్యములు జరుగుచున్నవి.

విష్ణు భగవానుఁడైనను నాతని తేజో, బల, వీర్యైశ్వర్యముల లోతును గనుఁగొనఁజాలఁడు. అట్టియెడ నితర దేవతా, ఋషి మునులకు సామర్థ్యమెక్కడిది? మరల యజ్ఞ మారంభమై యథావిధిగ సమాప్తి కావలెనని మీరందఱును గాంక్షించు నెడల, మీరందఱును గలిసి గరళకంఠుని చరణారవిందములను బట్టుకొనుఁడు. మీ అపరాధములను క్షమింపుఁడని మీరతని నపరాధక్షమాపణమును గోరుఁడు. ఈ దెబ్బలాట యిప్పుడు జరుగుటయే కాదు. నిజముగ శివునకుఁ గోపమే వచ్చుచోఁ దన మూఁడవ కన్నును దెఱచి సమస్త బ్రహ్మాండమును భస్మము చేయఁగలఁడు."

భృగు విట్లనెను:- "స్వామీ! ఆతఁడనిన మాకు భయము వేయుచున్నది. మీరుకూడ మావెంట వచ్చినచో మేమి వెళ్లఁగలము. లేకున్న ఒంటరిగా వెళ్లు సాహసములేదు. ఆతఁడు మెదలకున్నను నాతని వెంటనున్న పార్షదగణము మిక్కిలి ధూర్తులు, వినాశకులు, అత్యంతాసభ్యులు. వారు చేయి చేసికొనిరా అంతయును నూపరభూమి కాఁగలదు."

ఇది విని బ్రహ్మ నవ్వి యిట్లనెను:- "నాయనలారా! భయపడవలసిన పని యేమియును లేదు. అయినదేమో అయినది. ఇఁక నిప్పుడు మీయెడల నట్టి వర్తనముండదు. పదండి, నేనును మీవెంట వచ్చెదను."

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! ఇట్లు చెప్పి హిరణ్యగర్భుఁడు సమస్త దేవతలను, ఋషులను వెంటఁ బెట్టుకొని శివుని దర్శనము కొఱకు కైలాసమునకుఁ బోయెను."

———

# బ్రహ్మ శివునికడకు వెళ్లుట.

## (౨౦౬)

శ్లో॥ స ఇత్థమాదిశ్య సురానజస్తైః
సమన్వితః పితృభిః సప్రజేశైః।
యయౌ స్వధిష్ణ్యాన్నిలయం పురద్విషః
కైలాసమద్రి ప్రవరం ప్రియం ప్రభో॥

— శ్రీభాగ. ౪ స్కం. ౬ అ. ౮ శ్లో.

వ. "—— ——" భక్త పరాధీనుండును శరణాగత రక్షకుండును నగు నీశునిఁ జేరంబోవుదమని పలికి పద్మసంభవుండును దేవపితృగణ ప్రజాపతులం గూడి కైలాసాభిముఖుండై చని చని."

— శ్రీమదాంధ్రభాగవతము.

—o—

ఈ ప్రపంచములో సజీవ సౌందర్యమును దిలకింపవలె నను గోరిక యున్నచో శైలరాజమగు హిమాచలమునకుఁ బోవలెను, హిమాలయోత్తుంగ శిఖరములు, తమ లక్ష్మిని వాయుమండలమునఁ బ్రసరింపఁజేయుచుఁ బ్రపంచమునే శోభిత మొనర్చుచున్నది. కైలాస, లోకపాల, శతపథముల యొక్క స్వచ్ఛ హిమాచ్ఛాదిత శిఖరశోభా, సౌందర్యముల సాకార స్వరూపము విశ్వమునందున్నది. కాక భుశుండి యొక్క శుభ్ర జలధరములవంటి యాశిఖరములు తమ గొప్పదనమును నా నిర్జన కోలాహల శూన్య స్థలమందుఁ బ్రదర్శించుచున్నవి. దేవేంద్రుఁడు వీటి రెక్కలను దెగఁగొట్టకుండినచో మనము

ఉత్సవములందు వానినిఁ బిలుచుకొనివచ్చి, సభామండపమున ఱెక్కలను విస్తరింపఁజేసినచో పాల నురుగువలె హిమాచ్ఛాదితములగు నా పర్వతము లెంత బాగుగాఁగనఁబడునో కదా! మన యుత్సవముల కెంతటి శోభనొసంగునో-పిల్లలు వాని స్కంధముల పైకియెక్కి, వాటినిఁ దాఁకి, చలిచే వ్రేళ్లను గొంగరలు పోవునట్లు చేసికొందురు. ఎంతటి యానందము కలుగును? కాని శచీపతియగు నింద్రుఁడంతయును బేడ బెల్ల మొనర్చినాఁడు. అన్నిటి ఱెక్కలను నఱికి అచలములుగఁ జేసివేసినాఁడు. ఇప్పుడచ్చటికి మంచులోఁ జచ్చుట కెవరు వెళ్లెదరు? శోభను దిలకించు చుండఁగనే ధూదిపింజలవలెఁ బైనుండి మంచువర్షము కురిసెనా అచ్చట జయజయ సీతారామ కావలసినదే. శరీరము క్రుళ్లనైనఁ గ్రుళ్లదు. వేలకొలఁది, లక్షల కొలఁది సంవత్సరములు మంచులోఁ గప్పఁబడి సురక్షితముగఁ బడియుండును. మంచు భయములేక, గుండెను రాయిచేసికొని, ఆఁకలిని జయించి, లోక వాసనను వీడి, ఆత్మయందు రమించుచో నిఁకఁ గావలసిన దేమున్నది? అ యనుపమ సౌందర్యమును వీడి యీ కోలాహల పూర్ణమును, దుఃఖపూరితమగు నీ ప్రపంచమున కేల రావలెను? గిరిరాజ హిమాలయ పర్వత శిరోమకుటమగు కైలాసపర్వతమును దర్శించిన పురుషుఁడే ధన్యుఁడు, ఆతని నేత్రములే సఫలములు. వర్తమాన కైలాసమున కావల శివుని దివ్యకైలాసమున్నదని ప్రతీతి. ఆహా! ఈ కైలాసమును జూచు చుండిననే మన కన్నులు తృప్తిచెందకుండిన నాదివ్య కైలాస మెట్లుండునో తెలియదు? అచటికి మానవులు వెళ్లఁజాలరు. దేవతలు, సిద్ధులు మాత్రమే అచ్చటికి వెళ్లఁగలరు.

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! లోక పితామహుఁడగు బ్రహ్మను ముందుబెట్టుకొని సమస్త దేవతా గణము, ఋషిగణము, పితృగణము తమ తమ విమానముల నెక్కి కైలాసము వైపునకుఁబోయిరి. బ్రహ్మలోకాధిపతియగు బ్రహ్మ తపోలోకమునకు వచ్చునప్పటికి అచ్చటి తపోలోక నివాసులగు ఋషులు చతురాననునకు స్వాగతము కావించి, కొంచెము సేపుండుఁడని కోరిరి. హంసవాహనుఁడగు బ్రహ్మ వారి స్వాగత సత్కారములను స్వీకరించి యిట్లనెను:- "మేము చాల యవసరమగు పనిమీఁద వెళ్లుచున్నాము, కావున నుండఁ జాలము" ఇదేవిధముగ జనలోక, మహర్లోక వాసులును దివ్య పుష్పవృష్టిని గురిపించి అందఱకు స్వాగత మొసంగెను. కాని కుంటిగ, గ్రుడ్డిగ, క్షత విక్షతులైన దేవ, పితృ, మానవుల కీ స్వాగత సత్కారములు రుచింపలేదు. ఇంద్రలోకమును వీడి సుమేరువునకు ఉత్తరపు కోణమందు ధనదుఁడగు గుబేరుని అల కాపురీ సమీపమున నున్న కైలాసమునకు వారు దిగిరి.

కైలాసమునుండి శీతలవాయువు తగులఁగానే అందఱి బాధలు పటాపంచలయ్యెను. అందఱును నొక్క దివ్య సుఖాను భవము ననుభవించిరి. కైలాసపర్వతమును జూడఁగానే అందఱి యొక్క మనస్సు ఉల్లాసముతో నిండిపోయెను. అందఱియొక్క మనమయూరము నృత్యముచేయసాగెను. దేవగణమందునను, మునిగణమందునను నిదివఱకు కైలాసమునకు రానివారు కలరు, చాలమంది వచ్చియు వెంటనే విమానముమీఁద నెక్కి వెడలి పోయిరి. నేఁడందఱును స్వస్థచిత్తులరై కైలాసమును దర్శించిరి. శివుని సమ్మానార్థ మందఱును దమతమ విమానములనుండి దిగి

పాదచారులై వెడలుచుండిరి. అచ్చట వారు చాలమంది సిద్ధులను దపస్సుచేయుచుండుటను గాంచిరి. ప్రపంచభానమే లేనట్లు చాలమంది సమాధిమగ్నులై యుండిరి. ప్రాణములను నిరోధించి వారు బ్రహ్మానుభవ మొనర్చుచుండిరి. కొందఱు సిద్ధులనుగాంచి మునులు బ్రహ్మ నిట్లడిగిరి:– "ప్రభూ! ఇచ్చట నీ సిద్ధు లందఱును దమ యుగ్రసాధనలచేతనే యున్నారా? ఇంకేమైనఁ గారణమున్నదా?"

బ్రహ్మ యిట్లనెను:– "సిద్ధులలోఁ జాలరకములు కలరు. చాల భేదములు కలవు. సిద్ధులందఱు నొకేవిధమగు సాధన నొనర్పరు."

ఇది విని అత్యంత సుందరరూపమును ధరించిన చాల మంది సిద్ధులనెదుటఁ జూపించి దేవతలు, మునులు నిట్లనిరి:– "స్వామీ! వీ రే సిద్ధులు?"

బ్రహ్మ యిట్లనెను:– "సిద్ధు లొక ఉపదేవతా జాతి. ఈ జాతిలోఁ బుట్టినవారు జన్మసిద్ధులు. వీరిలోఁ బక్షులకు స్వాభావికముగ నెగురుశక్తి యున్నట్లును, జలజంతువులకు నీటిలో శ్వాసించుట నాపియుండు శక్తి కలిగినట్లు సిద్ధు లుండును. ఆ జాతిలోఁ బుట్టినవారు జన్మసిద్ధులు. వీరు మిక్కిలి సుందరులుగ నుందురు. మీరు వారినిఁ జూచుచున్నారుగదా! అగ్నిసదృశమగు తేజఃపుంజముతోఁ గనఁబడుచున్నారు."

ఇది విని దేవతా పితృగణము ముందుకుఁబోఁగా నింకను గొందఱు సిద్ధులు కనఁబడిరి. మునులు కుతూహలవశమున వీ రే శ్రేణికి చెందిన సిద్ధులని యడిగిరి.

ఇది విని బ్రహ్మ యిట్లనెను:- "ఈ కైలాసపర్వతమున నొక ఓషధి కలదు. దాని నొక విశేషముహూర్తమునఁ బెల్లగించి తెచ్చెదరు. దాని నొక విశేషప్రక్రియతో శుద్ధి చేయుదురు. ఇంకఁ గొన్ని యోషధులను జేర్చి దానిని బటానీలంత మాత్రలు చేయుదురు. ఆ మాత్రలను దినఁగానే శిద్ధులగుదురు. ఇంకొక ఓషధి కలదు. దానినిఁ గాలికి రాచుకొనినచో నేల మీఁదవలె నీటిపై నడువవచ్చును. నోటిలోఁ బెట్టుకొనిన నెచ్చటికైన నెగిరిపోవచ్చును. కంటి కంజనముగఁ బెట్టుకొన్నచో విశ్వబ్రహ్మాండములోని వస్తువులన్నియు నొక్కస్థానమునఁ గనఁబడును. భూమిక్రింద ననంతసువర్ణరాశి, అనంతధనము నిండి యున్నది. ధనమున కింకొక పేరు వసువు. వసుధనమును ధారణ చేసినది వసుంధర. అందుకనియే పృథివికి వసుంధర యను పేరును గలదు. ఆ సిద్ధు లెచ్చట కావలయుననిన, నెంత కావలయుననిన నంతటిధనమును దీయఁగలరు. వారికి కొదువ యుండదు. ఆ ఓషధీప్రభావమున సిద్ధులు సమస్తము చేయఁగలరు. సిద్ధులన్నియు వారికి ఓషధులద్వారా ప్రాప్తించును.

ఇది వినఁగానే మునులకుఁ జాల యాశ్చర్యము కలిగెను. అల్పసిద్ధులు కల మునులు వారిట్లనుకొనిరి:- "మనకును నట్టి ఓషధిలభించినచో మనమును శ్రమలేకయే సిద్ధుల చమత్కారమును జూపింపవచ్చును."

కొంత ముందుకు పోఁగానే ఇంకొక సిద్ధగణము కఁబడెను. వారి చర్యలు విచిత్రముగ నుండెను. కొందఱొంకాలిపై నిలుచుండిరి. కొందఱు ముండ్లపైఁబరుండిరి. కొండఱగ్నిని వెలిఁగించి ధూమమును బానమొనర్చు చుండిరి.

కొందఱు నదిలోని జల్లని నీటిలో నిలుచుండి తపస్సును జేయు చుండిరి. కొందఱు తడిగుడ్డను గట్టుకొనిరిఁ గొందఱు వల్కల వస్త్రమును ధరించిరి. కొందఱు దిగంబరిగనుండి, కొందఱు భస్మమును బూసికొనిరి. కొందఱు తలక్రిందుగాఁ జెట్లను వ్రేలాడుచుండిరి. కొందఱు పంచాగ్ని మధ్యమున నుండిరి. కొందఱు రాలిన గింజల నేరుకొనుచుండఁగాఁ గొందఱు ఫలము లను రాల్చుచుండిరి. కొందఱు కందమూలములను త్రవ్వు చుండిరి. కొందఱు పత్రములను నమలుచుండిరి. కొందఱు విశేషక్రియ ద్వారా వాయువునే పానము చేయుచుండిరి. కొందఱింగుదీ ఫలములను నూరుచుండిరి. కొందఱు ప్రాణా యామ మొనర్చుచుండిరి. కొందఱు సమాధి మగ్నులైరి. కొందఱు రాళ్లతోఁ దమ శరీరములను నూరుచుండిరి. కొందఱు తమ శరీరములను గోసి పక్షులకు వేయుచుండిరి. కొందఱగ్నిలో హావన మొనర్చుచుండిరి. కొందఱుపవాస పరాయణులైరి. కొందఱు బోడులు, కొందఱు శిఖులుఁ కొందఱు జటాజూట ధారులు, కొందఱు నృత్యముచేయుచుఁ గృష్ణ కీర్తన మొనర్చు చుండిరి. కొందఱు మౌనవ్రతమును ధరించి ధ్యాన నిమగ్నులైరి.

వీరినందఱను గాంచి కుతూహలవశమునఁ బితరు లిట్లడి గిరి:- "ప్రభూ ! వీరే సిద్ధులు ?"

బ్రహ్మ యిట్లనెను:- "వీరు తపస్సిద్ధులు, వీరందఱును దపస్సుద్వారా సిద్ధినిఁ బొందిరి. శరీరక్లేశములద్వారా తపించు టయే తపస్సు, వీరిలో నిరాహారముగ నుండుట - ఉపవాస మొనర్చుట-ఇవి శ్రేష్ఠములగు తపస్సులు, ఏలననఁగా మానవు లన్నిటిని సహించునుగాని ఆఁకలిని సహింపఁజాలరు. తన కాప్తు

లైన వారు జచ్చినను నీ యాఁకలి విడువదు. దీనిమీఁద విజయ మును బొందినవాఁడే తపస్వి, ఆతఁడే సిద్ధుఁడు, వీరు వివిధ క్రియలుద్వారా భగవదారాధనము చేయుచున్నారు."

మును లిట్లడిగిరి:- "స్వామీ! ఇది తామసతపస్సు, ఈ విధమగు గాయక్లేశముచే నజ్ఞానము ప్రకటమగుచున్నది."

బ్రహ్మ యిట్లనెను:- "తామసమైనను తపస్సే. ప్రపంచము త్రిగుణాత్మకమైనది. అందఱును వారివారి స్వభావానుసారముగఁ దపస్సును జేయుచుందురు. తమోగుణులు సాత్త్విక సాధనములను జేయఁజాలరు. వారికి తామసతపస్సే వీలు. ఏదో విధముగ భగవదారాధన మొనర్తురు కదా! ఇఁక నజ్ఞాన విషయమందుమా, సాధనలన్నియు నజ్ఞానమువలననే చేయఁబడుచున్నవి. జ్ఞానికి సాధన యెందులకు? కావున భగవదుద్దేశ్యమునఁ జేయఁబడిన వన్నియు మంచివే. అటునిటుఁదిరిగి చివరకచ్చటకు రావలసినదే; ఏలననఁగా లక్ష్యమందఱకు నొక్కటియే"

ఇంక ముందుకు పోఁగాఁ జాలమంది చేతులలో జపమాలలను ధరించి జపమొనర్చుటను గాంచి మునులిట్లనిరి:- "స్వామీ! వీరెట్టి సిద్ధులు?"

బ్రహ్మ యిట్లనెను:- "భగవంతున కనేక మూర్తులు కలవు. అందులో నొకమూర్తి మంత్రమును. అందువలననే ఆ మూర్తుఁడగు భగవంతుని మంత్రమూర్తి యందురు. అర్థభావనమొనర్చుచు నేకాగ్రచిత్తముతో నిరంతరము మంత్రజపము చేయుటచే నిశ్చయముగ సిద్ధికలుగును. అన్నిటికంటెను జపసిద్ధి గొప్పది. ఈ మహానుభావులు జపము ద్వారముననే

సిద్ధినిఁ బొందిరి. సిద్ధించినను స్వభావానుసారముగ జపమును జేయుచునే యుందురు. ఏలననఁగా వీరికి దీనిలో రసము చిక్కినది. ఇప్పుడింకొక పనియందలి వీరికిఁ బ్రవృత్తి లేదు. మంత్ర మూర్తియగు భగవానునిఁ దన యిష్టమంత్రము ద్వారమున నారాధించుటయే వీరికేకైక వ్యాపారము."

ఇంకను ముందుకుఁబోఁగా యమ, నియి, మాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులందు మగ్నమైన మునులను గాంచి దేవత లిట్లడిగిరి:- "ప్రభూ ! వీ శ్రేణికిఁజెందిన సిద్ధులు."

లోక పితామహుఁడగు బ్రహ్మ యిట్లనెను:- "వీరష్టాంగ యోగముద్వారా సిద్ధులైరి. ఈ రాజయోగులు గొప్ప నియమ సంయమముల ద్వారా తమ భూమికను దృఢ మొనర్చుకొందురు. సంయమమే వీరి శస్త్రముఁ బ్రాణాయామమే వీరికి పరమబలము. దీనిద్వారా వీరు జీవబ్రహ్మ యోగము నొనర్తురు. ప్రాణనిరోధమువలన స్వతః మనో నిరోధముకలుగును. కావున వీరు ప్రాణవాయువును వశపఱచుకొని సదా సమాధి మగ్నులయ్యెదరు."

అంతఁబితరులిట్లడిగిరి:- ఈ సిద్ధులందఱును కైలాసము పైననే యేలసమకూడిరి? ఇంకెచ్చటను వీరికి తావులేదా?"

ఇది విని నవ్వుచు బ్రహ్మ యిట్లనెను:- "ఇంకెచ్చటికి వెళ్లెదరు? సర్వసిద్ధి ప్రదాత సదాశివుఁడే సిద్ధులకు ప్రభువు శంకరుఁడే. శివారాధన మొనర్పక సిద్ధికలుగదు. మనమందఱము సిద్ధికొఱకు శివుని సన్నిధికి వెళ్లుచున్నాము. విష్ణువును

శివారాధన మొనర్చియే సిద్ధిలాభమును బొందినాఁడు. సనాతన పురాణ పురుషుఁడైన శ్రీకృష్ణుఁడును శివార్చన నొనర్చెను. గొప్ప గొప్ప ఋషులు, మహర్షులు శివపూజామూలముననే తమ యభీష్టమును నెఱవేర్చుకొనిరి. కావున సిద్ధులకుఁ బ్రధాన స్థానము కైలాసమే."

ఈవిధముగ దేవతలు, ఋషులు, మునులు, పితరులు మొదలగువారు బ్రహ్మను వివిధ ప్రశ్నలడుగుచు మెల్ల మెల్లగాఁ గైలాసశోభను వీక్షించుచుఁ గాలినడకనే వెడలుచుండిరి. ఒక్కొక్క చోట సిద్ధులు ధ్యానమగ్నులైరి. ఒక్కెడఁ గిన్నరులు తమ కిన్నరస్త్రీలతో విహరించుచుండిరి. ఇంకొకచోట గంధర్వులు గంధర్విణులతో గీతాగాన మొనర్చుచుండిరి. మఱియొక చోట నప్సరసలు నృత్య మొనర్చుచుండిరి. దేవతలు, ఉప దేవతలు విహరించుచుండిరి.

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! ఈ విధముగఁ గైలాసమును గాంచఁగనే అందఱ చిత్తములు చాల ప్రసన్నతను జెందెను. వీరి దృష్టి యెక్కడ పడిన నచ్చట నిలిచి పోవుచుండెను. బ్రహ్మ తొందఱపెట్టుచుండఁగా నందఱును జేతులను జోడించుకొని యిట్లనిరి:- "ప్రభూ! మెల్ల మెల్లగా రండు. నేఁడు మాకానందము కలుగుచున్నది. నేడు మాకంత యును జూపించుచు, సమస్త శోభావర్ణనమును గావించుచు వెళ్లుదము. ఇట్టి అవకాశము మాటిమాటికి లభింపదు."

బ్రహ్మ వారి ప్రార్థనము నంగీకరించి, యాశైల శిరో మణి శోభను గాంచుచు మెల్ల మెల్లఁగా వెళ్లుచుండిరి."

—♦—

# కైలాసముయొక్క అనుపమశోభ.

## (౨౦౭)

శ్లో॥ మయూరకేకాభి రుతం మదాంధా లివిమూర్ఛితమ్ ।
ప్లావితై రక్తకంఠానాం కూజితైశ్చ పతత్రిణామ్।
ఆహ్వయన్త మివోద్ధస్తై ర్ద్విజాన్కామ దుఘైర్ద్రుమైః ।
వ్రజన్తమివ మాతంగై ర్గృణంతమివ నిర్ఘరైః॥

— శ్రీభాగ. ౪. స్కం. ౬ అ. ౧౨. ౧౩ శ్లో.

వ. "...... కలకంఠ కాలకంఠ కలవింక రాజకీరమత్త మధుకర నానా విహంగ కోలాహల నినద బధిరీభూత రోదోంతరాళంబును, గల్పవృక్షశాఖ లూగుచు ద్విజులను బిల్చుచున్నట్లుండెను. ఏనుఁగు లటు నిటు పోవుచుండ స్వయముగనా కైలాస పర్వతమే పోవుచున్నట్లుండెను. సెలయేరుల ఝుంకారము మాట లాడుచున్నట్లుండెను."

— శ్రీమదాంధ్రభాగవతము.

---

శోభ యెచ్చటనుండునో సౌందర్య మచ్చట నుండును. వనములోని వస్తువులు వనమందే సుఖదములుగ నుండును. సాహిత్యమందు వనశోభావర్ణన మన్నిటికంటె సుందరముగను, సుఖదముగను వర్ణింపఁబడుచుండును. నిజముగ మనకు నగరములలో సుఖముండదు. ఇచ్చటి శోభ కృత్రిమముతో నశించును. ప్రకృతి యిచ్చట లజ్జించి ముసుఁగు వైచికొనును. జనసమూహమున నది నవవధువువలె సిగ్గుపడి తన సమస్తావయవములను దనలోనికి లాగుకొని వస్త్రములతోఁ గప్పివేసికొనును.

కావుననే నగరములలో ఆమెకు వన్నెవన్నెల మెఱయుచున్న కృత్రిమవస్త్రములు కనఁబడును. కమలసదృశమగు నామె మనోహర ముఖము, అంగసౌష్ఠవము, ఆమెయొక్క లావణ్యా మాధుర్య ఆకర్షక హావభావ కటాక్షము లిచ్చట నెక్కడ కనఁబడును? నిర్జనారణ్యములందు, మాయిక కోలాహల రహితమగు వనములందు, హిమాచ్ఛాదిత గిరిగుహాలందు, కమనీయ కందరములందు, సుందర శైలశిఖర ప్రాంతములందు ప్రకృతిదేవి లజ్జను వీడి, ముసుఁగును దీసి, నిశ్శంకయై నాట్యమొనర్చును. అచ్చట నామె నవవధువుగాక బాలికయగును. పుత్రీభావమును బొందును. బాలిక అత్తవారింటనే సిగ్గుపడును. అచ్చట త్వరత్వరగా ముసుఁగువైచికొనును పుట్టినింట నామె నిర్భయ యగును. పైట తొలఁగినను, ముసుఁగు వీడినను చిక్కులేదు. తోఁబుట్టువుల వద్దను, సఖులవద్దను నిర్భయయై బాగుగా మాటలాడును. నవ్వుచుండును. ఇదేవిధముగఁ బ్రకృతికి పుట్టినిల్లు కాననపూర్ణమగు శైలము. అచ్చట నామె శోభను వెదఁజల్లును. తన చంద్రముఖముపైని ముసుఁగును దొలఁగించును. ఆమె యొక్క అనవద్య సౌందర్యమును జూడఁదలచిన యెడల నా శాంత, ఏకాంత వనములకును, బర్వత శిఖరములకును బోవలెను. అచ్చట నామె యథార్థరూపము కనఁబడును.

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! అంత అను వెంటఁ బెట్టుకొని బ్రహ్మ ముందు నడుచుచుండెను. నానా ధాతు మండిత చిత్ర విచిత్ర ఫలపుష్ప సుశోభితమై, సుందర శిఖరయుతమైన శైలమును గాంచుచు, దేవ, పితృ, ఋషిగణ మాతని వెనువెంటఁ జనుచుండెను. అనేక జాతులగు మృగ

సమూహ మచ్చట స్వచ్ఛందముగ విహరించుచుండెను. మధు లోలుపలగు నున్మత్త భ్రమరములు నల్దిశల గుంజారవ మొనర్చు చుండెను. కోకిల తన కమనీయ కంఠముతోఁ గుహూకుహూ యని కూయుచుండెను. వృక్షము లూగుచుండెను. పక్షు లెగురు చుండెను. సెలయేరులు పారుచుండెను. ఖగ, మృగాదులు కలకలారవము లొనర్చుచుండెను. నానావిధ వృక్షము లచ్చట దిగంబరావధూతలవలె నిలుచుండెను. వాని శాఖ లనేక బాహు వులవలె నుండెను. పత్రములే శరీరరోమములు. వృక్షము లసంఖ్యాజాతులవి కలవు. సాల. తమాల, తాల, కోవిదార, ఆసన, పారిజాత, రసాల, జామ, పనస, వేప, నిమ్మ, దబ్బ, నారింజ, మాతులుంగాది యనేక విధములగు నిమ్మలుండెను. బత్తాయి, కమల, మొదలగు నారింజ జాతివృక్షములు కలవు. కదంబ,నాగ, పున్నాగ,చంపక, పాటల, అశోక,మాలి(శ్రీ),కుంద, కురవాది, పర్వతవృక్షములు కలవు. కమలములనుగూర్చి చెప్ప వలసిన పనియేలేదు. మెట్టతామరలు పర్వతకందరములలోఁ బెరుగును. ఎల్లప్పుడును మంచున్నచోట, మంచును జీల్చుకొని అవి పెరుగును. తాఁకిన వాడునేమో అనునంతటి కోమల ములుగ నుండును. మంచి ఉత్కట మాదకగంధము వెలువడును. అవి యెఱుపు, నీలము, తెలుపు మొదలగు ననేక రంగులలోఁ గలవు. అచ్చట మెట్టదామరల వనమే కలదు. వాని యుత్కట గంధముచే అందఱ తలలు తిరిగిపోవునంతటి గంధము వచ్చుచుం డెను. అందువలన నందఱును త్వరత్వరగా ముందుకు నడచిరి.

కొంచెము దూరము పోఁగా జిన్నవి, పెద్దవియు నగు సుందర స్వచ్ఛ జలాశయములు కొన్ని గలవు. వానిలో రక్త,

నీల, శ్వేత, గులాబీ రంగులుగల కమలములు వికసించి యుండెను. కొన్ని శత పత్రకములు, కొన్ని సహస్ర పత్రకములు, సమీపమున నున్న వృక్షములమీఁద మాలతీ, మల్లె మాధవి మొదలగు లత లల్లుకొని యుండెను. అవి తమ కాశ్రయదాతను దమబాహువులతో గట్టిగాఁ గౌఁగిలించుకొనెను.

గొప్పగొప్ప వృక్షములు కదలుచుండెను. పరస్పరము రాచుకొనుచుండెను. వానిపైనున్న పుష్పములు నవ్వుచుండెను. పనస, ఖర్జూర, అశ్వత్థ, శాల్మల, వట, ఇంగుద, మధుక, ప్రియాల, రసాల, జామ, పోక, ఆమలక, పుత్రజీవి మొదలగు వృక్షములు దట్టముగ నుండెను. దాని సమీపమున వంశీవనము కలదు. అది మిక్కిలి దట్టముగ నుండెను. దాని నెవఁడును దాటిపోఁజాలఁడు. వాసములలో ననేకరకములు కలవు. గట్టి వెదురు, బోలువెదురు, పొట్టివెదురు, పొడుగువెదురు, కాకి వెదురు మొదలగునవి. అవి వాతాహతముచేఁ బరస్పరము రాచుకొనుచుఁ గిఱ్ఱు కిఱ్ఱుమని యేమేమో మాటలాడుకొను చున్నట్లుండెను. చిన్నచిన్న సరోవరములందు వికసించిన నానా విధ కమలములు చాల యందముగ నుండెను. కుముద, ఉత్పల, కల్హార, శతపత్రాదులు కమలములలోని వివిధజాతులు. వానిపైఁ జంచరీకములు మూఁగెను. అవి తలలను వంచి నిర్భయముగ రసమును ద్రాగుచుండెను. మధుకరములను మధువును ద్రాగ వలదనుచున్నట్లు వాయువశమునఁ గమలము లూఁగుచుండెను; కాని రసలంపటులగు భ్రమరములు వదలుటయులేదు. ఎగిరి పోవుటయును లేదు. ఇంతలోనే గుంపులు గుంపులుగ భ్రమర ములు వచ్చి మూఁగెను. ఈ వ్యాపార మచ్చట నిరంతరము

జరుగుచునే యుండును. సరోవరసమీపమున సారస, హంస, జలకుక్కుట, జలకాకాదు లెగురుచుండెను. మత్స్యములు కమల నాళములను గదల్చుచు, వాటి మెఱపుచే సరోవరమును దళతళ లాడించుచుండెను. వనములో నటునిటు హరిణ, వానర, సూకర, సింహ, భల్లూక, నీలవృషభ, శరభ, శార్దూల, కృష్ణమృగ, మహిష, కస్తూరిమృగములును, అడవి ఆవు, కొండకుందేళ్లు మొదలగు నాటవిక జంతువు లటునిటుఁ దిరుగుచుండెను. మంచు కొండలో నొకవిధమగు శశకము కలదు. అది ఆఱునెలలు భూమిమీఁదను, ఆఱునెలలు నేలలోను బడియుండును. స్వాయ ముగ నది భూమిలో నొక గుహను నిర్మించుకొని, దానిలో నాఱునెలలకుఁ గావలసిన భోజనమును గూడఁబెట్టుకొని మంచు పడుట ప్రారంభించఁగానే అది దానిలో దూఱును. అది మూఁడు గదులుగ నేర్పఱచుకొనును. ఒకదానిలో భోజనము బెట్టు కొనును. ఒకదానిలో మలమూత్రములను విడుచును. ఒక దానిలో నివసించును. మంచుకొండ ఆ గుహపై నేర్పడును. అయినను దానికి చింతలేదు. మంచు కరిగిపోఁగానే అది గుహ నుండి వెలువడును. ఇదెంతటి తపస్వీజీవియో కదా! దానినిఁ గూడ ఆటవికులు చంపుచుందురు. దాని చర్మ మత్యంత కోమ లముగ నుండును. దానిని మహిళలు తమ మెడలందు ధరించు చుందురు. దానిని గలిపి వఱుపులనుగూడ కుట్టుచుందురు. దాని మజ్జాపదార్థ మనేక రోగములకుఁ బనికివచ్చును. అది హిమా చ్ఛాదిత శిఖరములందే నివసించును. దేవత లిట్టి తపస్వీజీవులను గాంచి ఆశ్చర్యమును బ్రకటించుచుందురు.

ముందుకుఁబోఁగా నందఱును హరహర యనుచు, గంతు లిడుచు నంద, అలకనందలను నదులు ప్రవహించుచుండుటను గాంచిరి. వాని తీరములందచ్చటచ్చట సతీదేవి స్నానమొనర్చుటకు ఘట్టములు కలవు. అవి చక్కఁగను స్వచ్ఛముగను నుండెను. ఆ పర్వతము విస్మయభాండారము. ఒకదానికంటె నింకొకటి విస్మయమును గలిగించునదై చిత్తమును జనుత్కృత మొనర్చు వస్తువులు కలిగియుండెను. నదులలో స్వర్గములోని యప్సరసలు క్రీడ నొనర్చుచుండిరి. కొందఱు స్నానమాడుచుండిరి. కొందఱు పాడుచుండిరి. కొందఱు వాయించుచుండిరి. కొందఱు తినుచుండిరి, కొందఱు త్రాగుచుండిరి. కొందఱు జలములను జిమ్ముచుండిరి. కొందఱు శృంగార మొనర్చుకొనుచుండిరి. కొందఱు వేణిని ముడుచుచుండిరి. కొందఱు కేశపాశములను జిక్కు తీసికొనుచుండిరి. కొందఱు వక్షస్థలమున కంటిన కుంకుమను జలములలోఁ గడుగుచుండిరి. పచ్చని యా నీటినిఁ ద్రావి గజము లున్మత్తము లగుచుండెను. ఏనుఁగులు తొండములు తొండములు మెలివైచుకొని ఘీంకారము లొనర్చుచుండెను. దేవాంగనలు నవ్వుచు నితరులకు స్మృతినిఁ గలిగించుచుండిరి. దేవతలు వారి క్రీడలను గాంచి విస్మితులై వారి గాయపుబాధలను మఱచిపోయిరి. తమ కచ్చట స్వర్గమునకంటె నెక్కుడు సుఖము గోచరించెను.

సమ్ముఖమున నలకాపురి కనఁబడుచుండెను. తిత్తిరిపక్షు లెగురునట్లు, అచ్చట స్వర్ణ, రజిత, నానామణి ముక్తావిభూషితములగు విమానము లటునిటు బుఱ్ఱుబుఱ్ఱుమని యెగురుచుండెను. రంగురంగుల మేఘములతోఁగూడిన యా యాకాశ

మందుఁ దమ పత్నులతో విమానముల నెక్కి
సూర్యప్రకాశమందు గలిసి చంద్రు సంటుకొనిన
ములతోఁ బ్రకాశించుచున్నట్లా యుపదేవతలు

ఆ శిష్టమండలము కుబేరుని అలకాపురి
విడిచి, కల్పవృక్షములతోఁ బరిపూర్ణమై, నా
లచే సుగంధితమగు సౌగంధిక మను వనము
అచ్చటి శోభ వర్ణనాతీతముగ నుండెను. కమ
నలంకారముగ నుండిన సుందర మనోహర సలిల
రములను గాంచుచుఁ బుష్పములను గోయుచుం
రుష గంధర్వ యువతులను గాంచుచు ముందుకు
తా మెచ్చట నున్నదియుఁ, దా మెచ్చటికిఁ బో
నందఱును మఱచిరి. అందఱును దా మొక
దున్నట్లు భావించుచుండిరి. కైలాసమింతటి సుం
వృషభధ్వజుని విభూతి యిట్టిదనియు నేఁడందఱ
కముగఁ దెలిసికొనిరి. అందఱును దమ్ము తా
కొనుచుండిరి :- "ఇంతటి వైభవపూర్ణుఁడగు
వ్యర్థముగ నవమానము గావించితిమి. య
బహిష్కరించి మన మత్యంతాపరాధమును గా
పతి మనల నేమనునో యెవ్వరికినిఁ దెలియ
మాయన ముఖము నెట్లు చూడఁగలము ?"
కొనుచుండఁగనే వారికి యెదుట నొక గొప్ప
బడెను. బ్రహ్మ దూరమునుండియే అంద
జూపించెను :- "చూడుఁడు, ఈ విశాలమ
క్రిందనే శివుఁడు సదా నివసించుచుండును."

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! ఇది వినఁగానే సమస్తదేవతలు, పితరులు, ఋషులు, మునులు దూరమున నుండియే యా వటవృక్షమునకుఁ బ్రణామమును గావించిరి. ఏలననఁగా శివుని స్మరణముచేతను, కైలాసదర్శనముచేతను వారి యంతఃకరణములు పవిత్రములయ్యెను. ప్రణామమొనర్చిన మీఁదట వారి హృదయములందు శివదర్శనము చేయవలయునను నత్యంతోత్కటమగు నభిలాష కలిగెను. హృదయమున నభిలాష కలుగఁగానే ఆశుతోషుఁడగు సదాశివుఁడు బోళాశంకరుఁడు కావున వెంటనే దర్శనమొసంగుటలో సందేహమేమియును లేదు."



# బ్రహ్మాది దేవతలకు మహాదేవుని దర్శనము.

## (౨౦౮)

శ్లో॥ తం బ్రహ్మా నిర్వాణసమాధిమాశ్రితమ్
వ్యుపాశ్రితం గిరిశం యోగకక్షామ్ ।
స లోకపాలా మునయో మనూనామ్
ఆద్యం మనుం ప్రాంజలయః ప్రణేముః ॥
— శ్రీ భాగ. ౪ స్కం. ౬ అ. ౩౯ శ్లో.

" కం. కని లోకపాలురును ముని
జనులును సద్భక్తి నతని చరణంబులకున్
వినతులయి రప్పు డబ్జా
సనుఁగని యయ్యాభవుఁ డధిక సంభ్రమ మొప్పన్ ॥
— శ్రీ మదాంధ్రభాగవతము.



ప్రపంచమున సర్వత్ర సుఖమే, సర్వత్ర అభయమే. మనము సుఖదుఃఖ భయములను స్వయముగ సృష్టించుకొను చున్నాము. ఇతరులను దుఃఖపెట్టితిమా మన మవశ్యము దుఃఖ పడవలసి వచ్చును. మన మితరులను భయపెట్టితిమా మనమును నితరులవలన భయపడవలసివచ్చును. ఏలననఁగా నొకే ఆత్మ అందఱిలో వ్యాపించియున్నది. ఏ వ్యవహారము నీ విషయములోఁ జెడ్డదిగ నుండునో దానిని నీ వితరులయెడలఁ జేయకుము. మనము మన పాపముచే నితరులలోఁ బాపమును గాంచుచున్నాము. మన భయముచే భయభీతుల మగుచున్నాము. మహాపురుషులకు మన మపరాధమొనర్చి మనవలెనే వారును

క్షుద్రకార్యము లొనర్చెదరని భావించి వారి యెదుటకుఁ బోవ లజ్జించెదము. కాని మహాత్ములకును, మహాపురుష, మహాత్ముఁడగు మహేశ్వరున కెవరిమీఁదను గోపమురాదు. పరిస్థితి వశమున నెవనిమీఁదనైనను గోపము వచ్చెనా అది నీటిమీఁది గీతవలె మాయమైపోవును.

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! కైలాస శోభను గాంచుచు బ్రహ్మ వెంట దేవతలు, పితరులు, ఋషులు, మునులు శివనివాసముకడకు సమీపించఁగా దూరమునుండియే వారికి విశాలమగు వటవృక్షము కనఁబడెను. అది నూఱు యోజనముల విశాలమైనది. డెబ్బదియైదు యోజనములు పొడవు కలిగిన శాఖలు కలవు. వర్షము కుఱిసిన నొకబొట్టైనఁ గ్రింద పడనంతటి దట్టముగ నుండెను. దానియందు పక్షులు గూండ్లను గట్టుకొనను లేదు. దానిపైఁగూర్చుండి యని కలకలారవములను జేయవు. దానిక్రిందఁ గూర్చుండి అసంఖ్యాకులగు సిద్ధులు ధ్యానమందు నిమగ్నులైరి. ఆ వటవృక్షము క్రిందనే దేవతలు దూరముననుండి దేవాధిదేవుఁడగు మహాదేవుని యోగాసనమున గూర్చుండఁగాఁ జూచిరి. సతీదేవి భస్మమైన రోషమును నాతఁడు త్యజించెను. ఆతఁడు రోషహీనుఁడగు అంతకునివలె నాసనాసీనుఁడయ్యెను. ప్రక్కనే ఆతనికి సఖుఁడును, సేవకుఁడు నగు నుత్తరదిశాధిపతి కోశాధ్యక్షుఁడు ధనదుఁడగుఁ గుబేరుఁడు చేతులు జోడించుకొని ఆతని సేవ చేయుచుండెను. సనక, సనందన, సనాతన, సనత్కుమార, నారదాది బ్రహ్మపుత్రు లచ్చట జిజ్ఞాసువులై శిరస్సులు వంచుకొని చరణ సమీపమునఁ గూర్చుండిరి. శివునకుఁ గర్తవ్యమేమియును లేదు,

విధినిషేధములు లేవు. విధిని నిర్ణయించువాఁ డాతఁడే నిషిద్ధకర్మగాని, విహితకర్మగాని లేకున్నను విశ్వకల్యాణమునకు శుభకర్మాచరణ మొనర్చి లోకసంగ్రహార్థము ముగ నున్నాఁడు. విద్యా, తపో, సమాధ్యాదుల నాచరించి తన యాశ్రితులకు నేర్పుచున్నాఁడు.

శివుఁ డొక కుశ, మృగచర్మ, వస్త్రములపై యాసనమందు విరాజమానుఁడై నాఁడు. శరీరమంతట భస్మమును ధరించియుండెను. ఆతని కంఠము రుద్రాక్ష సుశోభితమై యుండెను. తపస్వియొక్క చిహ్నములన్నిటిని మును ధరించెను. విస్తీర్ణమగు జడల నొక్కటిగఁ జేసి ముకుటమువలె జడను జుట్టెను. శిరస్సున విదియనాఁటి చంద్రుఁడు తన యద్భుతకాంతిని వెదజల్లుచుండెను. ఆతఁడు తొడపై వామపాదము నుంచి, యెడమ మడమయందు నానించి తర్కముద్రతోఁ గూర్చుండెను. ఆసనమునఁ తర్జని నంగుష్ఠముతో జోడించి మిగిలిన వ్రేళ్లనన్నిటిని నా యాకృతికిఁ దర్కముద్రయని పేరు. గురువులు ముద్రతోడనే యుపదేశించెదరు. కథావాచకులును జెప్పునపు డీ ముద్రనే ప్రదర్శించుచుందురు. శివుఁ డ మున నారదున కుపదేశించుచుండెను. అందువలన తర్కముద్రను ధరించినాఁడు. ఆతని మణికట్లకుఁ జ రుద్రాక్షమాలలు శోభ నొనఁగూర్చుచుండెను. ; ననే నారదుఁడు చేతులు జోడించుకొని వినీతభ నీచాసనమునఁ గూర్చుండి యోగమునకు సంబంధిం ప్రశ్న లడుగుచుండెను. శివుఁడు మిక్కిలి గంభీరము

ప్రశ్నలకు సమాధాన మొసంగుచుండెను. దగ్గఱ గూర్చుండిన నితర సాధుసమూహ మా యుపదేశామృతములను బూజ యైన మీఁదట భక్తగణము పంచామృతమును బానముచేసి నట్లు పానము చేయుచుండెను. అనేక చకోరములు చంద్ర కిరణములనుండి వెలువడు అమృతమును బానము చేయునట్లును, ప్రియతమునివద్దనుండి వచ్చిన సందేశ సుధను ప్రేమీజనము శ్రద్ధతోడను, ఉత్సాహముతోడను బానము చేయుచున్న ట్లుండెను.

భూతనాథుఁడు తన యెడమ భుజముతో యోగపట్టను నాశ్రయించి యుండెను. ఆతఁడు తన ప్రియురాలి నాశ్రయించు కొని యున్నట్లుండెను. అచ్చటి వాతావరణము మిక్కిలి శాంత ముగ నుండెను. ఆ శాంతవాతావరణమందు హఠాత్తుగా నొక సంభ్రమముతోఁ గూడిన పిలుపు వినవచ్చెను. ద్వారపాలురు చేతులు జోడించుకొని యిట్లు నివేదించిరి:– "స్వామీ! లోక పితామహుఁడగు బ్రహ్మయుఁ గొందఱు దేవతలును, ఋషు లును, మునులును మీదర్శనమునకై వేచియున్నారు." ఇది వినఁగానే సంభ్రమముతో సదాశివుఁడు వెంటనే ఆసనము నుండి లేచెను. తన తండ్రి వచ్చుటనుగాంచి యాతఁ డాతని నాదరముతోఁ దీసికొని పోవుటకు వచ్చెను. ఎదుట బ్రహ్మను గాంచి వృషభధ్వజుఁడు మిక్కిలి నమ్రతతో నాతని చరణము లకుఁ బ్రణామమును గావించెను. భగవానుఁడగు సదాశివుఁడు ప్రణామము గావింపఁగానే క్రమముగ నచ్చటనుండిన సిద్ధులు, ఋషులు, మునులు, యక్షులు, గంధర్వులు వీరందఱును లోక పితామహుఁడగు బ్రహ్మ చరణకమలములకు శ్రద్ధా భక్తితోఁ

దమతమ నామగోత్రముల నుచ్చరించుచుఁ బ్రణామమును గావించిరి. బ్రహ్మ అందఱ ప్రణామములను స్వీకరించి, అందఱకును యథోచిత సత్కారములను గావించి నవ్వుచు నంజలి బంధించి శివుని చేతులను రెంటిని మిక్కిలి ప్రేమతోఁ బట్టుకొని, అత్యంత భక్తినిఁ బ్రదర్శించుచు నిట్లనెను:- "మీరు చేయునదేమి ? ఈ యెదురీత యెందులకు ?"

లజ్జను బ్రదర్శించుచు భూతనాథుఁ డిట్లనెను:-"స్వామీ! ఎదురీత యేమిటి ? పుత్రధర్మము పితృచరణములకు నమస్కరించుట"

నవ్వుచుఁ జతురాననుఁ డిట్లనెను:- "స్వామీ ! నీకు తండ్రియెవరు ? నీవే అందఱకును తల్లివి, తండ్రివి, స్వామివి, సఖుఁడవు, సుహృదుఁడవు. నీవే యీ చరాచర విశ్వమునకేకైక స్వామివి. ఈ మభ్యపెట్టుట యింకెవరికైనఁ జేయుఁడు. నేను నీ తత్త్వము నెఱుఁగుదును. మొదట నెఱుఁగనుగాని విష్ణుభగవానుఁడు నాకు మీ స్వరూపమును దెలిపినాఁడు. నీవు ప్రకృతి పురుషుల కతీతుఁడవు. సనాతన పరమపురుషుఁడవు. అనఁగాఁ బురుషోత్తముఁడవు. ఈ సమస్త విశ్వమును నీవే బ్రహ్మవై సృజించెదవు, విష్ణుఁడవై పాలించెదవు, రుద్రుడవై నీలో లీనమొనర్చుకొందువు. అగణిత బ్రహ్మలు, విష్ణువులు, మహేశ్వరులు నీ సంకల్పమాత్రముననే పుట్టుదురు. యజ్ఞమును, యజ్ఞవిధిని మీ రేర్పఱచినదే. దాని ఫలదాతవును నీవే. అట్లయ్యు నన్ను శిష్టాచారవశమునఁ బ్రణామ మొనర్చుచున్నావు. ఇదియు నీ క్రీడయే."

కైలాసపతియగు మహేశ్వరుఁడు బ్రహ్మను నుచ్చాసనమునఁ గూర్చుండఁబెట్టెను. మిగిలిన సమస్త దేవతలను, పితరులను, ఋషులను, మునులను గూడ కూర్చుండ నాజ్ఞాపించెను. అందఱును స్వస్థచిత్తులరై కూర్చుండినతర్వాత శివుఁ డిట్లనెను:- "స్వామీ! మీరు వేదగర్భులు. అందఱకును జనకులు. మీరు జగత్తునందు సర్వశ్రేష్ఠులు. నాకును, ఇతర ప్రజాపతులకును మీరు తండ్రులు. సమస్త చరాచరవిశ్వమునకు మీరు పితామహులు. మీరే సాధ్య సాధన భేదమును జెప్పితిరి. మీరే స్వయముగ యజ్ఞయాగాదులను జేసి, యీ శుభకర్మలను బ్రచారము కావించితిరి. మీరొనర్చిన సృష్టి కుశలమేనా? సర్వత్ర మంగళమే కదా!"

నవ్వుచు బ్రహ్మ యిట్లనెను:- "కుశలమే. మీ కృపాదృష్టి లేనంతవఱకుఁ బ్రపంచములోఁ గుశల మెక్కడిది? మంగళస్వరూపులరు మీరే. మీరు రానిచోట మంగళమెచ్చట నుండి వచ్చును? వేదములను, యజ్ఞములను బ్రకటించినవారు మీరలే, దక్షుఁడు నిమిత్తమాత్రమే. కర్త, కర్మ, కారణము అన్నియును మీరలే. మీరే వేదరక్షకులు, మర్యాద నిర్మాతలు, కర్మఫలదాతలు, యజ్ఞభాగ భోక్తలు, యజ్ఞయాగ విధాతలు, దుఃఖితుల దుఃఖపరిత్రాతలు. మీరే పాపులకు నరకాదులను, బుణ్యాత్ములకు స్వర్గాదులను నొసంగుచుందురు. అచ్చటచ్చట కారణవిశేషముచే దీనికి విపరీతముగ జరుగుటయును గాంచుచున్నాము. ఇప్పుడు దక్షయజ్ఞము ఉదాహరణమున మాకు బ్రత్యక్షము. దక్షుఁడు నా పుత్రుఁడు. వేదజ్ఞుఁడు, కర్మకాండయందు నిష్ణాతుఁడు. వైదికబ్రాహ్మణుఁడు. ఆతఁడు

పరమపుణ్యమయమగు వైష్ణవయజ్ఞము నొనర్చినాఁడు. పుణ్య కర్మమును బ్రారంభించినాఁడు. కాని దానినిఁ బూర్తి కావింప లేకపోయినాఁడు. మిమ్మాదరింపకపోవుటచే దానికి విఘ్నము కలిగినది. మీరు పేక్షించితిరి. ఎట్టి కర్మమైనను మీరు పేక్షించినను, మిమ్ములను బహిష్కరించినను, అది పుణ్యప్రదకర్మమైనను పూర్తి కాజాలదు. పుణ్యఫల మొసంగునదియును గాఁజాలదు."

బ్రహ్మ పలికిన భూమికచే వీరందఱును దక్షయజ్ఞ సంబంధమున వచ్చినారని భూతనాథుఁడు గ్రహించెను. అందువలన మిక్కిలి శాంతితో నాతఁడిట్లనెను:- "బ్రహ్మా! దక్షుఁడు నన్నుఁ బిలువఁడు. దీనికి నాకేమియును బాధలేదు. ఆతని యజ్ఞము కావున నాయన కిష్టమువచ్చినవారినిఁ బిలువవచ్చును. లేనివారిని వదలివేయవచ్చును; కాని ఆతని కడుపునఁగన్న బిడ్డ, ఎంతో ప్రేమతోడను, ఎంతో ఉత్కంఠతతోడను వచ్చుటకుఁబోయినది. ఆమెను నోటితోనైనను బలుకరింపలేదు. ఇది యాతని కుచితమేనా? ఈ యవమానముచే నామె తన ప్రియప్రాణములను బరిత్యజించినది. అందువలన నాకుఁ గోపము వచ్చినది. నీవు నా పార్షదులను, గణములను నెఱుంగుదువు కదా! అందఱును మహాక్రోధులు. నేను క్రుద్ధుడ నగుటను గాంచి వా రధికక్రోధమును జెంది దక్షయజ్ఞ విధ్వంసనమును గావించిరి."

ఇదివిని నవ్వుచు బ్రహ్మ యిట్లనెను:- "స్వామీ! మీరు క్రోధమును స్పర్శింపనైన స్పర్శింపరు. మీసంగతి వేఱు. నీ భక్తులైనవారును, నీయం దనురక్తి కలవారును, తమ యంతరాత్మను నీ చరణారవిందములందు సమర్పించినవారును, అన్నిటి

యందును సర్వత్ర సర్వాంతర్యామియగు నిన్ను సమాన భావముతో వ్యాపించినట్లు చూచువారును, సమస్త జీవులును దమకన్యము కావని అనుభవ పూర్వకముగఁ దెలిసికొనిన వారును నగు భవచ్చరణారవిందమకరంద మత్తమధుపులగు భక్త గణమును సాధారణముగఁ గ్రోధమును జెందరు. వారును వెంటనే క్రోధమునకు వశీభూతులుకారు. అట్టియెడ మీకెట్లు క్రోధము రాఁగలదు? క్రోధమును జెందుట పాశవిక వృత్తి. పశువ్యాపారము. బుద్ధిమంతుఁడగు వాఁడెన్నడును గ్రోధమునకు స్థానమీయఁడు. క్రోధము అపరాధులమీఁదకు సాధారణముగ వచ్చుచుండును. మీరు సర్వులకును బ్రభువులు, జనకులు. మీకపరాధ మొనర్పఁగలవారెవరు? మిమ్ములను ద్వేషించి యెవరు జీవించి యుండఁగలరు?"

అంతఁ గైలాసపతి యిట్లనెను:- "నేను దక్షునకేమి చెఱుపు చేసితిని? మీయందఱ యెదుట నాతఁడు నన్నవసర ముగ నెట్టి పలుకులు పలికినాఁడు. వానికి నేను బ్రత్యుత్తర మీయలేదు. ఆతఁడు యజ్ఞమందు నన్ను బహిష్కరించినాఁడు. ఆతఁడు చేసిన మంచిపనియేనా?"

ఇది విని గంభీరతా స్వరమున లోకపితామహుఁడగు బ్రహ్మ యిట్లనెను:- "విశ్వనాథా! కర్మకాండయే సమస్తమని తలచువారును" లోన మలిన చిత్తము కలవారును, పరోత్కర్ష తను గాంచి క్రుళ్లుకొనువారును, ప్రసిద్ధులును, బ్రతిష్ఠితులు నగు వారియందు ఛిద్రాన్వేషణము కావించువారును, వారిని నిందించుటయందే తత్పరతను గలవారును, మాటలాడినచో నితరులను దుర్వచనరూపమగు బాణములతో సదా బాధించు

వారును వీరందఱును మరణించినవారిక్రింద లెక్కయే. కొంత కాలము వారికి ఉత్కర్ష యుండునేమోకాని మరల వారినడుగు వారుండరు. వారు తమ ఈర్ష్యారూపమగు సుకర్మచే దైవము మూలమునఁ గొట్టఁబడుదురు. ఇట్టి వారిపై మీరు కోపపడ రాదు. చచ్చినవారినిఁ జంపుటేమున్నది? పడినవానినిఁ బడ వేయుటయేమున్నది?"

శివుఁడిట్లనెను:- "ప్రభూ! ఇదివఱకు నేనేమియును జేయ లేదు. ఆతఁడే యూరక తగాదాను బ్రారంభించినాఁడు. ఏ ప్రసంగమును లేకయే రాగద్వేషములను బ్రారంభించినాఁడు."

బ్రహ్మ దీనిని విని యిట్లనెను:- "వృషభధ్వజా! భగ వంతుని మాయ అట్టిది. దానివలలోఁబడి జీవి కర్తవ్యాకర్తవ్య వివేకమును గోల్పోవును. బుద్ధి భ్రష్టమైనప్పుడు పరస్పరమున భేదభావ ముత్పన్నమగును. ఇది నాది, అది నీది. వీరు నావారు వారు పరాయివారు. నేను నైకొనెదను నీవెట్లు కైకొనఁగలవు? ఈ నేను నాది, నీవు నీదిలోనే అంతయును బేడబెల్లము కాఁ గలదు. అజ్ఞుఁడు విచారింపకయే మహాపురుషులను దిరస్కరించి యవమానమును గావించుచుండును. ఐశ్వర్య మదమత్తతలో సర్వమును మఱచి అనరాని మాటల ననుచుండును, చేయరాని పనులను జేయుచుండును. కాని మహాపురుషులు తమ స్వాభా విక దయాళుత్వముచే వారినిఁ గృపచూచుచుందురు. వారి యపరాధములను సదా క్షమించుచుందురు. ఆ దుఃఖమును దైవాధీనమని భావించి వారికెన్నటికిని అహితమును గావింపరు."

శివుఁడిట్లనెను:-"స్వామీ! నేనేమియు ననలేదు. ఇప్పుడు నీవేది యాజ్ఞాపించిన దానినిఁ జేయుటకు సిద్ధముగ నున్నాను."

శీఘ్రముగ బ్రహ్మ యిట్లనెను:- "ఇప్పుడు నేను నీ కాజ్ఞాపించుచున్నాను. నీవు సర్వజ్ఞుఁడవు. అందఱ హృదయ ములలోని విషయములను దెలిసికొనఁగలవాఁడవు. లోపలను, బయటను నున్న విషయములలో నీకుఁ దెలియనివి లేవు. భగ వంతుని దుష్కరమాయ నీబుద్ధిని స్పర్శింపనైన స్పర్శింపఁజాలదు. నీకును దక్షునకును నెక్కడి పోలిక ? ఆతఁడు మాయామోహిత జీవి. నీవుమాయాపరుఁడైన శివుఁడవు. ఆతఁడు కర్మకాండయే సర్వస్వమనుచున్నాఁడు. నీవు నిత్యజ్ఞాన స్వరూపుఁడవు. ఆతఁడు చేసిన దంతయును జెఱుపే చేసినాఁడు. ఇప్పుడాతని కర్మలను గూర్చి విచారింపవలదు. ఆతని మూర్ఖత్వమువైపునకుఁ జూడక, నీ దీనబంధుత్వమువైపునఁ జూడుము,"

శివుఁడు చేతులు జోడించుకొని యిట్లనెను:- "స్వామీ! నా కేమి యాజ్ఞ ? నా కాదేశింపుము."

బ్రహ్మ యిట్లనెను;- "నీవు మాటిమాటికి నిట్టి శబ్ద ముల నేల ప్రయోగించెదవు ? నేను నీ కెట్లాదేశమొసర్పఁ గలను ? నేను ప్రార్థనే చేయఁగలను. నా ప్రార్థన యేమనఁగాఁ బూర్తికాక నిలిచిపోయిన యీ యజ్ఞము, మీ రుద్రగణముల ద్వారా విధ్వంసము కావింపఁబడిన యీ యజ్ఞమునను, అదెట్టి దైనను గానిండు, ఏదోవిధముగఁ బూర్తి కావలయును."

శివుఁ డిట్లనెను:- "స్వామీ ! నేను దానికి కాదనను. నీవు సర్వస్వామివి. సమాప్తము చేయించుము. నేను చేయ వలసిన దేదియో దానిని నాకుఁజెప్పుము. నీవు పూర్ణముచేయఁ దలఁచినది మధ్యలో నపూర్ణముగ నెట్లుండఁగలదు ?"

బ్రహ్మ యిట్లనెను:- "నేను చేయించుటచే నిది పూర్తి కాదు. దీనినిఁ జెడఁగొట్టినది నీవు నీవే దానినిఁ బూర్తి చేయఁ గలవు. ఇది నీ మూలముననే జరుగవలసియున్నది."

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! శివుని యొక్కయు, బ్రహ్మ యొక్కయు నీ స్నేహాభరితమైన వాక్కులను వినఁగానే అందఱకును సంతోషము కలిగెను. శివుఁడు తమ యపరాధములను క్షమించినాఁడని అందఱును గ్రహించిరి. ఈ అసంపూర్ణ యజ్ఞము మరల పూర్తి కాఁగలదా? ఈ దేవతల కసంభవమేమియును లేదు. వీరేది చేయఁదలఁచిన దానినిఁ జేయఁగలరు. ఇట్లాలోచించి వారు పరిణామమునకుఁ బ్రతీక్షించుచు నుత్సాహముతో నేమి జరుగునో చూడ మను కొనుచుండిరి.



# శివుఁడు దక్షయజ్ఞము పూర్తియగునని ఆశీర్వదించుట.

[౨౦౯]

శ్లో॥ నాఘం ప్రజేశ బాలానాం వర్ణయే నాన చింతయే।
దేవమాయాభి భూతానాం దండ స్తత్ర ధృతో మయా॥
—శ్రీభాగ ౪ స్కం. ౭ అ. ౨ శ్లో.

---

మహాపురుషుల నవమానించుటచే సమస్త సద్గుణములును నశించును. మహాపురుషులు అపరాధులను క్షమించిన క్షమింపవచ్చును; కాని ప్రకృతి వారిని దండింపక వదలదు. అందువలన నపరాధము లన్నిటికంటె మహాపురుషుల నవమానించుట గొప్ప యపరాధముగ నెన్నఁబడినది. క్షమింపఁబడినను ఆతఁడు జగమందు మరల పూర్వమంతటి యుత్కర్షను బొందఁజాలఁడు. ఏదో చిహ్నము మిగులును. కావునఁ జేతనైనంత వఱకు మహాపురుషుల కవమాన మొనర్పరాదు. ఒకవేళ పొరపాటున నట్లు జరిగినచో సర్వాత్మభావముచే వారిని శరణు వేఁడవలెను.

మైత్రేయముని యిట్లనెను:- "విదురా! శివునిలో సౌమ్యస్వరూపమును ఆతని వ్యవహారములో మృదుత్వమును, మంజులతను గాంచుటచే బ్రహ్మకు స్పష్టముగఁ బలుకుటకు సాహసము కలిగెను. ఆతఁ డిట్లనెను:- "అయినదేమో అయినది. దానినిఁ బోనిండు. ఇప్పుడు జరుగవలసిన విషయమును గూర్చి మాటలాడవలెను. వీరు మూర్ఖతలోఁగల పరాకాష్ఠ నంతను జూపించిరి. యజ్ఞమున కేకైకాధీశ్వరుఁడవు, నీ కృప

చేతనే యజ్ఞయాగాదులు పూర్ణములగును. అట్టి నీకు యజ్ఞ భాగమీయకుండుట ఎంతటి గొప్ప అజ్ఞతయో చెప్పుఁడు."

శివుఁ డిట్లనెను:- "అయితే యిప్పుడు నీవే ఉపాయమును జెప్పుఁడు. యజమాని మరణించినాఁడు. యజ్ఞము పూర్తి యెవరు చేయుదురు ?"

బ్రహ్మ యిట్లనెను:- "చంపు వాఁడవును, బ్రతికించు వాఁడవును నీవే. నీవు తలఁచుకొనిన జంపనుగలవు, చచ్చిన వానినిఁ బ్రదికించనుగలవు. నా ప్రార్థన మేమనఁగాఁ జచ్చిన దక్షుని బ్రదికింపవలయును. నీ పార్షదులు భగదేవతల కన్నులను బెఱకిరి. వారికి కన్నుల నీయవలయును. ఈ భృగుమహామునికి మీసములు గడ్డములు లేకుండుట వలనఁ బేడిగా నుండుటచే బాగుండ లేదు. నీ గణము లాతనికి ఘోరమగు నన్యాయమును గావించినారు. అసహ్యముగా నీతని గడ్డమును మీసములను బెఱకివేసిరి. ఈతని గడ్డములకును మీసములకును మరల నేదైన నేర్పాటు కావింపవలయును."

శివుఁ డిట్లనెను:- "అది యింటిలోని పంట. కావలసిన మరల వచ్చును."

బ్రహ్మ యిట్లనెను:- "గడ్డము మరల పెరుగుననుట నిజమే. గొఱిగిన గడ్డమైనఁ బెరుగును; కాని ఉద్ధతులగు నీ పార్షదులు కుమ్మలతోఁ బెఱకివైచిరి. కొంచెముగఁ గుదురున్నచో మరలఁ బెరుగును గాని మూలమే ఛిన్నభిన్నమగుచో మరల శాఖలెట్లు పెరుగును ? ఇప్పుడిఁకఁ బెరుగు నాశ లేదు. ఇంకేదైన నుపాయమును జూడవలసియున్నది. పూషుని నోరు

బోసినోరైనది. యజమానుఁ డొసఁగిన యజ్ఞభాగమును నమలఁజాలఁడు. ఇఁక శనగల విషయమునఁ జెప్పనేల? మెత్తని వస్తువులనైనఁ దినఁజాలఁడు. కావున నీతని కేదైన నేర్పాటు గావింపవలయును. వీరుగాక కొందఱు దేవతలు, ఋషులకు కత్తిదెబ్బలచే సంగములు తెగిపోయినవి; కొందఱకు రాళ్ల దెబ్బలు తగిలి తలలు పగిలినవి. కొందఱకు కీళ్లుతొలఁగినవి, కొందఱ కంగములు వేఱొక అంగములతో నంటుకొని పోయి నవి. వీరందఱ అంగములు పూర్వమువలె నుండవలయును.''

శివ్వుఁడు నవ్వుచు నిట్లనెను:- "స్వామీ ! ఇవన్నియును జరుగునుగాని మా భాగముచింతకూడ కలదు. మా భాగము లేకయే యజ్ఞము పూర్ణమగునా యేమి ?''

బ్రహ్మ వెంటనే యిట్లనెను:- "అట్లేల జరుగఁగలదు? మీకు భాగములేక యజ్ఞమెట్లు జరుగఁగలదు ? నేఁటినుండి యజ్ఞములలో మిగిలినదంతయును రుద్రభాగముగ నెంచఁబడుఁ గాక ! మిగిలినదంతయును నీ భాగమే. నీ భాగముచేతనే యీ యజ్ఞమంతయును బూర్ణము కాఁగలదు." ఇట్లు బలికి బ్రహ్మ సమస్తదేవతల నిట్లడిగెను:- "ఇది మీ కందఱ కంగీకారమేనా? అంగీకారమైనచో మీరందఱును జేతులెత్తుఁడు'' ఇది విని దేవతలందఱును జేతులనెత్తిరి; కాని చేతులు లేని వారేమి యెత్తఁగలరు ? వారేమి యెత్తఁగలరు. వారు చేతులనెత్తలేదు. శివుఁ డిట్లనెను:- "మంచిది, చేతులెత్తనివారు దీనిఫలము ననుభ వింపఁగలరు. అందఱేకైక స్వరమున 'మాకందఱ కిష్టమే' అని పలికిరి.

ఇది విని నవ్వుచు శివుఁడిట్లనెను:- "మాకు నేఁటినుండి మిగిలినది, యెండినది, యెంగిలిది ఒసంగెదరా యేమి ?"

నవ్వుచు బ్రహ్మ యిట్లనెను:- "స్వామీ ! ఎంగిలి యే మున్నది ? మిగిలిన వస్తువులు గృహస్వామివే కదా ! నీవు యజ్ఞమునకు స్వామివి. అందువలన మిగిలిన వస్తువులమీఁద మీకు స్వాభావికముగ నధికారము కలదు."

శివుఁడు బోళాశంకరుఁడే కదా ! ఇది వినఁగానే ప్రసన్నుఁడై యిట్లనెను:- "మంచిది. అట్లే కానిమ్ము."

అంత సంతోషస్వరమున బ్రహ్మ యిట్లనెను:- "ఇంకొక విషయమున్నది. ఇప్పుడు నీవీ విషయములను గూర్చి విచారింప కుఁడు. నేఁటినుండి నిండుసభలలో నీపురాణవిషయములనుగూర్చి చెప్పి దేవతలను, ఋషులను, పితరులను సిగ్గుపఱుపఁగూడదు."

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా ! బ్రహ్మ పలికిన నిట్టి దూరదర్శితా ప్రేమభరిత వాక్కులను విని నవ్వుచు శివుఁడిట్లనెను:- "విరించీ! ఈ జీవులందఱును మాయామోహితు లని నేనంతయు నెఱుఁగుదును. తమ స్వభావానుసారముగఁ బ్రకృతివశులై వర్తించుచున్నారు. ఇట్టి మూఢుల వాక్యము లను నేను లక్ష్యపెట్టను. నేను వారినిఁ దలఁపనైనఁ దలఁపను. ఇంక సభాసమారోహములందు వారినిఁగూర్చి ప్రసంగించుట దూరముగ నుంచుము."

అంత నవ్వుచు బ్రహ్మ యిట్లనెను:- "అయితే యింత గందరగోళ మేల చేసితివి? నీ పార్షదులచే యజ్ఞ విధ్వంసన మేల కావించితివి?"

శివుఁడిట్లనెను:- "మీరందఱును నన్నుఁ బశుపతి యను చుందురు. పశుపాలుఁడొక కఱ్ఱను దీసికొని పశువుల వెనుకఁ దిరుగుచుండును. అన్నిపశువు లాతనివే. ఆతని కేపశువునందును ద్వేషముగాని వైరముగాని లేదు. అయినను నేపశువు ఉచ్ఛృంఖలతతోఁ బరుని చేసినను మేసెనా పశుపాలుఁడు రెండు దెబ్బలు బాదును. దానివలన మరల నపరాధము జరుగదు. ఇదే విధముగ నేను సావధానుల నొనర్చుటకై కొంచెముగ మరమ్మతు చేయించితిని."

బ్రహ్మ యిట్లనెను:- "మంచిది, నీవు సర్వసమర్థుఁడవు. చేసినది బాగుగనే యున్నది ఇప్పుడీమాటలను వదలి వేయుము. ముందు జరుగవలసినది చేయుఁడు. అయితే దక్షుని బ్రదికించుట యేమిచేసితివి"?

శివునకుఁ గొంచెము వినోదము తోఁచెను. వినోదకు లలో నాతఁడు ప్రథమశ్రేణికిఁ జెందినవాఁడు. తన నవ్వును లోపలనే గ్రుక్కుకొని యిట్లనెను:- "దక్షుని శిరస్సును నీ యుద్ధతులు కోసి అగ్నిలో వ్రేల్చిరి. ఇప్పుడొక పని చేయుఁడు. మేఁక శిరస్సును గోసి ఆతని మొండెమున కతికించుడు. ఆతఁడు బ్రదికి లేచునప్పటికి మేఁకవలె నఱచుచో నాకది ప్రియముగ నుండును. ఏలననఁగా నఱచినచో నాకానందముగ నుండును."

బ్రహ్మ యిట్లనెను:- "మంచిది స్వామీ! నమస్కారము నీవెట్లు పలికినను నీవాక్కులు సత్యములు కాఁగలవు. మేఁక తలయైనఁ బోనిండు బ్రదికినఁ జాలును. భగదేవతల నేత్రముల గతియేమి? వీరు యజ్ఞములలో వారి భాగముల నెట్లు చూడఁ

గలరు? చేతులతోఁ దడుముకొని యితరుల భాగమును గైకొను నట్లుండరాదు. మరల పోరాటము సంభవించును.

శివుఁడిట్లనెను:- "స్వామీ! వీరి కన్నులు పోయిన వేమో పోయినవి. ఈ మిత్ర దేవతల కన్నులతోఁ జూడఁగలరు. దేవతలు వీరి చేతులను బట్టుకొని యుందురు. ఇద్దరును వారి నేత్రములతోఁ బని జరుపుకొందురు. చెరిసగముగఁ బంచు కొందురు."

బ్రహ్మ నవ్వెను. మంచి జోడు నేర్పఱచితిరి. స్త్రీ పురుషులను గలిపినచో స్త్రీని అర్ధాంగి యందురు; కాని పురుషులకు జోడు కలిపి శివుఁడు క్రొత్తదన మేర్పఱచెను. నవ్వి యిట్లనెను:- "మంచిది, బాగుగనే యున్నది. ఇప్పుడీ పూష దేవతయొక్క దంతముల విషయమేమి?"

శివుఁడు శీఘ్రముగ నిట్లనెను:- "వీరికి దంతములు గింతములతో నవసరమేమున్నది? వీరు నేఁటినుండి విసిరిన పిండి మొదలగు వానినన్నముగఁ దినఁగలరు. యజమానుని దంతములతోఁ బని జరుగఁగలదు."

బ్రహ్మ యిట్లనెను:- "స్వామీ! పిండి యన్నమే యగుచో నిఁక యజమానుని దంతములతోఁ బనియేమున్నది? దానిని వీరు తమ బోసి నోటితోడనే చప్పరించి మ్రింగఁగలరు. మంచిది, నేఁటినుండి వీరు పిష్టభుక్కులైరి. వీరి భాగము విసరఁబడి వేఱుగ నాకులలోఁ బెట్టఁబడును గాక! ఇప్పుడీ అంగ భంగమైన దేవతలకే వ్యవస్థను గావింపఁగలము?"

శివుఁడిట్లనెను:- "వీరందఱును నా యాశీర్వాదముచే మరల యథాప్రకారముగ స్వస్థులుగను, నిరోగులుగను నగుదురుగాక. వీరికేవ్యాధియు నుండఁబోదు; ఏలననఁగా వీరందఱును సంతోషముతో నా యజ్ఞభాగమును సమర్థించిరి."

బ్రహ్మయిట్లనెను:- "భుజములు తెగినవారికే వ్యవస్థను గావింపవలెను."

శివుఁడిట్లనెను:- "ఈ వైద్యరాజులగు నశ్వినీకుమారులు వీరి బాహువులను నదికింపఁగలరు. వీరందఱును వారిచేఁ జేయఁబడిన బాహువులచేఁ బని జరుపుకొందురుగాక!"

బ్రహ్మ యిట్లనెను:- "చేతులు తెగినవా రెట్లు పని చేయఁగలరు?"

శివుఁ డిట్లనెను:- "వారందఱును బూషుని చేతులతోఁ బనిచేయుదురు. ఇప్పుడేదోవిధముగ బనిని నిర్వహింపవలయును. దక్షయజ్ఞము గుర్తుకూడ క్షేమముగ నుండవలయును."

బ్రహ్మ యిట్లనెను:- "మంచిది స్వామీ! పాప మీ భృగువు చాలసేపటినుండి తదేకదృష్టితోఁ జూచుచున్నాఁడు. నా కీతని గడ్డము విషయమే చింతగా నున్నది. దీనికి మీ రేమి వ్యవస్థను గావించెదరు?"

తన నవ్వును లోలోన నాపుకొని శివుఁ డిట్లనెను:— "ఈతనికి మేఁకగడ్డము నతికించుఁడు. పొడుగుముఖమున కది శోభింపఁగలదు. ఇంతకుతప్ప వేఱు ఉపాయము లేదు. ఏలననఁగా నీతని గడ్డమును భూతప్రేత పిశాచములు పెఱికివైచి ఆ సమయముననే అగ్నిలోఁ బడవైచిరి."

బ్రహ్మ యిట్లనెను:- "మీరు సర్వసమర్థులరు స్వామీ! మీ కిష్టమువచ్చినది చేయుఁడు. మీరు దయతో యజ్ఞమునకు దయచేసి విధ్యుక్తముగ దానిని మరలఁ బూర్తి చేయించినఁ జాలును. మీ రెట్టి వ్యవస్థను గావించితిరో అది యథావత్తుగ జరుగుఁగాక !" దేవతలందఱవైపునకుఁ దిరిగి బ్రహ్మ యిట్లనెను:- "దేవతలారా ! ఇదంతయును మీ కంగీకారమేనా ?"

అందఱు నేకస్వరమున నిట్లనిరి:- "సాధు ! సాధు !! బాగున్నది. చాల బాగున్నది. దక్షయజ్ఞ పునరుద్ధారము కావలయును."

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా ! ఈ విధముగ వ్యవస్థను గావించి బ్రహ్మ శివునితో నిట్లనెను:- "విరించీ ! నీవును నిప్పుడు యజ్ఞమునకు రావలసియుండును. మీ తత్త్వావధానమున నిప్పుడు యజ్ఞము జరుగఁగలదు."

బ్రహ్మయొక్క యీ మాటను సదాశివుఁడును, బోళా శంకరుఁడు నగు భవుఁ డంగీకరించినమీఁదట వా రందఱును యజ్ఞమునకుఁ బోవుట కుద్యుక్తులైరి."

—♦—

# దక్షయజ్ఞ పునరోద్ధారము

## (౨౧౦)

శ్లో॥ తతో మీఢ్వాంస మామంత్ర్య సునా సీరాః సహర్షిభిః ।
భూయ స్తద్దేవ యజనం సమీఢ్వ ద్వేధసో యయుః॥

— శ్రీభాగ. ౪ స్కం. ౭ అ. ౭ శ్లో.

వ॥.........అంత నా శంభుని యామంత్రణంబు వడసి సునా సీర ప్రముఖులగు దేవతలు ఋషులతోడం గూడి రా నజుం డును రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వరవాటంబునకుం జనియె.

— శ్రీమదాంధ్రభాగవతము.

---

అహంకార మణఁగునంతవఱ కది హృదయమున నిలిచి యుండును. ఏదో కారణముచేతఁగాని, దైవీప్రకోపముచేఁగాని ఆ యైశ్వర్యము నశింపఁగానే వానికి బుద్ధివచ్చును. అయ్యో! నేనహంకారమునకు వశీభూతుఁడనై యెట్టి కుకర్మ లొనర్చితిని, సజ్జనులయెడల ననరానిమాట లంటినిగదా! హృదయమునఁ బశ్చాత్తాపము కలుగుచో నప్పు డంతఃకరణములోని మలము రాలిపోవును. పశ్చాత్తాపము మలహారమగు పదార్థము. అది వెంటనే మలినహృదయమును గడిగివైచి స్వచ్ఛముగ నొనరించును. కాని అది కపటమైనదిగాక ఆంతరికమైనదై యుండ వలయును. సాధారణముగ లోకములోఁ జాలమంది ధనికులై యుండఁగా నెవరును వారికిఁ గనఁబడరు. వారు ధనమదముచేఁ బూజనీయులగువారినిఁగూడ నవమానించెదరు. వారికా యైశ్వర్యము నశించిపోఁగానే అడుగడుగునకు దెబ్బలే తగులుచుం

డును. అప్పటి కాతని బుద్ధి క్రోవకు వచ్చెను. దక్షునకు యజ్ఞవిధ్వంసనము కాఁగానే వానికి బుద్ధివచ్చెను. ఇప్పు డాతనికి వృషభధ్వజుని మహాత్మ్యము తెలిసెను. ఇప్పుడాతని కీతని ఈశ్వరత్వము తెలిసెను. జీవుఁడు మాయామోహితుఁడై యెన్నెన్నో అనర్థము లొనర్చుచుండును; శివుఁడు సర్వులకును మాత, పిత, సర్వస్వముఁనునై యున్నాఁడు. ఆతఁడు కరుణాసాగరుఁడు. అందఱను క్షమించును. ఆతఁడు క్షమింపకున్న జీవుఁ డెచ్చటికి బోఁగలఁడు? వారి కెన్నటికిని నుద్ధారము జరుగదు. ఏమియు నెఱుఁగని బాలుని యపరాధములవైపు తల్లి చూచుచో నా బాలుఁ డొక్కదినమైన జీవింపఁజాలఁడు. తల్లి వడిలో మల మూత్రత్యాగ మొనరించును, నిద్రించునపుడు పక్కంతయును దడుపును. కాలితోఁ దన్నును. ఏడ్చును, మొత్తుకొనును, కోపమును జెందును. హారము గావించును. పని చేయనీయఁడు. అయినను దల్లి క్షమించును. ఆతని ముఖమును ముద్దిడుకొనును. చనుబాల నొసంగి వానినిఁ లాలించి పోషించును దయావశమునఁగాదు. తన స్వభావవశమున నిట్లుచేయుటలో నామెకు సుఖము కలుగును. శివుఁడును జీవుల యపరాధముల నన్నిటిని సహించును. వానిని భయపెట్టి కుమార్గమునుండి తొలఁగించి సన్మార్గమునకుఁ దెచ్చును. కుపథగామిని సుపథమునఁ బెట్టును. అందుకనియే ఆతఁడు విశ్వనాథుండనఁ బడుచున్నాఁడు.

మైత్రేయ మహాముని యిట్లనెను:– "విదురా! బ్రహ్మాది దేవతలును, ఋషులును, మునులును, పితరులును సతీపతియగు శివుని దక్షయజ్ఞమునకు రమ్మని ప్రార్థింపఁగా ఆతఁడు తన దండకమండులును గైకొని తత్క్షణము వెడలుటకు

కుద్యుక్తుఁడయ్యెను. ఆతని మనస్సులో రాగద్వేషములు లేనే లేవు ఆతఁడు నిశ్చలముగను నిష్కపటముగను నుండెను. బ్రహ్మను వెంటఁబెట్టుకొని అందఱును ముందునడచిరి.''

ఈ విధముగ విదురా! సమస్త దేవతలును, విప్రులను గూడుకొని బ్రహ్మయును, మహేశ్వరుఁడును గనఖలమందు దక్షుని నాశనమైన యజ్ఞమునకు వచ్చెను. యజ్ఞమంటపము తగులఁడి యుండెను. పాత్రలటునిటు విఱిగి పడియుండెను. వేదులు పెఱికివేయఁబడి యుండెను. తగులఁబడి నల్లనల్లగ నుండెను. విఱిగిన చెట్టువలె దక్షుని మొండెము పడియుండెను. సేవకు లటునిటు నన్యమనస్కులై రక్షించుచుండిరి. స్త్రీ లేడ్చుచుండిరి. యజ్ఞభూమి స్మశానమువలెఁ గనఁబడుచుండెను. శివునాజ్ఞచే నచ్చటి మలమంతయును వెంటనే తొలఁగింపఁ బడెను. వేలకొలఁది మానవులు పనిలో నియమింపఁబడిరి. యజ్ఞభూమి మరల చిమ్మి, మెత్తి, అలుకఁబడెను. క్రొత్త మండపములు సిద్ధమయ్యెను. క్రొత్త సామగ్రి తెప్పింపఁబడెను. శివుఁడు రాఁగానే అచ్చట బ్రాహ్మశ్రీ విలసిల్లెను. అష్టసిద్ధులు, నవనిధులు వచ్చి అచ్చట పనిచేయుచుండెను. సామగ్రు లన్నియును శ్రద్ధతోఁ గూర్పంబడుచుండెను. బ్రాహ్మణులలో మరల వెనుకటివలె నుత్సాహము వ్యాపించెను. నలువైపులను నుత్సవముగ నుండెను. సామగ్రి అంతయును బ్రోగై, నలువైపులను గసవు వ్యగ్రాలు తొలఁగింపఁబడఁగానే వేదజ్ఞులగు బ్రాహ్మణులు మేఁక శిరస్సును దైకొని దక్షుని మొండెమున కంటించిరి. శివుఁడు చూడఁగానే నిద్రించినవాఁడు లేచినట్లు దక్షుఁడు లేచెను. నలువైపులను దృష్టిని సారించి చూడఁగానే దక్షుఁడు

తనయెదుట సౌమ్యమూర్తియగు శివుఁడు కనఁబడెను. ఇదివఱ కాతని హృదయము శివద్రోహ రూపమగు మసిచేఁ గలుషిత మయ్యెను. ఇప్పుడు శివుని సంజీవని రూపమగు దృష్టిచే నాతని పాపము లన్నియును గడిగివేయఁబడెను. పులుసుచే తామ్ర పాత్ర స్వచ్ఛమైనట్లాతనిహృదయముస్వచ్ఛమయ్యెను. ధూళిచేఁ గప్పఁబడిన అద్దము గుడ్డతోఁ దుడుచుటచేతను, మకిలబాఱిన సీసా సున్నముచే రుద్దిన మెఱయునట్లును, మలినవస్త్రము మంచిసబ్బుచే నుదుకుటచే నుజ్జ్వలమైనట్లును, త్రుప్పుపట్టిన శస్త్రము ఇసుకచేఁ గ్రొత్తదైనట్లును, శరదృతువు రాఁగానే నదీజలములు నిర్మలములైనట్లును, కుంకుడు నురుగుచే నున్ని వస్త్రము స్వచ్ఛమైనట్లయ్యెను.

హృదయము నిర్మలమగుటచే దక్షునకు శివుని స్తుతింప బుద్ధికలిగెను. 'సతీపతి' యను నీ శబ్ద ముచ్చరించఁగనే ఆతనికిఁ దన ప్రియపుత్రిక స్మరణమునకు వచ్చెను. ఆమె స్మరణమునకు రాఁగానే ఆతని కంఠము రుద్ధమయ్యెను, కన్నుల నీరు నిండెను. శరీరము రోమాంచమయ్యెను. ప్రయత్న మొనర్చినను నాతఁ డేమియును బలుకఁజాలకపోయెను. ఒక్కశబ్దమునైన నుచ్చ రింపఁజాలకుండెను.

ఆతని యీ ప్రేమదశను గాంచి దయాసాగరుఁడగు శివుఁ డాతనిపై దయాదృష్టినిఁ బఱపెను. కృపతో నాతనివైపు నకుఁ జూచెను. శివకృపను బొంది ప్రేమవిహ్వలుఁడై దక్షుఁడేదో విధముగ దన్ను సంబాళించుకొని కపటరహితుఁడై సరళముగ సదాశివుని స్తుతింప నుద్యుక్తుఁడయ్యెను.

దక్షుఁడిట్లనెను:- "ప్రభూ! నాయొక్క యింతటి గురుతర యపరాధమును నింతటి సరళముగా, శీఘ్రముగ క్షమింపఁగలవను నాశ నాకు లేదు. మీరు నా యపరాధమునకు దండన మొసంగి నాకు మేలే చేసితిరి. నా పాపమును నాశము కావించితిరి. నా మనోమలినమును గడిగివైచితిరి. ఇది నీ కేమంత విచిత్రమగు విషయము కాదు. నీ బిరుదమే యిది. శ్రీహరియును, మీరును అధమ నీచ నామమాత్ర బ్రాహ్మణులనైనను నుపేక్షింపరు. నేను నేదోవిధముగఁ బ్రేమతోడనో ద్వేషముతోడనో మిమ్ముల నారాధించుచునే యున్నాను."

శివుఁడు నవ్వి యిట్లనెను:- "మామగారూ! నాయాజ్ఞ వలన వచ్చిన నా పార్షదులు మీయెడలఁ జాల యనుచితకార్య మొనరించిరి. మీకీయవలసిన దండనముకంటె నెక్కువగ దండన నొసంగిరి."

దక్షుఁ డిట్లనెను:- "కాదు స్వామీ! జరిగినదేదో నామేలుకొఱకే జరిగినది. దీనివలన నాకు లాభమే కలిగినది. నా మలినాంతఃకరణము పవిత్రమైనది. మీరు దండనమును ద్వేషవశమునఁ జేయరు. మీరందఱకును జనకులు, రక్షకులు. మీరే విద్యా, తప, వ్రతధారణ మొనర్చు బ్రాహ్మణులను, వేదములను, ఆత్మతత్త్వ రక్షణము కొఱకు ఇదివఱకు పుట్టించితిరి. మీరు దండమును గైకొని గొల్లఁడు పశువులను రక్షించినట్లు రక్షించుచుందురు. కోటికల్పములు నరకములో ననుభవించినను నాకుద్ధారముకాని యపరాధమును నేను జేసితిని; కాని మీరు మీ యహైతుక కృపచే నన్నా యపరా

ధమునుండి సహజముగనే వదలించితిరి. నాదుస్సహ యప
ధములను గూడ శాంతితో సహించితిరి. ప్రజాపతుల యజ్ఞవ
నందు నేననరాని వాక్యములను నిన్నంటిని; కాని మీరు మి
యుదారతావశముచే నాయపరాధముల నుపేక్షించితిరి. వా
వైపు మీరు చూడనైనఁ జూడలేదు. కావున నో వరదా
కరుణాసాగరా! దీనవత్సలా! మీరు నా కృత్యముల వైపు
ధ్యానముంచక, మీ స్వాభావిక సహజ కృపాకారణమున నా
ప్రసన్నులు కావలయును. నన్ను రక్షింపవలెను. నన్ను ఘో
నరకాదులనుండి రక్షింపుము."

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! ఈ వి
ముగ శుద్ధ చిత్తముతో, అత్యంత వినయభావముతో దక్షుఁ
భువనేశ్వరుఁడగు శంభుని ప్రార్థింపఁగా నాతఁడు దక్షునియెడ
దన యానందమును ప్రకటించెను. శివుని ప్రసన్నతను బొం
యిప్పుడు దక్షప్రజాపతి అసంపూర్తియైన యజ్ఞమును బూర్తి
కావింప నుపక్రమించెను."

# దక్షయజ్ఞమున విష్ణువు ప్రత్యక్షమగుట.

(౨౧౧)

శ్లో॥ అధ్వర్యుణాత్త హవిషా యజమానో విశాంపతే।
ధియా విశుద్ధయా దధ్యౌ తథా ప్రాదురభూద్ధరిః॥
తదా స్వప్రభయా తేషాం ద్యోతయన్త్యా దిశో దశ।
ముష్ణంస్తేజ ఉపానీత స్తార్క్ష్యేణ స్తోత్రవాజినా॥

— శ్రీభాగ. ౪ స్కం. ౭ అ. ౧౮, ౧౯ శ్లో.

సీ. మానిత శ్యామాయ మానశరీర
దీధితులు నల్దిక్కుల దీటుకొనఁగఁ
గాంచన మేఖలా కాంతులతోడఁ
గౌశేయచేలద్యుతుల్ సెలిమిసేయ
లక్ష్మీసమాయుక్త లలితవక్షంబున
వైజయంతీప్రభల్ వన్నెసూప
హాటకరత్న కిరీట కోటిప్రభల్
బాలార్కరుచులతో మేలమాడ

గీ॥ లలిత నీలాభ్రరుచిఁ గుంతలములు దనరఁ
బ్రవిమలాత్మీయ దేహజ ప్రభ సరోజ
భవ భవామర ముఖ్యుల ప్రభలు మాప
నఖిలలోకైకగురుఁడు నారాయణుండు॥

— శ్రీమదాంధ్రభాగవతము.

బ్రహ్మ విష్ణు మహేశ్వరు లొక్కటే. వీరి ముగ్గురిని భేదదృష్టితోఁ జూచువాఁడు నరకమున కధికారియగును. ఒక కొకఁడు వ్యాపార మొనర్చిన వ్యాపారియందుము. యాత్ర

చేయునపు డాతనిని యాత్రికుఁడని పిలిచెదము. పెండ్లి చేసి కొనునప్పు డాతనినిఁ బెండ్లికొడు కందుము. మంత్రము నొసంగిన మంత్రి యందుము, న్యాయ మొనర్పఁదలంచిన న్యాయాధీశుఁ డందుము. అందఱాతనిని సన్మానించెదరు. ఏదైన సభకు సభాపతి యగుచో వక్తలందఱును సభాపతియని పలికి ఆతనిని సంబోధించెదరు. వ్యక్తి యొక్కఁడే. కార్యానుసారముగ వానికి పేరు మారుచుండును. అదేవిధముగ శ్రీహరి సృష్టించునప్పుడు బ్రహ్మయనియు, పాలించునపుడు విష్ణువనియు, సంహార సమయమున రుద్రుఁడనియు బిలువఁబడును. భేదభావ మొనర్చి యీ త్రిమూర్తులలో భేదము నెంచుచో వారికి దక్షుని గతిపట్టును. అయినను భగవంతుఁడు తన భక్తుని పరాభవమును జూడఁజాలఁడు. భక్తుఁడు పొరపాటుపడెనా ఆతని నేదోవిధమున దండనము నొసంగి సత్పథమునకుఁ దీసికొనివచ్చును."

మైత్రేయ మహాముని యిట్లనెను:– "విదురా! దక్షుని యజ్ఞమును భూతప్రేత పిశాచాది రుద్రగణములు విధ్వంసము కావింపలేదు కాని మలమూత్ర త్యాగ మొనర్చి దానిని భ్రష్టము కావించిరి. అందువలన మునుముందుగా నాయజ్ఞశుద్ధి యావశ్యకమై యుండెను. చిమ్మి, తుడిచి, మార్జనోపలేపాదులచే బ్రాహ్మణులు సర్వప్రథమమున మంత్రములచే శుద్ధికావించి ఉపాధ్యాయ, ఋత్విక్సదస్య హోతాదులందఱును గలిసి అగ్న్యాధాన మొనర్చి యజ్ఞకార్యము నారంభించిరి. భూతప్రేత సంసర్గ శుద్ధికొఱకు విష్ణుసంబంధమగు త్రికపాల పురోడాశముల శుద్ధచిత్తముతో ననేకులగు వేదజ్ఞులగు బ్రాహ్మణులఁ గూడుకొని దక్షప్రజాపతి అర్పించెను. అగ్ని యందు శ్రీవిష్ణునిమిత్తమై

హావిస్సు సర్పణము కావింపఁగనే యజ్ఞరూపుఁడగు జనార్ద నుండా సమయమునఁ బ్రత్యక్షమయ్యెను.

నేఁడు భగవంతుని తేజస్సు అత్యంత దర్శనీయముగ నుండెను. సాధారణు లాతేజస్సును సహింపఁజాలకుండిరి. భగవంతుఁడు ప్రత్యక్షము కాఁగానే దశదిశలును దేదీప్యమానములయ్యెను. భగవానుని వస్త్రాభూషణాదుల కాంతిచే నందఱ కన్నులు మిఱుమిట్లు గొలిపెను. అందఱును నాతని మహాతేజస్సు ముందు హతప్రభులైరి. ఎవ్వరును నాతనివైపు చూడఁజాల నంతటి తేజస్సు భగవంతుని తేజస్సు. ఎగురుచున్నప్పు డెల్లప్పుడును సామవేదగానము వెలువడు వినతానందనుఁడగు గరుడుని వీపుపై విరాజిల్లుచుండెను. పక్షులలో శ్రేష్ఠుఁడైనవాఁడును, పక్షములున్న ఖగములకు రాజైనవాఁడును, యుద్ధమొనర్చి విష్ణువును సంతోష పరచినవాఁడును, తన పరాక్రమముచే నింద్రాది దేవతలతో యుద్ధమొనర్చి బలపూర్వకముగ స్వర్గము నుండి అమృతమును దెచ్చినవాఁడును నగు గరుడునిపై కెక్కి-బూన్పఁబడిన మణిజటిత సింహాసనముమీఁద శ్రీహరి విరాజ మానుఁడై యుండెను. సింహాసనమునఁ గూర్పఁబడిన నమూల్య మణి మాణిక్యము లాకాశమం దసంఖ్యాక సూర్యచంద్రులవలె మెఱయుచుండెను. ఱెక్కలను జాపుకొనుచు గరుడుఁడు వంకరగాఁ దన యానకళను జూపించుచు దిగుచుండెను. అందఱును జూచుచుండఁగనే ఇంతవఱకును శివబ్రహ్మలు కూర్చుండిన చోటునకువచ్చి విరాజిల్లెను. అందఱును వెంటనే లేచి శ్రీహరికి స్థానము నొసంగిరి. ఆసమయమున భగవానునిశోభ అవర్ణనీయముగ నుండెను. శేషశారదులైనను నాశోభను వర్ణింపఁజాలరు.

భగవంతుని శ్రీయంగము నవజలధరమువలెను, వర్షకాల మందలి పచ్చని గరికవలెను, మయూర కంఠమువలెను, అతసీ పుష్పమువలెను, శరత్కాలమునఁ గాళిందీ జలములవలెను శ్యామవర్ణముగ నుండెను. నవజలధల రూపమగు ప్రియతముని చపల, చంచలయగు విద్యుద్రూపమగు నాయిక ఆలింగనము చేసికొనినట్లు పీతాంబరముండెను. పీతాంబరముపైన సువర్ణ మయమగు మొలత్రాడు పీతవస్త్రముచేఁగప్పఁబడిన శ్రీహస్తము లక్ష్మీదేవియొక్క కటిప్రదేశశోభ నినుమడించుచున్నట్లుండెను. నానారత్న మండితమగు సుమేరు పర్వత సుందరశిఖరము తన కాంతులను వెదజల్లుచు మిసుమిట్లు కొలుపుచున్నట్లు నానా రత్నములచే విభూషితమగు నాతని మణిమయ మకుటము మెఱయుచుండెను. ఆతని విశ్వవిమోహకమును భక్త సర్వస్వ మును, వ్రజ వధూటీమణుల హృదయములందు గామసంతా పము నుత్పన్నము కావించు శరత్కాల కమలమువలె విక సించిన శ్రీముఖము హిమాలయశిఖరమునగల స్వచ్ఛమగు పుష్కరిణియందొక సహస్రదళకమలము వికసించినట్లుండెను. దానిపైన వ్రేలాడుచున్న నల్లని, తెల్లని, ముద్దులమూటగట్టు కుచ్చులు కమలకోశమున భ్రమరపంక్తులు తమఱెక్కలను జాచుకొని మూగినట్లుండెను. చంద్రుని కిరుప్రక్కలను బునర్వసు నక్షత్రము శోభించుచున్నట్లు ఆతని కమనీయ కర్ణములకుఁ గుండలములు శోభించుచుండెను. నేఁడు భగవానుఁడు ద్విభుజ రూపమునగాని చతుర్భుజ రూపమునఁగాని ప్రకటము కాలేదు. అష్టభుజరూపమునఁ బ్రకటమయ్యెను. ఆ యష్టభుజములందును శంఖ, చక్ర, గదా, పద్మ, ధనుర్బాణ, ఖడ్గములను, డాలును

ధరించెను. పర్వతశిఖరమున నెనమిది పుష్పించిన వృక్షములు శోభించుచున్నట్లా యష్టభుజములును శోభించు చుండెను. బాగుగాఁ బుష్పించిన గన్నేరుచెట్టువలె నాతఁడాయుధములతో శోభించుచుండెను. హృదయమున శ్రీవత్సలాంఛన మున్నది. దానిపై లక్ష్మీదేవి తన చంచలతను ప్రదర్శించుచుఁ గులుకుచు నాతని ముఖమును దదేకదృష్టితోఁ జూచుచుండెను. ఆకాశమున నొక్కసారిగా రెండింద్ర ధనుస్సు లేర్పడినట్లాతని నీల కళేబరమున వనమాల శోభించుచుండెను. భగవానుఁడు నవ్వుచుండెను. ఏల నవ్వుచున్నాఁడు ? నవ్వుటేమి ? తన శోభచేతను, కటాక్షము చేతను విశ్వవిమోహనము కావించుచున్నాఁడు. అందఱను సంతోషపెట్టుచున్నాఁడు. మైమఱపించుచున్నాఁడు. ఆతని యుదార మందహాసము జగత్తు నానందింపఁ జేయుచున్నది. మణిమయమగు నుచ్చశిఖర సమీపమున లఘుశిఖరములపై ఱెక్కలను విప్పుకొని రాజహంస లెగురుచున్నట్లాతని చుట్టును నంద సునందాది పార్షదగణము శోభించుచుండిరి. శరత్కాలీనమగు స్వచ్ఛాకాశమునఁ బూర్ణచంద్రుఁడు వెలుఁగుచున్నట్లాతని శిరస్సున శ్వేతఛత్రము శోభిల్లుచుండెను. నలువైపులను ప్రేలాడఁగట్టిన జాలరుల చివరనున్న పెద్ద మణిపూసలు నక్షత్రములవలె గదలుచుండెను. ఆతని రెండు పాదములందు శోభించుచున్న నఖద్యుతులు దశదిశల సంతాపమును బోఁగొట్టుటకు పదిచంద్రు లొక్కసారిగా రెండు నీల కమలములనుండి ఉదయించుచున్నట్లుండెను.

భగవానుఁడింత శీఘ్రముగఁ బ్రకటము కాఁగలఁడని యెవ్వరు ననుకొనలేదు. వెంటనే జరిగిన భగవదావిర్భావముచే

నందఱును విస్మితులైరి. అందఱును గలవరపడి ఆతని రూప
లావణ్యమును గాంచుచు గాంచుచు నిలిచిపోయిరి. వారు
స్తుతింపఁదలఁచిరి కాని కంఠము గద్గదికమగుటచే స్తుతిచేయఁ
జాలక పోయిరి. అందఱును గింకర్తవ్యతా విమూఢులైరి. ఇప్పు
డేమి చేయవలయునో వారికి తోఁచకుండెను. ఎట్లు స్తుతింప
వలెనో తెలియకుండెను.

కొంచెముసేపటికి ధైర్యము వహించి, తమ్ముఁదాము
సంబాళించుకొని దక్షప్రజాపతి లేచెను. ఆతఁడు మరలఁ బ్రభు
పాదపద్మములకుఁ బ్రణామమును గావించి, గద్గద వాక్కులతో
నశ్రువులను రాల్చుచు స్తుతించుట కుద్యుక్తుఁడయ్యెను. ఆతఁ
డాగి యాగి యిట్లనెను:- "విభూ! నీవు వికారరహితుఁడవు.
మాయాతీతుఁడవు. సృష్ట్యాది సమస్తకార్యములం దుదాసీనుఁ
డవు; నిరంజనుఁడవు, నిరాకారుఁడవు. అయినను ఖేలనమునకై,
లీలలొనర్చుటకై వినోదవశమున జీవులవలె వర్తించుచుందువు."

దక్షుఁడు స్తుతించుటను గాంచఁగానే అందఱకును సాహ
సము కలిగెను. యజ్ఞములోని ఋత్విక్కు లందఱును జేతు
లను జోడించుకొని భగవంతుని సమ్ముఖమునకువచ్చి, వినయ
వాక్కులతో శిరస్సులనువంచి యిట్లనిరి:- "ప్రభూ! నీవు సాకా
రుఁడవో నిరాకారుఁడవో మాకుఁ దెలియదు. ఉపనిషత్తులలో
నీ తత్త్వము నిరూపింపఁబడినది; కాని మీరందఱును దత్త్వ
జ్ఞాన విహీనులై కర్మకాండయందే పడియుండుఁడని ప్రజాపతి
సత్రయాగమున శివుని ప్రధాన పార్షదుఁడగు నందీశ్వరుఁడు
మమ్ములను శపించియుండెను. కావున స్వామీ! మే మెల్లప్పు
డును దీనిలోనే పడియుండెదము. ఈ మంత్రమునకు ఋషి,

దేవత, వినియోగము, ఛందస్సులేవో వానిని, నే ఛందస్సున కెన్ని యక్షరములైనదియు, స్వరదీర్ఘోచ్చారణము లెట్లు కావింపవలసినదియు, హ్రస్వ, ప్లుతజ్ఞానము గనిని విచారించె దము. మేము యజ్ఞమునే మీ స్వరూపముగ నెంచెదము. యజ్ఞరూపమున నీకు యజన పూజనములను గావించెదము. ఋగ్యజుస్సామాథర్వణములందు మేము మీయీ రూపమును గాంచెదము. సర్వత్ర యజ్ఞరూపముచేతనే మిమ్ము స్తుతించె దము. కావున మేము యజ్ఞస్వరూపుఁడవగు నీకు నమస్కరించు చున్నాము.”

ఋత్విక్కుల స్తుతులను వినుచున్న సదస్యులలోఁ జాల మంది భక్తిమార్గనిష్ఠులును, జ్ఞానమార్గావలంబులును, కర్మిష్ఠు లును గలరు. అందువలన నందఱును గలగాపులగముగ స్తుతిం చిరి. వారందఱిట్లనిరి:- “ప్రభూ! ఈ సంసార మేమున్నది? ఒక గహన వనమార్గము వంటిది. మిట్టపల్లములున్న మార్గమునఁ బ్రయాణమొనర్చిన నత్యంతదుఃఖము కలిగినట్లు, ఈ సంసార రూపమగు మార్గమున నానాక్లేశములు కలుగును. వీని కారణ మతి దుర్గమమైనది. ఇట్టి దట్టమగుమార్గమునఁ బడగనెత్తుకొని విషధరసర్పము కూర్చుండియున్నది. ఆ కాలరూపమగు సర్ప మీ సంసారరూపమగు మార్గమునఁ బగబట్టి కూర్చుండి సమ యము రాఁగానే కాటువేయుటకుఁ గూర్చుండును. ఈ దుర్గమ మార్గమునఁ బెద్దపెద్ద గోతులున్నవి. అవి సుఖదుఃఖములు, రాగద్వేషములు, హర్ష శోకములు, హానిలాభములు, కీర్త్యప కీర్తులు మొదలైన ద్వంద్వములు. ఈ గోతులే భవపథమునఁ గలవు. ఇట్టి మార్గమందు సింహ, శార్దూల, భల్లూకాది హింసక

జంతువులు కూర్చుండియున్నవి. అవి అకారణ నిందకులును, అనవసరముగ ద్వేషించువారును, ఇతరుల యభిప్రాయములకు మండిపడువారును, తన పొరుగువారి యున్నతిని సహింపని వారును, అడుగడుగున కవమానించువారును ఇట్టివారు హింసక జంతువుల వంటివారు. ఇట్టి ఘోరారణ్యమున నొక్కొక్కప్పుడు వెదురులు రాచుకొని దావానలము బయలుదేరును. అది యీ సంసారమార్గమున శోకమను దావాగ్ని సదా మండుచునేయుండును. నిత్యమును గ్రొత్తక్రొత్తక్లేశములును, నిత్యనూతనసంతాపములును హృదయము నహర్నిశలు గాల్చుచుండును. ఇట్టి మార్గమందును ధనలోభులగు వ్యాపారులు తమ ప్రాణములను జేతులలోఁ బెట్టుకొని లాభేచ్ఛచేఁ బోవుచుందురు. వారు కాలమునకు భయపడక లోభవశమున నటునిటుఁ బరువిడు చుందురు. తన యథార్థగృహమును వదలి మారణించుటకు వనములందుఁ దిరుగుచుందురు. స్వామీ! జీవమాత్రునకు గంతవ్యస్థానము మీ చరణారవిందములే. నిరాశ్రితజీవుల కేకైకాశ్రయ మీ యరుణవరణ పదారవిందములే. కామనావశీభూతులగు నీ జీవులును మృగతృష్ణ భ్రమలోఁబడి,యిసుకను నీరని భ్రమించి పరువిడు మృగరూపజంతువులు. పిపాసరూపమగు మమతాభారమును శిరస్సున కెత్తుకొని, మిక్కిలి దుఃఖితులై యెప్పుడు మీ వైపునకు రాఁగలరు? ఎప్పుడు మిమ్ముఁ దమ సర్వస్వముగ భావించెదరు? ఎప్పుడు వీరు తమ యథార్థ గంతవ్యస్థానమును జేరుకొనఁగలరు?"

ఇది విని రుద్రభగవానుఁ డిట్లనెను:– "స్వామీ! నీవు వరదాతలలో శ్రేష్ఠుఁడవు. నేను ప్రపంచమందు నీ చరణార

విందములనే సారాతిసారముగ భావించి సదా వాని నారాధించు చుందును. ఇట్లయ్యును నజ్ఞానులు నన్నాచారభ్రష్టుఁడననియు, అశుచిననియు, నఘోరుఁడననియుఁ బిలుచుచుందురు. నే నేమి చేయుదును. వా రనిన నననిమ్ము. నాకు నీ చరణారవిందధ్యాన రూపమగు మకరందాస్వాదము దొఱకినది. నే నెల్లప్పుడును దానియందే నిమగ్నుఁడనై యుందును. వాగువారిని వాగ నిమ్ము. నేనటుఁ జూడనైనఁ జూడను."

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! శివుఁ డిట్లు స్పష్టముగను యుక్తియుక్తముగను బ్రార్థించుటను వినఁగానే అందఱ హృదయములలోని విషయములను జెప్పుటకు సాహ సము కలిగెను. అంత బ్రహ్మ, భృగువు మొదలైనవారు క్రమముగ స్తుతించుట కుద్యుక్తులైరి."

---

# దక్షయజ్ఞమున నందఱు భగవంతుని స్తుతించుట

## (౨౧౨)

శ్లో॥ స ప్రసీద త్వమస్మాకం మాకాంక్షతామ్
దర్శనం తే పరిభ్రష్ట సత్కర్మణామ్ ।
కీర్త్యమానే నృభిర్నామ్ని యజ్ఞేశ తే
యజ్ఞవిఘ్నాః క్షయం యాంతి తస్మై నమః॥

—శ్రీభాగ. ౪ స్కం. ౭ అ. ౪౭ శ్లో.

వ॥ "...యజ్ఞక్రతురూపకుండవును నైన నీవుపరిభ్రష్టకర్ములమై కాంక్షించు మాకు బ్రసన్నుఁడ వగుము. భవదీయ నామ కీర్తనంబుల సకల యజ్ఞ విఘ్నంబులు నాశంబు నొందు నట్టి నీకు నమస్కరింతుము." — శ్రీమదాంధ్రభాగవతము.

---

ప్రపంచములో భగవత్సాక్షాత్కార మొనర్చినవారే ధన్యులు. శ్యామసుందరుని దివ్యరూపమును గాంచిన నేత్రములే సఫలములు. వరదాతలలో మేటియగు విష్ణుని బిరుదావళులను బొగడిన వాక్కే వాక్కు. భగవత్కైంకర్యములో వినియోగింపఁబడిన యింద్రియములే సార్థకములు. విష్ణు ప్రీతికరమైన వ్యాపారమే వాస్తవమగు వ్యాపారము. కాకున్న సమస్త కార్యములు సంసారబంధనమును గావించెడివే.

మైత్రేయమహాముని యిట్లనెను:— "విదురా! దక్ష యజ్ఞమందు భగవంతుఁడు ప్రకటము కాఁగానే అందఱును దమ తమ బుద్ధ్యానుసారముగ స్తుతి చేయసాగిరి. దక్షుఁడును, ఋత్విజులును, సదస్యులను రుద్రుఁడును స్తుతించిన

తరువాత భృగుమహర్షి నిలుచుండెను. ఆతఁడు చేతులు జోడించుకొని యిట్లనెను:- "ప్రభూ! నేను నిన్ను శరణు వేఁడితిని. మీరు నాపైఁ గృపఁజూడవలయును. మీమాయ అతి గహనమైనది. అందఱియొక్క ఆత్మజ్ఞానము ఈ మాయకు అధీనమగుటచే నశించినది. మానవుల సంగతి అట్లుండుఁడు. అజ్ఞానరూపమగు మాయయందు నిద్రించు బ్రహ్మాది దేవతలును మీ తత్త్వమును యథార్థముగ నెఱుఁగరు."

ఇది వినఁగానే బ్రహ్మకు దప్పుగఁదోఁచెను:- "ఈ భృగువు నా పుత్రుఁడయ్యును నాకు భగవత్తత్త్వము తెలియదని పలుకుచున్నాఁడు." అందువలన నాతఁడిట్లనెను:- "స్వామీ! నేను నీ తత్త్వము నెఱుఁగుదును. ఇంద్రియములకు గోచరించునది యంతయును మాయాప్రసారమే. నీవు మాయిక పదార్థములకు వేఱుగ నున్నావు."

అంత నింద్రుఁడిట్లనెను:- "స్వామీ! మాకిప్పుడీ అష్ట భుజములతోఁ గూడిన రూపము దర్శనమైనది. ఇదియే మాకు సర్వస్వమును. మా నేత్రములు దీనిచే సఫలములైనవి. దీనికిఁ బరముగ నింకేదైన నున్నదనుకొనిన ననుకొననిండు. మాకు దానితో వివాదము లేదు."

వీరందఱును నిట్టి తత్త్వజ్ఞాన విషయములు పలుకఁగా దక్షుఁడు పత్నులతోఁ జేతులను జోడించుకొని యిట్లు వినతులొనర్చెను:- "స్వామీ! ఈ మాటలిట్లే యుండును. నీయథార్థ రూపము నింతవఱ కెవరును నిశ్చయము చేయలేరు. ముందు చేయనులేరు. శ్రుతియును నేతినేతీతి వాక్యములను బలికి

మెదలకున్నది. కావున ప్రభూ! బ్రహ్మ నీపూజనము కొఱకు యజ్ఞమును రచించినాఁడు. ఆ యజ్ఞమును రుద్రపార్షదులు విధ్వంసము కావించిరి. ఓ అరవిందాక్షా! నీవు నీ యమృతమయ దృష్టిచే నీ యజ్ఞమును వీక్షించి దీనిని యథాయోగ్యము కావింపవలయునని మా ప్రార్థనము. మరల దీని నుద్ధరింపుఁడు."

ఋషులును యజమాన పత్నుల మాటల ననుమోదించుచు నిట్లనిరి:- "స్వామీ! నీకి దేమి లెక్క. ఏలక్ష్మినిఁ బ్రపంచములోని వారందఱును గాంక్షించుచుందురో ఆ లక్ష్మి మీ పాదములకడఁబడి దొఱలు చుండును. నీవామె నాదరింప నైన నాదరింపవు. నీదృష్టిలో అష్టసిద్ధులును నవనిధులును నిమిడియున్నవి."

సిద్ధు లిట్లనిరి:- "స్వామీ! మాకు దేనిలో మనస్సు నిమగ్నమై బ్రహ్మానందసుఖము ననుభవించునో అట్టి ధ్యాన రూపమగు నమృతము కావలయును."

అంత దక్ష ప్రజాపతియొక్క ప్రధానపత్ని ప్రసూతి ప్రేమపూర్వకముగ భగవంతునకిట్లు వినతి కావించెను:- "ప్రభూ! మీరు రాకపోవుట చేతనే యీ చిక్కు తటస్థించినది. మీరు మొదటనే యీ యజ్ఞమునకు వచ్చియుండినయెడల యజ్ఞ విధ్వంసనమును గాక యుండెడిది. నా ప్రియపుత్రిక సతీదేవియును మరణింపకుండెడిది. అస్తు. అయిన దేమో అయినది. ఇప్పటికి మీరు వచ్చితిరి. మాకు కొదువ యేమున్నది? మీకు స్వాగతము. మీ యర్ధాంగి యగు లక్ష్మీదేవికిని స్వాగతము. మీరు మీ ప్రియతోఁగూడి మమ్ములను రక్షింపుఁడు. పురు

షోత్తమా! యజ్ఞశోభ మీవలననే, శరీరశోభ శిరస్సువలననే కదా కలుగునది."

బ్రహ్మాదులుకూడ నీతత్త్వమును దెలిసికొనఁజాలరను భృగుని వాక్యము అందఱ హృదయములకును గ్రుచ్చుకొనెను. అందువలన సందఱును దమతమ బుద్ధులననుసరించి భగవత్తత్త్వమును గూర్చి పొగడసాగిరి. లోకపాలు రిట్లనిరి:- "స్వామీ! మీ శుద్ధ స్వరూపమేమో సరిగా మాకుఁ దెలియరాదు. మీరు ఇంద్రియములకు విషయము మాత్రము కారు. పంచభూతములకుఁ బరులు. జీవుఁడును గారు."

ఇట్టి సందేహవాక్యములను విని యోగేశ్వరు లిట్లనిరి:- "విశ్వేశ్వరా! మీరు ఆత్మస్వరూపులుగ హృదయమున విరాజిల్లుచున్నారు. పృథక్భావముతో మిమ్ము దమలోఁ జూచుకొనువారిపైఁ బ్రసన్నులగుచుందురు. మిమ్ము మేమనన్య భక్తితో భజించుచుందుము. స్వామీ! భక్తులమగు మా భీతినిఁ బోఁగొట్టుఁడు. మీరు బ్రహ్మాది రూపములను ధరించినను మీరీ మాయిక గుణములు బొత్తిగా లేనివాఁడవు. ఏమైనఁ గానిండు. మీ చరణారవిందములకు మాప్రణామము."

వేదము లిట్లనెను:- "మహారాజా! మీ యథార్థ రూపము నిర్ణయము కాలేదు. మీరెట్లుండిన నట్టి మీకు మా ప్రణామములు."

అగ్ని యిట్లనెను:- "నీవు యజ్ఞ రక్షకుఁడవు. యజ్ఞము నీస్వరూపమే. కావున యజ్ఞస్వరూపుఁడవగు నీకుఁ బ్రణామము."

దేవతల కెల్లప్పుడును నసురుల భయముండును. వారికి సదా తమ ఇంద్రాసనము గూర్చియు, స్వర్గమును గూర్చిన చింతయే. కావున వారిట్లనిరి:- "స్వామీ! నీవందఱను రక్షించుచుందువు. ప్రళయమందును జగత్తును నుదరమున నుంచుకొని దానిని రక్షించుచు నిద్రించెదవు. యోగిజనులు నిన్ను హృదయమున ధరించుచుందురు. కావున నీకు నమస్కారము."

గంధర్వు లిట్లనిరి:- "స్వామీ! ఈ ఋషులును, మునులును మీ అంశకును అంశములు. గారడివాని బుట్టవలె నీజగత్తునందు పిల్లలవలె నాటలాడుచుందువు. కావునఁ గ్రీడాప్రియా! కాతుకీకేశవా! నీకు మాటిమాటికిఁ బ్రణామములు."

అంత విద్యాధరు లిట్లనిరి:- "స్వామీ! మాకు నీవు సుందర శరీరము నొసంగితివి. దీనినిఁ బొంది జనులు విఱ్ఱవీగి పోవుచున్నారు. ఈ యిటుకలు రాళ్లయందును, మాయిక పదార్థములందును నేను నాది,నీవు నీది యనుకొనుచు జీవితమును వ్యర్థముగఁ గడుపుచున్నారు. నీ సుమధుర కథలను శ్రవణ మొనర్పరు. నీకథామృతమును జవిచూచినవారికి మోహ మెచ్చటనుండి రాఁగలదు? కావుననే మేము సర్వశ్రేష్ఠములగు నీ సుందర సులలిత కథలనే తెలిసికొనుచున్నాము."

ఇది అంతయును విని బ్రాహ్మణు లిట్లనిరి :- "స్వామీ! యజ్ఞములోని హవిస్సు, అగ్ని, మంత్రములు, సమిధలు, కుశలు, యజ్ఞపాత్రలు, సదస్సులు, ఋత్విజులు, యజమాని. యజమాని పత్ని, దేవతలు, అగ్నిహోత్రము, స్వధా, సోమ, ఘృతములు, బలిపశువు అన్నియును నీవే.ఇదివఱకు పాతాళమునకుఁ

బోయిన పృథివిని నీవే సూకరరూపమును ధరించి యుద్ధరించి తివి. ప్రపంచములో నీ సుమధుర నామమే సర్వశ్రేష్ఠమైన దని మా విశ్వాసము. యజ్ఞములలో జరుగు ప్రాయశ్చిత్తము యును నీ నామ సంకీర్తనముచేతనే పూర్తి యగుచున్నవి. మా యజ్ఞమునకు నీవు సాక్షాత్తుగఁ బ్రకటమైతివి. కావున యజ్ఞము పూర్ణమగుటలో సందేహ మేమున్నది? ఇక నది పూర్తి కాఁగలదు."

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! ఈ విధ ముగ నందఱును దమతమ బుద్ధి ననుసరించి భగవంతునిగూర్చి స్తుతులొనర్పఁగా నన్నిటిని విని సర్వేశ్వర సచ్చిదానందుఁడగు శ్రీహరి మిక్కిలి సంతోషించెను. దక్షుఁడాతనిని విధ్యుక్తముగఁ బూజించి, యజ్ఞములోఁ బ్రధానభాగమగు త్రికపాలరూపమగు బురోడాశమును మిక్కిలి భక్తిభావముతో శాస్త్రవిధి ననుస రించి యర్పణము కావించెను. యజ్ఞేశ్వరభగవానుఁడు తన యజ్ఞభాగమును గొని మిక్కిలి సంతుష్టుఁడయ్యెను. బ్రహ్మ రుద్రుల సన్నిధిలోఁ దన భాగమును గ్రహించి మందహాస మొనర్చుచు దక్షునితో నందఱును వినుచుండ మేఘగంభీర భాషణముల త్రిమూర్తుల యైక్యతనుగూర్చి చెప్పెను. విదురా! భగవానుని యుపదేశమును వినుట కందఱును చాలసేపటినుండి ఉత్సహించుచుండిరి. అందువలన భగవానుఁ డేదో చెప్పఁబోవు టను గాంచి, అందఱును సావధానులై కూర్చుండి, తదేక దృష్టితో భగవానుని వైపునకే చూచుచుండిరి."

---

# దక్షయజ్ఞ సమాప్తి

(౨౧౩)

శ్లో॥ రుద్రం చ స్వేన భాగేన హ్యుపాధావ త్సమాహితః ।
కర్మణో దవసానేన సోమపానితరానపి॥

ఉదవస్య సహర్త్విగ్భిః సస్నావభృథం తతః ।
తస్మా అప్యనుభావేన స్వేనైవావాప్తరాధసే ।
ధర్మ ఏవ మతిం దత్వా త్రిదశాస్తే దివం యయుః॥

— శ్రీ భాగ. ౪ స్కం. ౭ అ. ౫౬, ౫౭ శ్లో

సీ. అంగప్రధానక యాగంబులను జేసి,
యమరుల రుద్రుని నర్థిఁ బూజ
సేసి విశిష్టేష్ట శిష్టభాగమున
నుదవసాన కర్మంబుఁ దవిలి తీర్చి
తాను ఋత్విక్కులుఁ దగ సోమపులఁ గూడి
యవభృథస్నానంబు లాచరించి
కడఁక నవాప్త సకల ఫలకాముఁడై
తనరు దక్షునిఁ జూచి ధర్మబుద్ధి

తే. గలిగి సుఖవృత్తిఁ జీవింతుగాక యనుచుఁ
బలికి దివిజులు మునులును బ్రాహ్మణులును
జనిరి నిజమందిరముల కా జలజనయన
భవులు వేంచేసి రాత్మీయ భవనములకు.

— శ్రీ మదాంధ్రభాగవతము

శరీరమునకు మూఁడు భాగములు కలవు. నాభినుండి క్రిందభాగము, నాభికి పైభాగము, శిరస్సు. మూఁడును జీవనమున కవశ్యములే. మూఁడును లేక జీవనయాత్ర జరుగుట కష్టమే. సంఘాతములోనే సృష్టి కలదు. త్రిగుణాత్మక సృష్టి త్రిదేవులు లేక జరుగదు. కావున మనకడ ముగ్గురకు గొప్పదనము కలదు. త్రికాలములు, త్రిదోషములు, త్రిదేవులు, త్రిసవనములు, త్రయీవేదము, త్రిగుణాదులు మొదలగునవి మూఁటితోడనే సృష్టి జరుగుచున్నది. ఈ మూఁటిలో నొక్కదానిని బహిష్కరించితిమా ముగ్గురు నసంతుష్టు లగుదురు. కావునఁ బ్రాచీనమార్గ మర్యాదను విడిచి నూతనమార్గమునఁ బోరాదు. సత్యసనాతనపథమునే అనుసరింపవలయును.

మైత్రేయమహాముని యిట్లనెను:- "విదురా! అందఱు స్తుతించుట కాఁగానే భగవానుఁ డందఱియెడలఁ బ్రసన్నుఁ డయ్యెను. చేతులను జోడించుకొని సమ్ముఖమున దక్షప్రజాపతి నిలుచుండెను. అందువలన నాతనితో భగవానుఁడు మేఘగంభీర వాక్కులతో నందఱును వినునట్లుగ నిట్లనెను:- "ప్రజాపతి దక్షా! శివుని నీ యజ్ఞములో బహిష్కరించి నీవు పొరపాటును గావించితివి. శివుని బహిష్కరింపలేదు, నీవు నన్నే బహిష్కరించితివి."

చేతులు జోడించుకొని దక్షప్రజాపతి యిట్లనెను:- "స్వామీ! మీ కొఱకే నేనీ యాడంబరమంతయును జేసితిని. నేను సమస్త సంభారములను మీ ప్రసన్నత కొఱకే కూర్చితిని. నేను వైష్ణవ యజ్ఞమునే ప్రారంభించితిని. అయినను మీరు రాలేదు. నాపైఁ గృపఁజూపలేదు. ఇప్పుడెవరిని దోషమెన్నఁగలను? అంతయును నా భాగ్యదోషమే."

ఇదివిని భగవానుఁ డిట్లనెను:- "నాయనా! నీకు తెలియు లేదు. నీవు నాకొఱకే యిదియంతయును గూర్చితివనుట నిజమే కాని శివు నాహ్వానింపలేదు. శివుఁడు నాకన్యముగ నున్నాఁడా? ఎవరి కాళ్లను మాత్రమే పిలిచి, మొండెమును, శిరస్సును బిలువలేదనిన నొంటరిగఁ గాళ్లు రాఁగలవా? శివబ్రహ్మ లిద్దఱును నా స్వరూపులే. జగత్తున కేకైక కారణమును, అందఱకు నాత్మయు, చరాచరేశ్వరుఁడను, సాక్షిని, స్వయంప్రకాశకుఁడను, కర్తను, భర్తను, హర్తను విధాతను నేనే. నేనే నా త్రిగుణాత్మకమాయ నాశ్రయించి జగత్సృష్టికొఱకు బ్రహ్మగను, పాలనమునకు విష్ణువుగను, సంహార మొనర్చుటకు రుద్రుఁడుగను నిట్లు మూఁడురూపములను ధరించుచుందును. వీరందఱును నామమాత్రమునకు వేఱు. వాస్తవమున కీమూఁడు రూపముల నేను గార్య మొనర్చుచున్నాను."

దక్షుఁ డిట్లనెను:- "స్వామీ! అయితే అందఱును బ్రహ్మ రాజసదేవుఁడనియు, రుద్రుఁడు తామసదేవుఁడనియు, విష్ణువు సత్త్వప్రధానుఁడనియు నిట్లు ముగ్గురను వేఱువేఱుగఁ జెప్పెదరేల? సాత్త్వికులు రుద్రోపాసన చేయరాదు కదా!"

భగవానుఁడు శ్రీఘ్రతతో నిట్లనెను:- "వృద్ధసేవ చేయనివారును, సచ్ఛాస్త్రముల విధ్యుక్తముగ నధ్యయనము చేయని మూర్ఖు లిట్లు తలఁచుచుందురు. వారే యిట్టి తలయును దోఁకయును లేని అసంబద్ధ ప్రలాపము లొనర్చుచుందురు. సర్వాంతర్యామియు నద్వితీయ బ్రహ్మ నగు నాలో భేదభావమునకు స్థానమెక్కడిది? ఒకానొక పురుషుని శరీరమునఁ జేతులు, కాళ్లు, కన్నులు, చెవులు, ముఖము, శిరస్సెట్లున్నవో, అన్ని

ను వేలువేలుగ నున్నను మానవుఁ డేస్థితిలోను నీచేతులు
చుగాను, కాళ్లు నేనుగానని యెట్లనుకొనఁడో, అన్నియంగ
ల మీఁదను సమానముగ మమత్వ మెట్లు చెందియుండునో,
మత్వము పైనుండి క్రిందివఱకు సమస్త అంగములందును
మానభావ మెట్లుండునో అదేవిధముగ బ్రహ్మ రుద్రులు
ముగఁ గనఁబడుచున్నను దత్త్వరూపమున నొక్కటియే."

దక్షుఁ డిట్లనెను:- "అయితే మిమ్ముల నొక్కనిఁ
రాజించిన నందఱేల సంతుష్టిని జెందరు ? వ్రేళ్లకు నీరు పోసి
నో వృక్షశాఖ లన్నిటికిని, పత్రము లన్నిటికిని తృప్తి కలుగు
న్నది గదా !''

భగవానుఁ డిట్లనెను:- "అవును నిజమే. రాగద్వేష
నాత్ములై భేదభావమును దూరము కావించుకొని ఒక్కనినే
రాజించినను వానియందు మేమందఱమును సమానభావమున
తుష్టినిఁ జెందెదము; కాని ద్వేషవశమున భేదబుద్ధి నెంచు
వును, మాలో నెవరినైనఁ జిన్నపెద్ద యనువారును, మాలో
రూపమునైన నిందించువారును నపూజ్యులుగ నెంచువారు
డిచో వారియెడలఁ బ్రసన్నతను జెందము. ముగ్గురలో
క్కరమును వానికడకు బోము; ఏలననఁగా వారు తత్త్వ
ధరహితులగు నజ్ఞానులు. ఆతనికి సిద్ధిలాభమును గలుగదు.
నికి శాంతియును లభింపదు. కాని కార్యభేదమున బ్రహ్మ
ం మహేశ్వరులను మూడు రూపములను ధరించినను వాస్తవ
ప నొక్కరమే. ఇట్టి మాయందెవఁడు భేదభావము నెంచఁడో
ఁడు స్వల్పకాలముననే శాంతిలాభమును బొందును.
హ్మన్ ! ఇప్పుడు నీవు మా ముగ్గురను నభేదభావమునఁ

జూడుము. ఒక్కరుగా భావించి మా ముగ్గురను సమానభావముతోఁ బూజించుము. నీకు మేలుకలుగును.”

మైత్రేయ మహాముని యిట్లనెను:- “విదురా! భగవానుని యిట్టి సారగర్భితమగు నుపదేశమును విని దక్ష ప్రజాపతి కృతార్థుఁడయ్యెను. అతఁడు త్రిమూర్తులలోఁ దన యభేద బుద్ధిని స్థిరము కావించుకొనెను. అంత నాతఁడు యజ్ఞపతియగు భగవానుని యజ్ఞముద్వారా పూజించెను. అనఁగాఁ దన యజ్ఞ కార్యమును విధివిధాన పూర్వకముగ నారంభించెను. ఆ యజ్ఞమందు సమస్తదేవతలను నంగదేవతలుగను, ప్రధాన దేవతలుగను రెండు విధములఁ బూజించెను. తదనంతరము బ్రహ్మ చెప్పఁగా దేవతలచేఁ గల్పింపఁబడిన రుద్రభాగముచే భూతనాథుఁడగు మహేశ్వరుని భగవద్భావ భావితుఁడై మిక్కిలి శ్రద్ధా భక్తులతోఁ బూజించెను. ఇతర దేవతలనుగూడ యథా యోగ్యముగఁ బూజన సత్కారము కావించెను. యజ్ఞమును జేయించు ఋత్విజాదులకు యథేష్టముగ దక్షిణల నొసంగెను. ప్రజాపతి పతియగు దక్షుఁ డందఱను దానమానములచేతను, విపులమాత్రముగ వస్త్రాభూషణములను, ధనమును నొసంగి సంతుష్టి కావించెను. అందఱు నాతని యుదారతను గూర్చి గానము చేయసాగిరి. యజ్ఞకార్య సమాప్తినిఁ గావించి దక్ష ప్రజాపతి మిక్కిలి వైభవముగ నవభృథస్నాన మేర్పాటు గావించెను. సమస్త ఋషులును, మునులును, దేవతలును, యక్షులును, గంధర్వులును, బ్రాహ్మణులును, ఋత్విజులును, పురోహితులును, పత్నీసహితముగ దక్షుని ముందుఁబెట్టుకొని భాగీరథియందు కనఖల సమీపమున నవభృథస్నానము కొఱకు

పోయెను. అందఱును వేదమంత్రముల ద్వారా శాస్త్రీయ విధిచే మృత్తికాస్నానమును, బంచగవ్య, భస్మ, అపామార్గ, ఆమలక, కుశాది పవిత్రద్రవ్యములతో విధ్యుక్తముగ స్నానమొనర్చెను. అంతట జలక్రీడ ఆరంభమయ్యెను. అందఱును నొకరొకరి మీఁద జలములను జల్లుకొనుచుండిరి. యువతులగు స్త్రీలు తమ తమ మఱఁదులమీఁదను, భర్తలమీఁదను జలమును జల్లుచుండిరి. కొందఱు వసంతమును, కుంకుమ పసుపు కలిపిన జలమును బరస్పరము చల్లుకొనుచుండిరి. కొందఱు పిచ్చికారులతో నితరుల ముఖమును దడుపుచుండిరి. కొందఱు వక్షస్థలమునఁ గొట్టుచుండిరి. వేఱొకఁ డింకొకని లేవనెత్తి జలములఁ బడవేయుచుండెను. ఇంకొకఁడు గంగారజమును వేఱొకని శరీరమునఁ బూయుచుండెను. ఈ విధముగ మిక్కిలి ఆనందోల్లాసముతో నాతఁడు యజ్ఞాంతావభృథస్నానము పూర్తియయ్యెను. దక్షప్రజాపతి బ్రాహ్మణులకును, యాచకులకును, ఆశ్రితులకును యథేష్టముగఁ బారితోషికము లొసంగెను. అందఱును దక్షు ననేకవిధములఁ బ్రశంసించిరి. మరల వచ్చిన తరువాత నసంఖ్యాకులగు బ్రాహ్మణులకు స్వాదిష్ట పదార్థముల ద్వారా సంతుష్టి నొనర్చెను. అందఱకును భోజనము పెట్టిన తరువాత దక్షిణలొసంగెను. గంధాక్షతలతోఁ బూజించి వారికి సన్మానము కావించెను. ఈ విధముగ నాతని యజ్ఞము మిక్కిలి వైభవముగ సమాప్తమయ్యెను.

విదురా! యజ్ఞము సానందముగను, సకుశలముగను సమాప్తముకాఁగానే దేవతలందఱును దక్షప్రజాపతి ననేక విధముల నాశీర్వదించెను. అందఱు నిట్లనిరి:- "నీ బుద్ధి యెల్లప్పు

డును ధర్మమందే లగ్నమైయుండుఁగాక ! నీవి దేవిధముగ సదా ప్రజావృద్ధియందు లగ్నమై యుండెదవుగాక !" ఈ విధముగ నాశీర్వదించి యెవరెచ్చటినుండి వచ్చిరో వా రచ్చటికి వెడలి పోయిరి. భగవానుఁడు వైకుంఠమునకుఁ బోయెను. బ్రహ్మదేవుఁడు బ్రహ్మలోకమునకుఁ బోయెను. పరమేశ్వరుఁడు కైలాసమునకుఁ బోయి సమాధిమగ్నుఁ డయ్యెను. దేవతలు స్వర్గమునకుఁ బోయిరి. పితరులు పితృలోకమునకుఁ బోయిరి. ఋషులును, మునులును, బ్రాహ్మణులును దమతమ ఆశ్రమములకుఁ బోయిరి. దక్షుఁడును నాతని భృత్యులును సేవకులును నచ్చటనే కాలము గడుపసాగిరి. ఈ విధముగ విదురా ! నే నత్యంత సంక్షేపముగ దక్షయజ్ఞ కథను జెప్పితిని. ఇప్పుడు నీ వేమి వినఁ దలఁచు చున్నావు ?"

ఇది విని విదురుఁ డిట్లనెను:- "ప్రభూ ! నీవు దక్షయజ్ఞముయొక్క యద్భుతకథను వినిపించితివి. దీనిని వినఁగా నే నాకు రోమరోమమును నిక్కఁబొడిచినది. శివమాహాత్మ్యమును వినిన నాకుఁ దృప్తి జనించుటలేదు. సతీదేవి శివుని అనాదిశక్తి కదా ! ఆమె యే స్థితిలోను నాతనికి వేఱుగ నుండఁజాలదు. ఆమె సతీరూపమున నుండఁగాఁ దన శరీరమును యోగాగ్నిలో భస్మము కావించినదికదా ! మరల నామె శివుని నే రూపమునఁ బొందినది ? ఏ రూపమున నామె తన శక్తిమంతుని సమీపమున నివసింపనాగినది ? ఈ కథను దయచేసి వినిపింపుఁడు. నేను దీనిని వినఁగోరుచున్నాను."

విదురుని యీ ప్రశ్నను విని మైత్రేయమహాముని సతీదేవియొక్క రెండవ జన్మకథను జెప్ప నుద్యుక్తుఁడయ్యెను.

# సతీదేవి పార్వతిగాఁ బుట్టుట.

## [౨౧౪]

శ్లో॥ ఏవం దాక్షాయణీ హిత్వా సతీ పూర్వకలేవరమ్ ।
జజ్ఞే హిమవతః క్షేత్రే మేనా యామితి శుశ్రుమ॥
—శ్రీభాగ. ౪ స్కం. ౭ అ. ౫౮ శ్లో.

వ. అంత దాక్షాయణి యయిన సతీదేవి పూర్వకళేబరంబు
విడిచి హిమవంతునకు మేనకయందు జనియించె.
— శ్రీమదాంధ్రభాగవతము.

---

ఎవరినైనఁ జూచినఁ జిత్తము వారివైపు స్వతః ఆకర్షిత మగును. హృదయము వానిని బరమఆత్మీయతతో స్వీకరించును. కొందఱు వత్సరములకొలఁది యుండినను వారియెడల నిసుమంతైన నాకర్షణ ముండదు. వారియెడల మనస్సు సదా ఉదాసీనముగనే యుండును. కొందఱు అకారణముగనే పరిచయసంబంధము లేకయే ద్వేషించుచుందురు. దీనికి కారణ మేమి ? కొందఱు క్షణములోనే కలిసిమెలసి యుందురు. కొందఱు జీవితకాలమంతయును వెంట నున్నను మనస్సునకు దూరమగుదురు. ఇవన్నియును బూర్వజన్మసంస్కార పరిచయము. పూర్వజన్మమునఁ గొంచెముగ సంబంధమున్నవారితోఁగాని ఆగామిజన్మములందు సంబంధముండవలసిన వారితోఁగాని మనకీ జన్మమున సంబంధ మేర్పడును. ఇది మారని సిద్ధాంతము. మానవుఁడు పాపపుణ్యములను గూర్చి ఆలోచించెనా దాని ఫల మవశ్యము కలిగితీరును. మన మేదైనఁ బుణ్యవిషయముల

నాలోచించితిమా ఆగామిజన్మములందవి పూర్తియగును. ఇదే విధముగఁ బాపమును. మనస్సెల్లప్పుడు నేదియో ఆలోచించుచునే యుండును. దాని సంస్కారములు కొద్దిగనో గొప్పగనో హృదయమునఁ బడుచుండును. మానవుఁడు కోరకున్నను దాని యొక్క మంచిచెడ్డ విచారముల ఫలము కలిగితీరును. ఎఱ్ఱమట్టిలోఁ దిరుగునప్పుడు అది కోరినను గోరకున్నను దాని సడక చారలు పడినట్లు పడును.

కొన్ని సంస్కారములు అత్యంత సాధారణముగ నుండును. అవి వచ్చి పోవుచుండును. వాని సుఖదుఃఖములు మానసికముగ నుండును. కొన్ని విచారముల సంస్కారమువలన స్వప్నములో సుఖదుఃఖము లనుభవింపవలసి వచ్చును; ఏలననఁగా సమస్త సంస్కారములకును ప్రతిక్షణమును జన్మించుచుండినను మానవుఁడు భోగింపఁజాలఁడు. అందువలనఁ జాల కర్మల భోగము మానసిక సుఖదుఃఖముల వలనను స్వప్నము వలనను గలుగును. ప్రబల సంస్కారములై, హృదయమునఁ గూడుకొనినప్పుడును, మానవుఁడొకానొక దానికొఱకై ప్రబల ప్రయత్నము చేయునపుడును దానిఫలమును ప్రత్యక్షముగ ననుభవింపవలసి యుండును. మనకేమియును సంబంధము లేనివాఁ డత్యధికముగ మనలను ప్రేమించుచుండిన నాతనికిని మనకును బూర్వజన్మమున ఘనిష్ఠ సంబంధమున్నదని గ్రహింపవలయును. మనల నత్యంతముగఁ బ్రేమించుచుండినను, ఎవరినిఁ జూడకున్న మనకు మనశ్శాంతియే యుండదో, అట్టివాఁడు మనలను నట్లే ప్రేమించుచుండుచో దూరమున నుండినను నాతఁడు మనమనస్సులోఁ బాదుకొని యుండినయెడల నొకా

నొకదినమున వాని సవశ్యము ప్రాప్తింపఁగలమని భావింప వలయును.

ఇట్లాలోచించుకొనియే శౌనకుఁడు సూతు నిట్లడిగెను:- "సూతా! సతీదేవి శివునత్యంతముగఁ ప్రేమించెడిది. శివుని ప్రేమసంగతి చెప్పవలసిన దేమున్నది? ఆతఁడు ప్రేమవశమునఁ దన యర్ధాంగమును నామెకొసంగెను. సగము స్త్రీగనయ్యెను; సగము పురుషుఁడుగ నయ్యెను. అందువలననే ఆతని నర్ధనారీ నశ్వరుఁడందురు. ఇద్దరకును నద్వితీయమును ననుపమైన ప్రేమ కలదు. ఘటనాక్రమముచేఁ దండ్రికొఱకు తండ్రిని నిమిత్తము గావించుకొని భవాని సతీదేవి తనశరీరమును వదలవలసి వచ్చెను. వదలునప్పుడుకూడ ఆమె శివుని ధ్యానమొనర్చుచు నాతనిని మరలఁ బొందవలెనను గోరికతో యోగాగ్నిలో భస్మ మయ్యెను. ఈవిధముగ సతీదేవికి చివరవరకు శివునియందు ప్రేమ యుండెను. ఇచ్చట సతీవియోగమున శివుఁడున్మత్తుఁడైనట్లును ఆతఁడు విరహామందలి సమస్తదశలను జూపించునట్లును, ఆతఁడు తన ప్రియావియోగమున వస్త్రమును దీసి పాఱవైచినట్లును, దిగంబరియై లోకలజ్జను విడచి స్మశానమం దేడ్చుచున్నట్లును, సతీదేవియొక్క కపాలమును మాలగా ధరించినట్లును, నామె చితాభస్మమును శరీరమునకుఁ బూసికొనినట్లును, అప్పటికిని నాతనికి శాంతిలభించనట్లును వినియుంటిమి. ఆతఁడు 'హాప్రియా! హాసతీ!' అని పలుకుచు విహ్వలుఁడైనట్లును వినియుంటిమి. అంతటి ప్రేమలో వియోగ మేల కలిగినది?"

ఇదివిని సూతుఁ డిట్లనెను:- "మహాభాగా! ప్రేమగల వారి కెన్నటికిని వియోగము కలుగదు. మన హృదయమునఁ

బట్టుకొన్న వారెల్లప్పుడును గలిసియే యుందురు. మనస్సులో వారు సదా ఒకరినొకరు గట్టిగాఁ బ్రేమించుకొని యుందురు. శరీరవియోగము ప్రేమను మిక్కిలిగఁ బెంచును. ఆ వియోగము ప్రేమను మిక్కిలి యుజ్జ్వలము కావించి ప్రకాశింపఁజేయును. వియోగమే లేకుండిన సంయోగ సుఖాస్వాదనమే యుండదు. సతీదేవి మనస్సులో సదాశివుఁడుండును. శివుఁడును సదా సతీదేవినే చింతించుచుండును. ఇద్దరు నభిన్నులే; ఒక్కరే. లోక లీల యొనర్చుటకై, భక్తుల మనోవాంఛను బూర్ణము కావించుటకై, ప్రపంచమునఁ దన సుఖదలీలలను విస్తారము కావించుటకై ఆతఁడిట్టి కరుణ నుత్పన్నమొనర్చు క్రీడలొనర్చుచుండును. వానిచే జీవుల చిత్తమందు సదాశివుని గుణములయెడల ననురాగము కలుగును. మహాభాగా! సతీదేవి హిమాలయ పత్నియగు మేనకాగర్భమునఁ బార్వతీ రూపమున నవతారమును ధరించి, తన సర్వస్వుఁడగు భూతనాథుని మరలఁ బతిరూపమున వరించెను.''

ఇదివిని శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! హిమాలయము జడమే. ఇట్టి దానికి భార్య, పిల్లలెట్లుండిరి?''

అంత సూతుఁ డిట్లనెను:- ''జడమెవరు? అన్నియును చైతన్యములే. అన్నిటికిని ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికములను మూఁడురూపము లుండును. ఆధ్యాత్మరూపమున శ్రీహరి అందఱిలోను రమించుచున్నాఁడు. ఆధిదైవికరూపమున నాయా దేహముల కధిష్ఠాన దేవతలుందురు. ఆధిభౌతిక రూపమున నీ పంచభూత సంఘాతరూపమునఁ బ్రాణుల శరీరముండును. అదే విధముగ మట్టి, రాళ్లు, వృక్షము, గుహలతోఁ గూడిన హిమా

లయముగఁ గనఁబడు రూపము ఆధిభౌతికము. వీని కధిష్ఠాతృ దేవతలు విష్ణ్వంశచే నవతరించిన నొక గిరిరాజ దేవవిశేషము. ఆతని వివాహము పితరుల పెద్ద కూతురగు మేనతో జరిగినది. ఆ భాగ్యవతియగు మేనయే పార్వతికి జననికాఁదగు విశ్వవందిత పదమును బ్రాప్తించినది.''

ఇది విని శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! ఈ మహా భాగ్యవతి మేన యెవరు? ఏ కారణమున నీమెకు జగన్మాత ఆద్యశక్తికి తల్లియగు దేవదుర్లభ పదము ప్రాప్తించినది?"

ఈ ప్రశ్నకు ప్రత్యుత్తర మొసంగుచు సూతుఁడిట్లనెను:- "శౌనకా! ఏకర్మచేతనైనను జగన్మాతయును,విశ్వవందితయును, ఆదిశక్తియునగు నామెకు దల్లికాఁగలరా? ఆమె యెవరి మీఁదఁ గృపగలిగియుండునో, ఎవరిమీఁద నామె తనకు దాను ప్రసన్నయగునో, ఆమె ప్రేమచే నిండిన హృదయముతో నెవరి మీఁద దయాదృష్టినిఁ బఱపునో ఆతఁడే ఆమెను బొందును.

అయినను, జగదంబిక తన కార్యమునకుఁ బూర్వము కొంతకారణము నుత్పన్నము కావించును. దక్షప్రజాపతి తన కూఁతుండ్రలో స్వధాయను నామెను బితరుల కొసంగియుండె నని నేనిదివఱకే చెప్పియుంటిని. పితరులు మానసిక సంకల్పముచే నామెయందు ముగ్గురు కన్యకలను గనిరి. పెద్దఆమె పేరు మేన, రెండవ యామెపేరు ధన్య, చిన్నయామెపేరు కళావతి. పిత రుల యొక్క దివ్యమానసపుత్రిక యగుటచే నీమెకు సమస్త లోకములందును బ్రవేశము కలదు. ఒక దినమున నీ ముగ్గురును బ్రహ్మసభయందు గూర్చుండియుండిరి. ఆసమయమున సనకాది

నల్గురు కుమారులు నచ్చటికి వచ్చిరి. వారినిఁ జూడఁగానే సమస్త ఋషులును, మునులును లేచి నిలుచుండిరి; ఏలననఁగా వారందఱకును బూర్వజులగుటచేఁ బూజనీయులైరి. అభ్యుత్థానమునకు యోగ్యులైరి; కాని యీ ముగ్గురు కన్యకలు చిన్నగా నుండిన నా కుమారుల యనుపమ రూపలావణ్యమును గాంచి శివమాయలోఁబడి అభ్యుత్థాన మొనర్చుటను మఱచిరి. అమాయకత్వముచే నట్టే కూర్చుండియుండిరి. ఋషులారా! ఈ కార్యములన్నియును భగవదిచ్ఛచే జరుగుచుండును. వారి యిట్టి యవినయమును గాంచి మీ దివ్యభావము నశించుగాక! మీరు ముగ్గురును భూమిమీఁదకుఁబోయి మనుష్యభావమును బొందుఁడని శపించిరి."

ఇది విని ముగ్గురును నిట్లు ప్రార్థించిరి:– "స్వామీ! మా మనస్సులలో నేమియును గుత్సితభావము లేదు. అహంకారమునకు వశీభూతులమయ్యు నట్లు చేయలేదు. మేము మీ తేజమును గాంచి విముగ్ధులైతిమి." ఋషుల క్రోధము నీటిమీఁద గీతలవలె నుండును. వెంటనే ప్రసన్నులై యిట్లనిరి:– "మానోట వెలువడినది అయితీరును. అయినను మీరు మర్త్యలోకమునకుఁ బోయి ప్రపంచములో విశ్వవందితులుగ నెన్నఁబడునంతటి భాగ్యశాలురలగుదురు. మీ మువ్వుర గర్భములనుండి ఆదిశక్తి జగదంబిక మూఁడు రూపములుగ నవతరించి వారిదర్శనముచే ముగ్గురును ముక్తిని బొందెదరు."

సూతుఁ డిట్లనెను:– "మునులారా! కుమారుల క్రోధమును ముక్తికారణ మగును. వారు ముగ్గురును భూమిమీఁదఁ బుట్టిరి. మొదటి యామె మేన హిమవంతముతోఁ బెండ్లి

యయ్యెను. ఆమెగర్భమున విశ్వవందిత భవానీదేవి జన్మించెను. రెండవయామె ధన్య జనకపత్ని యయ్యెను. ఆమెకు సీతాభగవతి జన్మించి 'అమ్మా' యను పిలుచు సౌభాగ్యమబ్బెను. మూఁడవయామె కళ యనునామె వ్రజములో వృషభానుని పత్నియై కీర్తిదేవి యనుపేర విఖ్యాతిఁ జెందెను. ఆమెకు రాధికా జననియగు మహాసౌభాగ్యము కలిగెను."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! మేనా వివాహము విష్ణ్వంశముచే నుత్పన్నమైన సకలపర్వతములకు రాజగు హిమవంతునితో నయ్యెను. హిమాలయముమీఁదనే శంభు నివసించును. అందువలన మేనకు భూతనాథుని దుర్లభదర్శనము ప్రాప్తించు సౌభాగ్యము కలిగినది."

అంత శౌనకుఁ డిట్లనెను:- "మహాభాగా! మహాభాగ్యవతి యగు మేన మహామాయయగు జగదంబిక పుత్రికయగుట కేమి సుకృతము నొనరించినది?"

అంత సూతుఁడిట్లనెను:- "మునులారా! దేవి నెవరును నన్యసాధనములచే సంతోషపెట్టఁజాలరు. ఆమె ప్రేమచేతనే వశము గాఁగలదు. శివుఁడుసతీదేవిని వివాహముచేసికొని కైలాసమునకు వచ్చినపుడు సతీదేవి కొంచెముగ విచారముతో నుండెడిది. ఆడపిల్ల క్రొత్తగా నత్తవారింటికి వచ్చినపుడామె కేమియును దోఁచదు. తల్లిదండ్రులను, తోఁబుట్టువులను దలఁచుకొనుచుండును. అత్తవారింటికి వచ్చినతరువాత నామెకు అత్తమామలయొక్కయు, బావలు మఱఁదులయొక్కయు, ఆడబిడ్డలయొక్కయు, తోడుకోడండ్రయొక్కయు ప్రేమ ప్రాప్తించును. అప్పుడింటిని మఱచి పోవును. అప్పుడామె మనస్సిచ్చటనే లగ్న

మగును. పతికి ప్రేమపాత్రగాఁగానే మరల నామెకు పుట్టినిల్లు జ్ఞాపకమునకు రాదు. ఇంటిలో నత్త కర్కశయైనను, ఆడుబిడ్డలును దోడికోడండ్రును గయ్యాళులైనను, ఇంటిలోఁ బ్రేమించువా రెవరును లేకున్నను, ఒంటరిగా భార్యాభర్తలుండిన భర్త కొంచెముగ రూక్షముగనుండినను, ఇట్టి స్థితిలో నత్తవారిల్లు కారావాసముగ నుండును. నరకసదృశమగును. ఆమె యెట్లో తనరోజులను గడుపుకొనును.

సతీదేవికి అత్తలు, ఆడుబిడ్డలు, తోడుకోడం డ్రెవరును లేరు. కేవలము శివుఁడే శివుఁడుండెను. శివుఁడు సతీదేవి నెక్కుడుగఁ బ్రేమించుచుండినను నీ బైరాగుల ప్రేమ యేమి నమ్మకము? సమాధిలోఁ గూర్చుండెనా అన్నిటిని మఱచిపోవును. శివుఁడు సమాధిమగ్నుఁడైనప్పుడు సతీదేవి ఒంటరిగా నాతని యందు మగ్నమై యుండెడిది. శివగణములగు భూత, ప్రేత, పిశాచ, డాకినీ, శాకినీ, ప్రమథ, బేతాళాదులను జూడఁగానే సతీదేవి భయపడుచుండెడిది. వారితో మాటలాడుటకే యిష్టముండెడిదికాదు. ఇట్టిస్థితిలో గిరిరాజ ప్రియయగు మేనాదేవి ఆమెను పుత్రికవలెఁ బ్రేమించెడిది. ఆమెమీఁద నెక్కుడు వాత్సల్యమును జూపెడిది. ఆమెను దనపుత్రికవలె నాదరించెడిది. ఆమె శరీరమునకు గంధము నలదెడిది. పాదములకు పసుపును బూసెడిది. తలను దువ్వెడిది. తలలో వివిధసుందర సుగంధిత పుష్పములను దురిమెడిది. అంత నామె ముఖమును దుడిచి కౌఁగిలించుకొనెడిది. ఆమె తనపుత్రిక కాదను సంగతినే మఱచెడిది. సతీదేవి సౌందర్యమును గూర్చి ఆమె రాత్రింబవళ్లు చింతించుచుండెడిది. ఆహా! ఎంతటి చక్కనిపిల్ల? దక్షపత్ని

యగు ప్రసూతి యెంతటి భాగ్యశాలిని. ఎటువంటి కన్యారత్నము నామె కన్నది? యథార్థముగ నామె ప్రసూతియే. ఈమె నాకు తనయయగుచోఁ బ్రపంచమున నాకు మించిన సౌభాగ్యశాలిను లెవరుందురు? రాత్రియంతయును నిట్లు చింతించుచుఁ బ్రాతఃకాలము కాఁగానే మరల సతీదేవినిఁ బ్రేమించును. ఆమె సతీదేవి గుణ, శీలస్వభావ, తేజఃప్రభా, సౌందర్య, సద్గుణాదులందు విముగ్ధయై ఆమెను జూడక యుండఁజాలకుండెను. ఈమెను గన్నులలోఁ బెట్టుకొందును, హృదయములో దాచుకొందును. ఈమె కమలముఖమును దదేకదృష్టితో రెప్పలార్పక జూచుచుందును.' అని యామె యనుకొనుచుండెడిది. ఆమెయొక్క యిట్టిప్రేమకు సంతుష్టయై సర్వేశ్వరియగు సతీదేవి శైలప్రియయొక్క మనోవాంఛను బూర్తిచేయవలయును. ఆమెకడుపునఁబుట్టి కూఁతుర నయ్యెదను. ఈమెకు బుత్రీజనితసుఖమునొసంగెదను. ఈ కారణముచేతనే ఆమె దక్షయజ్ఞమునఁ దన శరీరమును త్యజించెను. కాకున్న సతీదేవికి పితృగృహమునకుఁ బోవలసిన పని యేమి యున్నది? ఆమెకు మానావమానములతో నేమిప్రయోజనము? కేవలము మేనాదేవి కోరికను దీర్చుటకే ఆమె యీ క్రీడను రచించెను.

సతీదేవి యోగాగ్నిలో భస్మమయ్యెను. మేనాదేవికి మిక్కిలి దుఃఖము కలిగెను. ఈమెకు సతియనిన వాత్సల్యప్రేమ యుండెను. ఈమె త్రిభువనాధీశ్వరి, విశ్వబ్రహ్మాండములకు జనని, ప్రాణులందఱకును బూజనీయ, ఆరాధనీయ, మహామాయయను సంగతెరిఁగి మఱచిపోయెను. మాధుర్యమున నైశ్వర్యముండదు.

సతీవియోగమున శివుఁ డత్యంతదుఃఖమును జెందినాఁ డను సంగతిని బ్రహ్మాదిదేవతలు తెలిసికొని వారందఱును మహామాయ నారాధించిరి. దేవతల తపస్సునకు సంతుష్టయై శివలోక నివాసినియును, సర్వవ్యాపినియు నగు నిర్గుణమహామాయ సాకారరూపముచేఁ బ్రకటమై దేవతలను వరమును గోరుకొనుమనెను. విశ్వస్థితికొఱకు మరల సాకారరూపమునఁ బ్రకటము కమ్మని దేవతలు వరమును గోరిరి. మహామాయ యిట్లనెను:- "నేను గిరిరాజు హిమవంతుని పత్నియగు మేనాదేవి ప్రేమపాశమున బంధింపఁబడితిని. కావున నామెయింటఁ బుత్త్రినై పుట్టెదను. అప్పుడు మరల సదాశివుని వెనుకటివలె వరించెదను." ఇట్లు పలికి మహామాయ అంతర్థానమయ్యెను. బ్రహ్మ విష్ణ్వాది దేవతలందఱును శైలరాజు సమీపమునకు వచ్చిరి. ఆతనికిని నాతని పత్నికిని దేవి నారాధింపుఁడని చెప్పి వెడలిరి.

ఇచ్చట మేనాదేవి దేవతలుచెప్పఁగా సంతానాపేక్షతో నిరంతరము మహామాయయగు జగదంబికయునగు కాళికాదేవి నారాధనయందుఁ బ్రవృత్తిని జెందెను. ఆమె చైత్ర, ఆశ్వీజ మాసములందు నవరాత్రులలో నిరాహారాది వ్రతమును గావించుచు మిక్కిలి శ్రద్ధాభక్తులతో జగదంబిక నారాధించుచుండెను. చివరకు దేవి ప్రసన్నయై ఆమె సమ్ముఖమున సాకారరూపమునఁ బ్రకటమై వరము నడుగుమనెను. మైనాదేవి వివిధవిధముల మహామాయను స్తుతించి తనకు నూర్గురుపుత్త్రులును, తానే ఒక పుత్త్రికగను నుద్భవింపవలయునని వరము నడిగెను. మహామాయ 'తథాస్తు' అని పలికి ఆమెకు కోరిన వరముల

నొసంగి, తాను స్వయముగఁ బుత్రీరూపమునఁ బుట్టుదునను నాశ్వాసనమును గావించెను."

కాలాంతరమున మేనాదేవి గర్భవతి యయ్యెను. క్రమముగ నామెకు గొప్ప తేజస్వులును, బలవంతులు నగు బుత్త్రు లుదయించిరి. మైనాకులనుపేర విఖ్యాతులైన వీరందఱును ఱెక్కలను గలిగియుండిరి. ఇంద్రుఁడు వీరిపైఁ గోపమునుజెంది ఱెక్కలనన్నిటిని నఱకివైచెను, కేవల మొక్క పుత్రుఁడు సముద్రుని మిత్రత్వమును సంపాదించుకొనుటచే రక్షింపఁబడెను. ఆతఁడు సముద్రములో దాగెడువాఁడు. సీతాన్వేషణమున హనుమంతునకు స్వాగతమొసంగిన మైనాకు డీతఁడే. ఈతనికి సముద్రుఁడు చెప్పఁగా సముద్రమధ్యమునఁ బ్రకటమయ్యెను.

నూర్గురుపుత్రు లుదయించిన తరువాత నొకానొక శుభదినమున శుభముహూర్తమున సాక్షాత్తుగ జగదంబిక హిమవంతుని యింట మేనాగర్భమున నుత్పన్నమయ్యెను. ఆమె ప్రకటము కాఁగానే విశ్వబ్రహ్మాండమున కంతటను నానంద వెల్లువ పొరలిపొంగెను. అందఱమనస్సు ప్రసన్నముగనుండెను. దేవతలు స్వర్గమున దుందుభులను మ్రోగించిరి. గంధర్వులు ప్రేమమగ్నులై గానమొనర్చిరి. అప్సరసలు నృత్యము చేసిరి. అందఱియొక్క మనముకురములు వికసించెను. అందఱి హృదయములు ఉల్లాసముతో నిండిపోయెను. హిమవంతుఁడు సంస్కారము లన్నిటిని శాస్త్రవిధిచే జరిపించిరి. జగదంబయొక్క శరీర ఛాయ శరత్కాల నీలకమలమువలెఁ గృష్ణవర్ణముగ నుండెను. అందువలన నామెకు 'కాళికా' యను పేరును బెట్టిరి. ఈమె ఇవిగాక తార, మహావిద్య, షోడశీ, భువనేశ్వరీ, భైరవీ, ఛిన్న

మస్త, విద్యా ధూమావతీ, బగుళాముఖీ, సిద్ధవిద్యా, కమ లాంతికా మొదలగు ననేకనామములఁ బ్రసిద్ధిఁజెందెను. పర్వత పుత్రి యగుటచే నందఱామెను పార్వతియని పిలుచుచుండిరి.

శుక్లపక్ష క్షపాకరునివలెఁ బార్వతి హిమవంతునియింట మిక్కిలి గారాబుప్రేమలతోఁ బెరుగసాగెను. కాళ్ళకు గజ్జె లందియలు ధరించి ఆమె వయ్యారముగ నిటునటుఁ దిరుగు చుండిన స్నేహకారణమునఁ బృథివికిఁ బులకాంకురమయ్యెడిది. ఆమె లేఁగమలములకంటెను సుకోమల రక్తవర్ణముగనుండిన ఆమె పాదపద్మముల ముద్దుపెట్టుకొనియెడిది. సర్వలక్షణసంపన్న యగు నిట్టి పుత్రికను బొందిన మేన హృదయ ముప్పొంగెడిది. ఆమెను నిరంతరము చూచుచుండినను నామెహృదయముప్పొంగి ఆమెను గౌఁగిలించుకొనవలయునని తలంచెడిది. ఒక్కక్షణ మైనను గనుమరుగు కానీయదు. సర్వలక్షణసంపన్నయగు పుత్రిక ఒక్కతె యగుచోఁ దల్లుల కెంతో గారాబము. ఇది లేకున్నఁ దల్లియైన ప్రయోజనమేమున్నది ?

పార్వతీకాళికాదేవి పెరిగి పెద్దదైనకొలఁది, ఆమె సౌంద ర్యము వృద్ధిపొందుచుండెను. ఆమె తన యనుపమ సౌందర్య ముచే దశదిశలను బ్రకాశింపఁజేయుచుండెను. వీణావినిందిత తన సుమధురస్వరమున మాటలాడినప్పుడు దివ్యమగు కోకిల కూజితమొనర్చుచున్నట్లుండెను. ఆమె నవ్వుచుండిన నసంఖ్యా కములగు ముత్యాలు రాలుచున్నట్లుండెను. నల్లని యుంగర ములు తిరిగిన ముంగురులు వ్రేలాడుచుండ, బాల్యోచిత వయ్యా రమునఁ బుష్పములను గోయుచుండఁ స్వయముగఁ బుష్ప(శ్రీ)

మూర్తీభవించి పుష్పోద్యానమున విహరించుచున్నట్లుండెను. ఆమెను గాంచినవా రందఱును ముగ్ధులగుచుండిరి. భూలోకమున నిట్టి సౌందర్య మసంభవము. ఆమె సాక్షాత్తుగ సౌందర్య సజీవప్రతికృతిగ నుండెను. ఆమె అనవద్యసౌందర్యము హృదయమందు ఈర్ష్యా, స్నేహోల్లాసముల నుత్పన్నము కావించుచుండెను. క్రమక్రమముగ నామె బాల్యకాలమును త్యజించి యౌవనావస్థలోఁ బ్రవేశించెను. ఇచ్చట రామకృష్ణ యని గానమొనర్చుచు, వీణను వాయించుచు నారదుఁడు శివుని ప్రేరణచే హిమవంతునికడకు వచ్చెను. వీణావాదనము వినఁగానే గిరిరాజు తన సతీపుత్రులతో లేచి నిలుచుండి, నారదుని విధ్యుక్తముగఁ బూజించి యాతని స్తుతించిరి. మేన తన ప్రియపుత్రికను ప్రేమతో ముద్దిడుకొని యిట్లనెను:- "అమ్మాయీ! నారద ముని పాదములపై బడుము. ఈతని కృపయుండినచో నీకు మంచి మగఁడు లభింపఁగలఁడు." లజ్జించుచు పార్వతి దేవర్షి పాదములపైఁ బడెను. ముని ఆమె శిరస్సుపై జేయి నిమురుచు నిట్లనెను:- "అమ్మా! తెమ్మి, నీ చేయి చూచెదను." మిక్కిలి సిగ్గుపడుచు సర్వేశ్వరి తన సర్వలక్షణ లక్షితమగు గరకమలమును మునివరునకుఁ జూపించెను. కమలముకంటెఁ గోమలమును, మఖమలుకంటె మెత్తనిదియును, నవనీతముకంటె స్నిగ్ధమైనదియును, లజ్జావతికంటె మిక్కిలి లజ్జించునదియును, అప్పుడప్పుడు పుట్టిన రావియాకుకంటె మధుర రేఖాసమన్వితము నగు శ్రీహస్తమును గాంచి దేవర్షి మాటలాడఁజాలకపోయెను. అన్నిటినిఁ బరీక్షించి యిట్లనెను:- "అన్నియును బాగున్నవి, కాని కొంచెము కొఱత కలదు."

తల్లి దండ్రులీ శబ్దమును వినఁగానే వారిముఖము వాడి పోయెను. వారు వ్యగ్రతతో నిట్లనిరి:– "ప్రభూ! ఆ కొఱత యేమి?"

నారదుఁడు సరళతా స్వరమున నిట్లనెను:– "అదే మనఁగా ఈమెకు కాఁబోవు పతి నగ్నుఁడు, నిర్గుణుఁడు, నిరంజనుఁడు, నిర్వికారుఁడు, తల్లి దండ్రులు లేనివాఁడుగ నుండును."

ఇది వినఁగానే మేనకు ముఖమువాడెను. రక్తము నీరైనట్లుండెను. ఆమె భయపడుచు నిట్లనెను:– "స్వామీ! ఇదంతయును జాల గడబిడగానున్నది. దీనికిఁ బ్రతీకారమెట్లు?"

నారదుఁ డిట్లనెను:– "దీని కొక్కటే ఉపాయము కలదు. శివునితో నీమెకు వివాహమయ్యెనా ఈ దూషణము లన్నియును భూషణములు కాఁగలవు. దుర్గుణములు సుగుణములు కాఁగలవు. సమస్త కులక్షణములు సులక్షణములు కాఁగలవు."

ఇదివిని చింతామనస్కుఁడై గిరిరాజిట్లనెను:– "ప్రభూ! ఇదంతయును సత్యమే, శివుఁడు నిర్వికారుఁడు. సమస్త కామనారహితుఁడు. పరమేశ్వరుఁడు. అతఁడు నా పుత్రికను బాణిగ్రహణ మెట్లు చేసికొనును? అదియునుగాక ఆతఁడు మా యెదుటనే సతిదేవి ప్రేమకు సంతుష్టుఁడై 'నేను నిన్ను తప్ప వేఱొకతెను వివాహమాడ'నని ప్రతిజ్ఞ నొనర్చెను. సతీదేవి భస్మమైనది. ఇప్పుడు శివుఁడు తన ప్రతిజ్ఞ నెట్లు భంగమొనర్పఁ గలఁడు?"

నారదుఁ డిట్లనెను:– "గిరిరాజా! ఈ కాళికాదేవి దాక్షాయణి, సతీదేవియే. నీ యొక్కయు నీ భార్యయొక్కయు భక్తిచేఁ

బుత్రీరూపమున నుదయించినది. శివుఁడు తప్ప ఈమెను స్పర్శిం చుట కెవరికిని శక్తి లేదు. కావున నీవు సమస్త సందేహములను త్యజించి ఈమెను శివునకిచ్చి వివాహ మొనర్చుటకుఁ బ్రయత్నింపుము, శివుఁడు తపస్సుచే సంతుష్టుఁడు కాఁగలఁడు. కావున నీ పుత్రికను దపమొనర్పఁ బ్రేరేపింపుము." ఇట్లు పలికి నారదుఁడు వెడలిపోయెను గాని తల్లిదండ్రులకు మిక్కిలి దుఃఖము కలిగెను. మా కుమార్తె సుకుమారి. పూలుకోసిననే ఈమె చేతులు కందును. అట్టియామె ఘోరతపం బెట్లాచరింపఁగలదు? పార్వతీదేవి కన్నియును దెలియును. అందువలన నామె తండ్రితో నిట్లనెను:- "తండ్రీ! స్వప్నమందు నన్నొక వృద్ధ బ్రాహ్మణుఁడు శివారాధనమును, దపమును నొనర్ప నాదేశించి నాఁడు ఇది విని గిరిరాజిట్లనెను:- "అమ్మా! నేనును నేఁటిరాత్రి అట్టి స్వప్నమునే కంటిని. శివుఁడు సర్వేశ్వరుఁడు. మహేశ్వరుఁడు, ఆతని సేవాభాగ్యము నీకు ప్రాప్తించుగాక! నేనప్పుడు కృతార్థుఁడ నగుదును."

ఇది విని పార్వతి పరమ ప్రసన్నయయ్యెను. ఆ సమయముననే హిమవంతుఁ డిట్లువినెను - సతీ విరహమున దుఃఖితుఁడైన శివుఁడు నా సమీపముననే శైలశిఖరమునఁ దపంబొనర్చుటకు నిలిచియున్నాఁడు, అప్పుడాతఁడు తన చాలమంది సేవకులతో నానోకహారములను గైకొని శివసేవలో నున్నారు." ఇది వినఁగానే గిరిరాజు శివునకు సష్టాంగప్రణామ మొనర్చి ఆతని కుశలమునడిగి, తన భాగ్యమునుగూర్చి పొగడుకొని యోగ్యమగు సేవకై ప్రార్థించెను. ఆతని శీలస్వభావమునకు సంతుష్టుఁడై శివుఁ డిట్లనెను:- "గిరిరాజా! ఇప్పుడు నే నిచ్చ

టనే యుండెదను. నీవు వచ్చుచుండుము. నీకు మేమొక విధ
మగు ప్రజలమే అయితిమి."

హిమవంతుఁడు చేతులు జోడించుకొని యిట్లనెను:-
"ప్రభూ ! విశ్వబ్రహ్మాండములోని జీవులందఱును మీకు ప్రజ
మీరు ప్రాణులందఱకును బ్రభువులు, నేను నా ప్రాణముల
లర్పించియైనను మీకు సేవచేయఁగలిగినచో నది నా సౌభాగ్య
మనుకొందును." ఈ విధముగఁ జాలసేపటివఱకు సంభాషణము
జరిగెను. శివుఁడు శైలరాజునకు ప్రతిదినమును వచ్చుట కనుమ
తించెను. ఈ విధముగ శివునాజ్ఞను బొంది పర్వతరాజగు హిమ
వంతుఁడు తనయింటికిఁ బోయెను.

మఱునాఁడు తన సర్వలక్షణ సంపన్నయగు కాళికా
కన్యకనుగూడ వెంటఁ గొనిపోయెను. పితాజ్ఞచేఁ బార్వతి
పశుపతి పాదపద్మములకుఁ బ్రేమ భరిత హృదయమితోఁ
బ్రణామము కావించెను. తనకుఁ బ్రియమైన వస్తువు పోయి
దొఱకిన నెవరుగు ర్తింపఁ జాలరు ? సర్వజ్ఞుఁడగు శివుఁడంతయు
నెఱుఁగును. ఈమె విరహముననే తాను వ్యథచే వ్యాకులము
చెందినాఁడు. నేఁడాతని చిరసంగినియగు నభిన్నశక్తిని గాంచి
పరమ ప్రసన్నుఁడయ్యెను. గిరిరాజు చేతులు జోడించుకొని
యిట్లనెను:- "ప్రభూ ! ఈమె నా పుత్రి, మిక్కిలి అమాయక.
మీ చరణారవిందములం దీమెకు అత్యధికానురాగము కలదు.
నేనీమెను మీ సేవకు నియమించుచున్నాను. ఈమె సమస్త
విధముల మీకు సేవచేయుచుండును. ఈమెను మీకు సేవ
కొఱకై యంగీకరించి మీగణముల కాజ్ఞయిండు. ఈమె యెప్పు

దైనఁ దన సఖులతో భగవత్సేవకు వచ్చునెడల నీమె నెవరు నడ్డగింపరాదు."

శివునకుఁ గావలసినదిదియే; కాని స్థూణాఖనన న్యాయమున (గుంజను పాతి కదలించినట్లు) నీ విషయమును బుష్టి కావించుటకై, గిరిరాజుయొక్క కోరికను బలపరుచుటకై యిట్లనెను:- "రాజా ! నీ వింతటి గొప్ప బుద్ధిమంతుఁడవయ్యును నిట్టి యన్యాయము నొనర్చుచున్నావేమి ? నే నేకాకి తపస్విని. మీ పిల్ల యేదో ఒకటి రెండుసారులు దర్శనముచేసి వెడలుట మంచిదికాని నిరంతరము సేవలో నుంచుట నాకుగాని యీమెకు గాని ఘాతకమగును. కావున నే నీమెసేవను స్వీకరింపఁజాలను."

దీనతాస్వరమున శైలరాజిట్లనెను:- "ప్రభూ ! మీ సేవ కయోగ్యగా నెంచుటకు మా పిల్లలో నేమి దోషము కలదు ? మీరు నాకు సర్వశ్రేష్ఠులగు నతిథులు. జితేంద్రియులు, విశ్వనాథులు, ఈశ్వరులు, సర్వశక్తిమంతులు. మీ సేవవలన నీమెకు కల్యాణమే. నే నీమెలో నేదోషమును గాంచుటలేదు. అందఱ కారాధనీయులు మీరే. మీ సేవ యీమెకు లభించుచో నేను గృతకృత్యుఁడ నగుదును."

శివుఁ డిట్లనెను:- "అయ్యా ! మీ కుమార్తె సర్వాగ సంపన్నయు, సుశీలయు, సాధ్వియునగుట యథార్థమే. క నేను మాయారహితుఁడ నగు దపస్విని. స్త్రీ సమీపమున నుండుట తపస్సునకు గొప్ప విఘ్నము. స్త్రీ సంగతి జ్ఞాన వైరాగ్యములను నాశన మొనర్చును. సంసార బంధమును బిగించును. కావున మోక్షాపేక్ష కలవారు స్త్రీలకు సదా దూరముగ నుండవలయును. వారితో నేకాంతమున మాట

లాడరాదు. ఆవశ్యకమును ప్రయోజనభరితములగు మాటలను మాటలాడ వలసినచో నెవరి సమ్ముఖముననైనఁ జేయ వలయును. ఈ చిత్తము మిక్కిలి చంచలమైనది. ప్రకృతి సంసర్గముచే ననర్థ సృష్టిని వెంటనే కలుగఁజేయును. కావున నిట్టి పలుకులను నీవు పొరపాటుననైనఁ బలుకవలదు."

శివుఁడు పలికిన నిట్టి వైరాగ్యభరితములును, గూఢము లును నగు వాక్యములను విని గిరిరాజు చింతపడెను. ఆతఁడు తన ప్రియపుత్రికయగు పార్వతీముఖమువైపు చూచుచుండెను. పార్వతి నాతఁడు బాల్యకాలముననే చదివించియుండెను. ఆమె నేమి చదివింపవలయును. ఆమె వేదశాస్త్రము లన్నిటికిని జనని యైనను లౌకికరీతిచే నామె కన్ని శాస్త్రములను జెప్పించెను. ఆమె ఒక్కసారి చదువఁగానే అన్నిటిని ధారణచేసెడిది. అందు వలన శివునియొక్క యీ పలుకులను విని, తన తండ్రియాజ్ఞచే నామె వినీతభావముతో శివునకుఁ బ్రణామము కావించి యిట్ల నెను:- "స్వామీ! మీరెట్టి ఘోరాతిఘోర తపస్సు నొనర్పఁ బోవుచున్నారు ?"

శివుఁ డిట్లనెను:- "నా శక్తి ననుసరించి చేసెదను."

పార్వతి నవ్వి యిట్లనెను:-"మీరు శక్తి నాశ్రయించియే తపస్సును జేయుచో శక్తి యేది ? ప్రకృతినే శక్తి యందురు. శక్తినాశ్రయించియే బ్రహ్మ సృష్టినిఁ జేయుచున్నాఁడు. విష్ణువు పాలనచేయుచున్నాఁడు. రుద్రుఁడు సంహార మొనర్చుచున్నాఁడు. శక్తి లేక యేమియును లేదు. అన్నియును బ్రకృతి కధీనములే. ప్రకృతి లేక మహేశ్వరుఁ డేమి చేయఁగలఁడు ? అందఱును

ప్రకృతికి వశీభూతులే. మీరును ప్రకృతికి వశీభూతులై తప మొనరింప నుద్యుక్తులైతిరి.''

ఇది విని నవ్వుచు శంకరుఁ డిట్లనెను:- ''నేను తపస్సును జేసి ప్రకృతిని నాశ మొనర్చెదను. ప్రకృతికిఁ బరుఁడనగుదును.''

అంత శీఘ్రముగఁ బార్వతి యిట్లనెను:- "మీరు చెప్పినది ప్రకృతి కాదు. సూక్ష్మప్రకృతి. సర్వవ్యాపినియగు శక్తి లేకున్న మిమ్ములను దలఁచువా రెవరు ? పలుకుట, కదలుట, చెప్పుట, వినుట ఇవన్నియును ప్రకృతి కన్తర్గతములే. తినుట, త్రాగుట, లేచుట, కూర్చుండుట ఇవన్నియును ప్రకృతికి వశీభూతులమై చేయుచున్నాము. మేము జ్ఞానులము, ప్రకృతి మమ్ముల నేమిచేయఁ గలదని మీరనుచో మేము దానికిఁ బరులము, అట్టియెడలఁ దపముతో నేమి ప్రయోజనము ? మేమన్నిటియందును సమభావమునఁ జూచుచుందుము, ఊరక క్రీడకొఱకై యిట్లుందుమని యనుచో నీ స్త్రీ పురుష భేద భావమేల ? ఆత్మయందు స్త్రీపురుష భేదభావములేదు. అది నిర్వికారమైనది. అట్టియెడల మీరు భయపడనేల ?''

సూతుఁడిట్లనెను:- "శౌనకా! శివా సమ్ముఖమున శివుఁ డెట్లు జయింపఁగలఁడు ? ఆతఁడు నవ్వి యిట్లనెను:- "మంచిది, నీవు నీ చెలికత్తెలతో వచ్చి నిత్యమును నా పూజను చేయ వచ్చును."

ఇది వినఁగానే హిమవంతునకును బార్వతికిని జాల ఆనందము కలిగెను. ఇప్పుడు నిత్యమును బార్వతి తన చెలికత్తెలతో శివసేవకు సకాలమునకు వచ్చుచుండెను. ఆమె విధ్యుక్త

ముగ శివుని పాదములను ప్రక్షాళనము కావించెను. పాద్యార్ఘ్య, ఆచమనీయ, గంధాక్షత, పుష్ప బిల్వపత్ర, వనమాలా, ధూప, దీప, నైవేద్య, తాంబూలాదులచే నాతని బూజించుచుండెను. ఆతఁడుండుస్థానమునఁ జక్కఁగఁ జిమ్ముచుండెను. ఆవు పేడతో నలికెడిది. దానిమీఁద స్వస్తికాది ముగ్గులను వేయుచు, నిత్యమును సేవాపూజాదుల నొనర్చి యింటికిఁ బోవుచుండెను.

శివుఁడు నిర్వికారుఁడు. ఆతని మనస్సులో స్వప్నమందైనను నెన్నటికిని వికారము జనింపదు. పార్వతియును వికార రహితయే. నిత్య శివధ్యాన పరాయణ. ఈ విధముగ నిద్దరును విశుద్ధభావముతో సమీపమున నివసించుచుండినను నెవరి మనస్సులలోను నేకాంక్షయును లేకుండెను. సదాశివుఁడు తనను సదా సహచరిగను, సేవికగను స్వీకరించిన బాగుండునని ఆమెకు మనసులోఁ గోరిక యుండెడిది.

ఇచ్చట పార్వతీ పరమేశ్వరులు నిర్వికార రూపమున కాలయాపనమును జేయుచుండఁగా నచ్చట తారకాసురుఁడను దైత్యుఁడుద్భవించి దేవతలను బాధించుచుండెను. ఆతఁడు తన తపస్తేజములతో నెవ్వరును నాతనిని జయింపఁజాలనట్లుండెను. ఆతనికి భయపడి సమస్త దేవతలు బ్రహ్మకడకుఁబోయిరి. బ్రహ్మ యిట్లనెను:- "దేవతలారా! నేను చెప్పుమాట సత్యము. మీరు మంచి యనుకొనుఁడు చెడ్డయనుకొనుఁడు. నేను రెండు మాటలు మాటలాడువాఁడను గాను. ఆ యసురుఁడు నాచేఁ జావఁడు. విష్ణువుచేతగాని, శివునిచేతగాని చావఁడు. శివుని వీర్యముచే నొక కుమారుఁడు పుట్టెనా ఆతనివలన నీతఁడు చావఁగలఁడు."

అందఱును విని నెత్తిని బాదుకొని యిట్లనిరి:— "శివుఁడు వికారశూన్యుఁడు. విశ్వవిమోహనలగు జగత్తులోని సుందరులలో నేకైక శిరోమణియగు పార్వతి ఆతని సమీపమున నుండి సమస్తవిధముల సమస్త సేవలును జేయుచున్నది, కాని ఆతని మనస్సున నెన్నఁడును స్వప్నమందైనను గామవాసన లేదు. ఇట్టి జితేంద్రియుఁడును వాసనాహీనుఁడు నగు శివునకుఁ బుత్రుఁ డెట్లు కలుగఁగలఁడు? అయినను మనము ప్రయత్నించెదము."

వారందఱును ఆలోచించుకొని దేవతలరాజగు నింద్రుఁడు, వసంతుఁడు, మలయానిలము, రతి మొదలగువారితోఁ గూడుకొని కామదేవుని శివసమాధి భంగమొనర్పఁ బంపెను. ఆతని తపస్సును నాశమొనర్చుటకై కామదేవుఁడు శివుఁడు సమాధి మగ్నుఁడై యున్నచోటునకుఁ బోయెను. కామదేవుఁడు తన సంపూర్ణబలమును వినియోగించెను; కాని శివునిపై నాతని ప్రభావ మేమియును బడలేదు. మన్మథుఁడు తన శక్తినంతను వినియోగించి శివునిఁ దన వశము కావించుకొనఁదలఁచెను గాని ఆతఁడు తన మూఁడవకంటితో మన్మథుని గాల్చి భస్మ మొనర్చెను."

అంత శౌనకుఁ డిట్లడిగెను:— "సూతా! ఇచ్చట నీవు తొందఱగా దాటవేయుచున్నావు. మన్మథు నెట్లు భస్మము కావించినాఁడు? నీ కది యుచితమని తోఁచుచో నీ కథను విస్తారముగ వర్ణించుము."

అంత సూతుఁడిట్లనెను:— "స్వామీ! ఇది చాల ప్రసిద్ధమగు కథ. అయినను నేను దీని వర్ణనము ముందు శ్రీ ప్రద్యుమ్నుని కథాప్రసంగమునఁ గావించెదను. ఇచ్చట శివుఁడు

క్రోధమునఁ గాముని భస్మమొనర్చెనని మాత్రము తెలిసికొని తృప్తినిఁ జెందుఁడు."

శివుఁడు కాముని భస్మమొనర్చినపుడు పార్వతి అచ్చటనే యుండెను. కాముఁడు దగ్ధమైనపుడు శివుని స్వరూపము భయంకరముగ నుండెను. మూఁడవ కన్ను తెఱచునప్పటికి ఒక మహా భయంకర శబ్దము కలిగెను. ఆ శబ్దము దశదిశలును నిండిపోయెను. ఆ శబ్దమును విని శైలకుమారి భయపడెను. ఆమె పరువిడి తన తండ్రియింటికిఁ బోయెను. అందఱామె నోదార్చిరి. కాని యామె శివునిఁ జేపట్టఁదలఁచెను. అందువలనఁ దల్లి దండ్రుల యాజ్ఞను గైకొని అరణ్యమునకుఁబోయి ఘోర తపం బొనర్పఁ బూనెను. ఆమెయొక్క ఘోర తపోఽగ్ని చేఁ ద్రిలోకములలోని జీవులందఱును దగులఁబడుచుండిరి. అందఱును గలిసి బ్రహ్మకడకుఁ బోయిరి. బ్రహ్మ అందఱను దీసికొని విష్ణువు కడకుఁ బోయెను. భగవానుఁ డిట్లనెను:- "నాయనలారా! భయపడవలసిన పనిలేదు. ఇది పార్వతీదేవియొక్క తపోగ్ని. మీరందఱును శివునికడకుఁ బోయి పార్వతిని వివాహమాడు మని ప్రార్థింపుఁడు. గిరిరాజ కుమారియగు కాళికాదేవి శివుని కొఱకే తపస్సు చేయుచున్నది."

అందఱును చేతులు జోడించుకొని భగవానునితో నిట్లనిరి:- "స్వామీ! మేమింకేమైనఁ జేయఁగలముకాని రుద్ర మూర్తియగు శివుని సమీపమునకుఁ బొరపాటుననైనను బోఁ జాలము. ఆతఁడు మన్మథుని భస్మమొనర్చినాఁడు. ఒకవేళ మమ్ములను గాంచుచు మూఁడవ నేత్రమును దెఱచెనా మే మందఱమును భస్మము కాఁగలము."

ఇది విని భగవంతుఁడు నవ్వి యిట్లనెను:- "నాయన భూతేశ్వరుఁడు బోలాశంకరుఁడు. ఆతఁడు స్తుతుల ప్రసన్నుఁడగును. ఖేదమురండు. మీతోఁ బాటుగా రాఁగలను." ఇట్లు పలికి విష్ణువు బ్రహ్మాది సమస్త ం వెంటఁబెట్టుకొని శివుని సమీపమునకుఁ బోయెను. ఁన వారు తపస్సుచేయుచుండిన జగదంబికయగు పార్వ చెను. అందఱును లోలోన నామెకు ప్రణామమును శివుని సమీపమునకుఁ జేరుకొనిరి.

నమస్కార ప్రణామ శిష్టాచారముల అనంతరము భగ ట్లనెను:- "స్వామీ! మేమందఱమును మీ వివాహ ాడఁగోరుచున్నాము. మీ వివాహమును మే మందఱ ప్పడుల్లాసముతోఁ జూడఁగలుగునట్లువర మొసంగుఁడు."

ది విని శివుఁడిట్లనెను:- "స్వామీ! వివాహ జాల న్నేలఁ బడవైచెదరు? తెలిసి తెలిసి దృఢమగు రజ్జు వన్నేల బిగింపఁజూచుచున్నారు. నా కాళ్లకేల నినుప వేయుచున్నారు; నాకు విషమేల యిప్పించెదరు? న్ను మోక్షమార్గభ్రష్టుల నేలచేయుదురు. వివాహ లేదో అన్నియును మఱపునకు రాఁగలవు, జ్ఞాన ములు వాయుసేవనమునకుఁ బోవును. చెవులలోఁ గ్మని ధ్వని పడినదా చదివినదంతయును నేలపాలగును. బ్దములుగల కరకంకణ ధ్వనులతో నొక్కసారి వద్దిం క వేఱొక చేతివంట రుచింపదు. మానవుఁడు మరల గును. స్వాధీన విహితుఁడై పరాధీనుఁడగును. తెలిసి తెలిసి గోతిలోఁ బడఁద్రోసెదరు?"

భగవానుడు నవ్వుచు నిట్లనెను:- "మీరు సదా ముక్తులు. మీకు బంధనమేమున్నది? మోక్షమేమున్నది? నీవు మోక్షదాతవు. ఈ దీర్ఘ జడలపైన బాసికము చాలశోభించును. చంద్రుని కాంతితోఁ బూలమాలలచేఁ గప్పఁడిన నీ మనోహర ముఖము నా మనస్సునకు మహామోదకరముగ నుండును. మీరు మీ కోఱికుగాదు, శైలసుతపైఁ గృపఁజూపి వివాహమాడుఁడు. ఆమె మిమ్ములను బొందుటకే ఘోరతపస్సును జేయుచున్నది. పైఁగా నీ పుత్రుఁ డివలనఁదప్ప తారకాసురుని వధ కాఁజాలదు. కావున ననుగ్రహింపుము. వివాహమును జేసికొనుము; మేమును వివాహమును జేసికొంటిమి."

శివుఁ డిట్లనెను:- "స్వామీ! మీ లీల లపరంపారములు. మీరు వివాహము నొనర్చుకొనియు నవివాహితునివలెనుందురు. కూర్చుండి కూర్చుండి ఒక తోఁకను దగిలించుకొనుట నాకిష్టము లేదు; కాని మీరు రోస్పుకొనకున్న అట్లే చేసికొందును. అన్నియు సిద్ధమొనర్పుఁడు."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! శివుని యంగీకారమును బొంది శ్రీవిష్ణువును; విరించియును అన్య దేవతలును మిక్కిలి ప్రసన్నులై, అందఱును గలిసి మిక్కిలి ప్రేమతో, అత్యంతోల్లాసముతో శివవివాహము నొనర్పఁ బ్రయత్నించుచుండిరి.



31)

# శివ పార్వతీ వివాహము.

(౨౧౪)

శ్లో॥ తమేవ దయితం భూయ ఆవృఙ్క్తే పతిమంబికా ।
అనన్యభావైకగతిం శక్తిః సుప్తేవ పూరుషమ్ ॥

— శ్రీ భాగ. ౪ స్కం. ౭ అ. ౫౯ శ్లో.

వ. "........ విలయకాలంబునం బ్రసుప్తంబయిన శక్తి సృష్టికాలంబున నీశ్వరునిఁబొందు చందంబునఁ బూర్వదయితుండగు రుద్రుని వరియించె."

— శ్రీమదాంధ్రభాగవతము.

---

వస్తువెంత శ్రమచే లభించునో దానిలో నంతటి సుఖము లభించును అతాత్తుగ ననాయాసముగఁ గష్టమేమియును లేక, తపస్సు లేక ఫలము లభించినచో దానియందు ఉత్కంఠాజనితానందము లేదు, ఉల్లాసముండదు, చిత్తమునకు ఏకతానత యుండదు. ధైర్యసంయమములచేఁ జేయఁబడిన చిరకాలీన ఆరాధనము తరువాత ఆశానిరాశల దెబ్బలలోఁ జాలవఱకు ఒక్కొక్క క్షణము ఒక్కొక్క యుగమువలెఁ గడపుచురాఁగా నాతఁడు నిద్రించుచున్నను మేల్కొన్నను, లేచుచున్నను గూర్చుండినను ధ్యానమొనర్చుచు తీవ్రసాధనానంతరమునఁ బ్రాప్తించిన ఫలము, అదిస్వయముగ మధురమైనదైనను జిరకాలీనమైన ఆకాంక్ష దానిమాధుర్యము నినుమడించును. దాని స్వాదమందు దివ్యతను నింపును. అప్పుడే మనతపస్సున కింతటి మాహాత్మ్యము

కలదు. క్షుద్రవికారమునకు వశీభూతుఁడవు కాకుము. ఇంద్రియములను జంచలత్వమున కధీనము కావింపకుము. వెంటనే వివాహ మొనర్చుకొనకుము. ముందుగా వివాహసంబంధ నిశ్చితి మొనర్చుకొని రెండువైపులను నుత్కంఠతను గలుగనిండు. రాత్రులంతయును దారలను లెక్కించుచుఁ గొండలవంటి నిశలను సమాప్తము కావింపనిమ్ము. జగత్తును నా రూపముననే చూచుట కభ్యసింపుము. సాధనానంతరమునఁ బూర్తియైన సాధన దివ్యముగనుండును. ఆ మాదకత శీఘ్రముగ నశింపదు. శివుఁడు విరహియునగును. ఇతరులను విరహాగ్నియందు దపింపఁ జేయును. తపము చేయించును. ఉత్కంఠతను వృద్ధిఁబొందించును, మరల స్వయముగనే సంతుష్టుఁడై వరములొసంగును. క్రీడ, మాయ, కౌతుకము. తారుమారు, ఏదోఅదియే. దాని నిప్పు డేమనవలెను ? ఏమనుటకును వీలులేదు.

శివుని యంగీకారమును విని శౌనకుఁడు సూతు నిట్లడిగెను:- "సూతా ! శివుని చరిత్రము యథార్థమునకు మిక్కిలి సుఖదమును, మిక్కిలి ఆనందప్రదాయకమును, మనోహరమును నై యున్నది. శివుని స్వభావ మెట్టిదో చూడుఁడు. తన యాత్రికులకొఱకు, భక్తులకొఱకు స్వయముగ విరహియయ్యెను. ఆతని నే భావముతో భజించిన నట్టి భావముతో భావితుఁడగును. ఏకారణముచేనైనను గోపమును జెందిన క్షణములోనే సంతోషమును జెందును. అందువలననే ఆతనికి ఆశుతోషుఁడను పేరువచ్చినది. నీవు ఆతనితరువాత చరిత్రను వినిపింపుము. పార్వతీదేవిని పరమేశ్వరుఁ డెట్లు పాణిగ్రహణ మొనర్చినాఁడు? దీనిని నీవు సరసతతో వినిపింపుము."

ఇది విని సూతుఁడిట్లనెను:- "స్వామీ! శివచరిత్రమును యథావత్తుగ సరసతగ వర్ణించుటకు నాలో శక్తియెక్కడిది? యథామతిగాఁజెప్పి నా వాక్కులను బవిత్రము కావించు కొందును. శివచరిత్రమను రససంసర్గముచే నా రసనను సార్థకము కావించుకొందును. దేవతలకంగీకారము నిచ్చినప్పటికిని శివుఁడు వెంటనే వివాహ మొనర్చుకొనుటకు సిద్ధపడలేదు. ఆతఁడు పార్వతీ యుత్సాహము నినుమడించి, ఆమె నిశ్చయమును దృఢము కావించెను. పతియెడల నుత్పన్నమైన నొకానొక నిష్ఠను వృద్ధిగావించెను. ఆతఁడు సప్తమహాఋషులను బిలిచి వారితో నిట్లనెను:- "మీరు గిరిరాజకుమారికడకుఁ బోయి, ఆమె నిశ్చయము దృఢముగనున్నదో లేక దానిలో మార్పే మైనను వచ్చినదో పరీక్షించి రావలయును."

శివుని యాజ్ఞనుబొంది సప్తర్షులు శైలకుమారియగు పార్వతిసమీపమునకు శీఘ్రముగ వచ్చిరి. ఆమె ఘోరతపస్సులో నుండుటను గాంచి యిట్లడిగిరి:- "పుత్రీ! నీ వింతటి సుకుమారివియు, కోమలాంగివయ్యుఁ దపస్సును జేయుచుంటి వేమి?"

అట్లువచ్చుచున్న సప్తర్షులనుగాంచి హైమవతి వారందఱకును స్వాగతసత్కారములను గావించి, నమస్కార మొనర్చి వినీతవచనములతో నిట్లనెను:- "మహాత్ములారా! మీకు స్వాగతము. నేను గిరిరాజగు హిమవంతుని పుత్రికను. అందువలన నన్నందఱును బార్వతియందురు. దేవర్షియగు నారదుని ఉపదేశముచే నేను సదాశివుఁడగు బరమేశ్వరుని భర్తగాఁ బొందుటకై తపస్సు నొనర్చుచున్నాను."

సప్తర్షులిట్లనిరి:- "అమ్మా! నీ వెవరి కౌతుకమాయలోఁ బడితివి? నారదుని మాటలను విశ్వసించు టేమిటి? ఆతఁ డంద అను సన్న్యాసులనొనర్పఁ దిరుగుచుండును. నీకు బ్రదికినన్నాళ్లు పెండ్లికాకుండునట్లును, నీవు కన్యకగనే యుండవలయునని యే, విరాగిణివికావలెననియు నిట్టి మాయమాటలను జెప్పినాఁడు. పారమార్థికుఁడైనను మనస్సులోఁ గామములేనివాఁడును, విశ్వ విజయుఁడగు కామదేవునిఁ గ్రోధమున క్షణములో భస్మమొన రించినవాఁడు నిన్నెట్లు వరింపఁగలఁడు? మానవుఁడు వివాహము కోరికతోఁ జేసికొనును. నిష్కాములైనవారును, ఇహలోక పర లోక కోరికలు లేనివాఁడు వివాహబంధనమున వ్యర్థముగ నేల పడును? వివాహము దృఢబంధనము. జీవులందఱకును ముక్తి నొసంగు యోగేశ్వరుఁడగు శివుఁ డీ మాయాజాలమున నేల పడును? కావున నమ్మా! మా మాటలను వినుము. మేము నీ హితమునుగోరి చెప్పుచున్నాము. సమస్త సుఖోపభోగముల కును యోగ్యమగు నీ సుందర సుకుమార యౌవనావస్థను బ్రాప్తించిన శరీరమును వ్యర్థముగఁ దపఃక్లేశములఁ గృశింపఁ జేయనేల? నీ మనోరథ మసంభవము. అది యే పరిస్థితిలోను నెఱవేరనిది."

దృఢముగ బార్వతి యిట్లనెను:- "అట్లు నెఱవేరకుండిన నేను దీనినిఁ దపస్సు చేయుచుఁ జేయుచు భస్మమొనర్చెదను."

శుష్కహాస మొనర్చుచు సప్తర్షు లిట్లనిరి:- "దీనిచే నేమిలాభము? ఇది మహాపాపయుక్తమగు నాత్మహత్య. నీ విప్పుడింకను జిన్నదానవు. నీకు హితాహితములు తెలియవు. నారదుని వాక్యములందు వ్యర్థవిశ్వాసముంచి నీవు నీ వివాహ

వస్థను దాటఁ గొట్టుకొనుచున్నావు. అమ్మా! ఈ హఠమును వీడుము. ఒకవేళ శివుఁడు నిన్నుఁ బెండ్లాడినాఁడే యను కొనుము, నీ కచ్చట యేమి సుఖము లభింపఁగలదు? ఆతని కిల్లు వాకిలియును లేదు. పర్వతగుహాలోఁ బడియుండవలెను. ఆతనికిఁ గట్టుకొనుటకు వస్త్రము కాని, పరుండుటకు పక్క గాని లేదు. చర్మమును బఱచుకొని మంచులోఁ బడియుండవలెను. ఆతనికి విమానమును లేదు. గరుడుఁడును లేఁడు. ఒక ముసలి యెద్దుమాత్రమున్నది. ఎద్దుమీఁద నెక్కుట పాపము. దాని మీఁదఁ గూర్చుండి తిరుగనలయును. ఆతనికిఁ దల్లిదండ్రులు లేరు. ఒంటరిగానుండువు ఆతఁడు జిల్లేడు, ఉమ్మెత్త, భంగును బీల్చి సమాధిలోఁ గూర్చుండినచో నాతఁ డేవైపునకును జూడఁడు. శ్వాసను దీసికొనఁడు. ఎవ్వరితోడను మాటలాడఁడు. నీ కెట్లుతోఁచును. ఇంతకు నాతఁడేవిధముగను వివాహమును జేసికొనఁడు. ఒకవేళ చేసికొన్నను దుఃఖమే. శివుఁడు సుంద రుఁడును గాఁడు. శృంగారమును విచిత్రముగఁ జేసికొనును. సింహచర్మ ధారణము, చితాభస్మము, ముండమాల, సర్ప ముకుటము, సర్పాభూషణములు. అందులో నేదైన సర్పము బుసకొట్టినదా అప్పుడు నీకు భయము వేయును. ఆతని మణి కట్టులకును, భుజములందును, కంఠమందును, హృదయమందును సర్వత్ర నల్లని విషధర సర్పములు చుట్టుకొని యుండును. నీ వెవరి వలలోఁబడినావు? అమాయకపు పిల్లవు!"

పార్వతీదేవి ఉపేక్షాస్వరమున కాని దృఢముగ నిట్లనెను:— "స్వామీ! ఎట్లనుకొనిన నట్లనుకొనుఁడు. వలలోఁబడినదేమో పడితిని. ఈ వలలోఁబడితినేమో పడితిని, మరల నీవలకు రాఁ

జాలను. ప్రేమబంధము చాల దృఢమైనది. ప్రేమించుండెన్నటికిని నవగుణములు కనఁబడవు. ప్రేమయనునది ఒక అద్దము. దానిని గన్నులకుఁ బెట్టుకొంటిమా అది అందఱను దనరూపముగా వించుకొనును. ఇప్పుడింకొక యుపాయమే లేదు.”

సప్తర్షు లిట్లనిరి:- “ఉపాయమేల లేదు? మేము ఉపాయమును జెప్పెదము. నీవు విష్ణుభగవానుని వివాహమాడ నిశ్చయించుకొనుము. ఈ సంబంధమును గురుర్చు భారము మాపై నున్నది. విష్ణుభగవానుఁడు దేవతలందఱలో శ్రేష్ఠుఁడు. ఎంతో సుందరుఁడు. శివునకు మూఁడు నేత్రములు, పంచముఖములు, పెద్దపెద్దజడలు, కర్ణముల కీ లావుపాటి కుండలములు, ఎఱ్ఱని మత్తులో నున్న కన్నులు. కాని విష్ణుని నేత్రములు కమల సదృశములు. నీ శరీరమునకు వలెనే ఆతనికి నీలకమల సదృశ మగు శరీరఛాయ. శివుఁడు చంద్రునివలె వెలవెల బారి యుండును, విష్ణుని నల్లని అలకావళి యెంతో ప్రియముగ నుండును. ముఖము సౌందర్యమునకు ఉద్గమస్థానము, ఆతని కిరీటమెంతో మనోహరమైనది. కర్ణకుండలములు మిరుమిట్లు గొలుపుచుఁ ప్రకాశించుచుండును. ఆతఁడు గజచర్మమును దాఁకనైనఁ దాఁకఁడు. చక్కని మెత్తని పట్టు పీతాంబరమును ధరించును. విశాలములగు చతుర్భుజములందును సదా శంఖ చక్ర గదా పద్మములను ధరించుచుండును. సర్వదా అలంకారముగ శృంగారించుకొని యుండును. ఆతనికి శృంగారమనిన నెక్కువ యిష్టము. అలంకార మాతనికి మిక్కిలి శోభించును. ఆతని యైశ్వర్యమును గూర్చి చెప్పవలసిన దేమున్నది? లక్ష్మి సదా ఆతని పాదములకడఁ గొఱలాడుచుండును. లక్ష్మీదేవి

సవతియగుటచే నీయెడల నసూయ చెందుననుకొనకుము. ఆమె నీకు దాసియగును. ఆతని గరుడుండు చాల వేగముగ నెగురును. నిన్ను వీపుపైఁగూర్చుండఁ బెట్టుకొని ఆతఁడు వాహ్యాళికి గొనిపోవును. నీవా బూడిద పూసికొని శివసంకల్పమును వీడి, సర్వగుణ నిధానుఁడును, ఐశ్వర్యమునకు స్వామియు, సుఖసాగరుఁడును, సౌందర్యమునకు సాకారస్వరూపమును, సురలకు సర్వేశ్వరుఁడును, బృహద్యశుఁడునగు విష్ణువును నీకు వరునిగఁ జేసికొనుము. ఆతనికి భార్యవగుచో నీవు జగన్మాతవు కాఁగలవు. మేము చాల వృద్ధులము. మేము మా యీ దీర్ఘ గడ్డములను నెండలకుఁ దెలుపు కావించుకొనలేదు. ఈ తెలుపులో ననంతానుభవములు నిండియున్నవి. నీ వింకను జిన్నదానవు. బుద్ధి అపరిపక్వమైనది. హఠములో సత్యమైనదానవు. మా మాటలను విని, యీ వ్యర్థహఠమున కిప్పుడే తిలాంజలుల నొసంగుము. చెప్పుము, గ్రహించితివా ?"

అన్నిటిని విని సతీరూపయగు పార్వతి యిట్లనెను:—
"మహర్షులారా ! ఎవరికి దేనియందు మనస్సు లగ్నమగునో వారికి వానియందు మమకార మేర్పడును. అందఱకును దమ తమ వస్తువులందు ప్రపంచములోఁ బ్రీతియుండును. ఒకానొకనికి కురూపి, ఏకాక్షి, కుత్సితుఁడు, కుపుత్రుఁ డుండియును, ఇతరులపుత్రుఁడు సుందరుఁడు, సర్వాంగపూర్ణుఁడు, సుశీలుఁడు సర్వగుణ సంపన్నుఁడగు సుతుఁడైనను సంతోష ముండదు. వానికి మమత్వము తన పుత్రునియందే యుండును. చాతకము స్వాతిబిందువు కొఱకే సంతోషించును. కలువ చంద్రుని గాంచియే వికసించును. అది మంచును గుఱిసి దానిని మాడ్చిన

మాడ్చుఁగాక ! నా మనస్సు మదనదహనుఁడగు మహేశ్వరునే వరించినది. విష్ణుభగవానుని పాదపద్మములకు నేను శ్రద్ధతోఁ బ్రణామ మొనరించెదను; కాని నేను శివునితప్ప యితర దేవతను గన్నెత్తియైనను జూడఁజాలను. కాముని నాతఁడు దహన మొనర్చినను, ఆతఁ డాతనిని మిత్రునిగాఁ గొనసప్పుడును ఒకేరకముగ నున్నాఁడు. ఆతఁడెన్నఁడును గామవశుఁడు కానే లేదు. నా మనరూపమగు మధుప మాతని పాదపద్మపరాగమందు దొరలాడ నుత్సహించుచున్నది. ఇప్పుడు మీ రిఁక నీ విషయమున నొక్క శబ్దమునైనను బలుకరాదు. నా నిశ్చయము నిశ్చలమైనది. అది యెన్నటికిని మారదు.''

పార్వతియొక్క యీ దృఢనిశ్చయమును గాంచి సప్తర్షులు మిక్కిలిగ సంతోషమును జెంది. ప్రసన్నులై యిట్లనిరి:- ''దేవీ ! నీవు ధన్యురాలవు. నీ యేకనిష్ఠ ధన్యమైనది, శ్లాఘనీయమైనది. శివసంబంధమైన నీ యనురాగ మనుకరణీయమైనది. మేము నిన్నాశీర్వదించుచున్నాము — నిన్నవశ్యము విశ్వనాథుఁడగు శివుఁడు సహచరిరూపమున నిన్ను వరింపఁగలఁడు. ఆతఁ డవశ్యము పతిరూపమునఁ బ్రాప్తింపఁగలఁడు.''

ఇట్లు పలికి సప్తర్షులు శివుని సమీపమునకుఁ బోయిరి. పార్వతి మరలఁ దన తపస్సులో లగ్నమును జెందెను. సప్తర్షుల వలనఁ బార్వతీదేవియొక్క సమాచారమునంతను విని సదాశివుఁడు పరమప్రసన్నుఁడయ్యెను. ఇప్పుడాతఁడు స్వయముగ ఛద్మవేషమునఁ బోయి, తపఃపూతయగు గిరిరాజకిశోరినిఁ బరీక్షింపఁదలఁచెను. ఆతఁడు స్వయముగ నొక జటిల వైరాగి వేషమును ధరించి తపోనిరతయగు పార్వతీ సమీపమునకుఁ

బోయెను. దూరమునుండియే తన యాశ్రమము వైపునకు వచ్చుచున్న నభ్యాగతునిఁ గాంచి నగరాజతనయ లేచి నిలుచుండెను. పాద్యార్ఘ్యాదులచే నా జటిలతపసిని విధ్యుక్తముగఁ బూజించెను. భగవతీపూజను స్వీకరించి యాతఁడు పార్వతి సమాచారము నడిగెను.

సంకేతముగ నా పార్వతి తన సమాచారమునంతను సత్యముగఁ జెప్పెను. విని యా జటిలుఁడు బిగ్గరగ నవ్వెను.

దేవి యిట్లడిగెను:- "స్వామీ! మీరు నవ్వెదరేల?"

ఉపేక్షాస్వరమున జటిలతాపసి యిట్లనెను:— "నేను నీ యమాయకత్వమునకు నవ్వితిని. సమస్తశైలముల కధీశ్వరుఁడగు హిమవంతునకు పుత్రికవయ్యు నింతటి బుద్ధి లేదాయెనేమి యని నవ్వితిని. నీవిట్టి వ్యక్తినిఁ బతిగాఁ బొందుటకు ఘోర తపం బొనర్చుచున్నావు. జాతియందమా ఏ జాతియును లేదు. ఆచారవిచారములు లేవు. సమస్తధర్మరహితుఁడు. గుణహీనుఁడు. పరివారహీనుఁడు, దిగంబరి. నీవా సాధారణపు స్త్రీవి కావు. విశ్వమందలి సమస్తస్త్రీలకు రత్నమవు. సాధారణుఁడగు తండ్రికి కూఁతురవు కావు; రాజరాజేశ్వరుఁడగు గిరిరాజపుత్రివి. మీ తండ్రి యోగ్యుఁడగు వరుని వెదకి ఆతనితో నీకు వివాహము చేయఁగలఁడు. నీకేమి తోఁచుచున్నది? ఇంతమంది సుందరులును సుకుమారులు నగు దేవతలు, నాగులు, గంధర్వాదులను వదలి శివునిఁ బతిగాఁ గోరుచున్నావేమి? ఇది కామధేనుక్షీరములను వదలి అర్కక్షీరములను త్రాగఁబూనినట్లును, గంగాజలమును వదలి క్షుద్రమగు మురుగుగుంటలోని

మలినజలములను బానమొనర్పఁ దలఁచినట్లున్నది. చంద్రుని వెన్నెలను వీడి మిణుఁగురుపురుగు నెవరు కోరెదరు? మణిని వదలి బుద్ధిమంతుఁడగువాఁడు సాధారణమగు గాజుముక్క నెవరు కోరుదురు? మలయగిరి కర్పూరమిశ్రితచందనమును వీడి మురుగుబురద నెవరు పూసికొందురు? తమతమ సుందర గృహములను వీడి ఘోరారణ్యమున నెవఁడు నివసింపఁగోరును? కోకిలశబ్దమునువీడి గాడిదశబ్దము నెవఁడు వినఁగోరును? హల్వా, లడ్డు, రసగుల్లాలను వీడి యెండిన పిష్టపిండములను నంగుష్ఠములతో నెవఁడు మ్రింగును? కమల, గులాబి, చంపకాది దివ్య సుగంధపుష్పము లుండ నుల్లి, ఉమ్మెత్తాది పుష్పముల నెవఁడు వాసనచూడఁగోరును? తాళ, లయ, స్వరాదులతోఁ గూడిన గానమును వీడి ప్రమత్తుని ప్రలాపముల నెవఁడు విని యానందించును? దేవీ! నా మాటను వినుము. ఈ యనుచిత మనోరథమును వీడి సుఖముగఁ దండ్రియింటికడ నుండుము.”

పార్వతి యిట్లనెను:— “తపస్వీ! నీవు నా మనోరథము నేల ననుచితమనుచున్నావు?”

జటిలమహోదయుఁ డిట్లనెను:— “దేవీ! నేను శివు నెఱుఁగుదును. నీ వెఱుఁగని విషయములనుగూడ నే నెఱుఁగుదును. నిన్నెవఁడో ధూర్తుఁడు మోసగించినాఁడు. వయస్సు, కులము, శీలము, సదాచారము, రూపము, సంపత్తి సమానముగ నుండిననే వివాహసంబంధము కుదురును; శోభించును. నీ విప్పుడు చిన్నదానవు, యువతివి. శివుఁడు పురాతనుఁడు, ముసలివాఁడు. నీవు సత్కులమున నుద్భవించిన కుమారివి. అతని కులము విషయము మనకు తెలియదు. నీవు పరమ శీల

పతివి. శివుఁడు మహోద్ధత పరమక్రోధి. నీ వెంతో పవిత్రతతో సాత్త్వికపూజ నొనర్చుచున్నావు. పొగడఁదగిన నీసదాచారము చక్కనిది. శివుఁ డాచారహీనుఁడు. ఎముకలే సొమ్ములు. ముండమాల. చితాభస్మము. రక్తసిక్తమైన గజచర్మము - ఇది ఆతని యాచారము. ఆతని యీ సదాచారమువలననే దక్షుఁ డతనిని, ఆతని సంబంధముచేఁ బూర్వజన్మమున నిన్ను బహిష్కరించినాఁడు. నీ వెంతో సుందరివి. నీ యంగప్రత్యంగములచే సౌందర్యకిరణములు వెల్లుబికి యీ వన్యప్రదేశమునంతను నాలోకమయ మొనర్చుచున్నది. శివుని సంపత్తి నంద తెలుఁగుదురు. ఒక ముసలి ఎద్దు, డమరు - ఇదియే ఆతని సంపత్తి. బిచ్చ మెత్తుకొని పుర్రెలోఁ దినును. నీవు రాజరాజేశ్వరునకు ఏకైక గారాబు ప్రియపుత్రికవు. ఈ హఠమును వీడుము. ఇంకొకరిని నీ పతిగాఁ జేసికొనుము."

ఇప్పుడు పార్వతికిఁ గోపము వచ్చెను. ఆమె యిట్లనెను :- "నీవు సాధువవు కావు. ఎవఁడవో దంభాచారుఁడవు. నీవిట్టి కపటవేషమును వేసికొనినావు. ఓరీ! భాగ్యహీనుఁడా! నీకు శివుని యైశ్వర్య మేమి తెలియును? ఆతఁడు విశ్వబ్రహ్మాండములోని యైశ్వర్యమున కేకైకాధిపతి."

జటిలతపస్వి ధైర్యముతో నిట్లనెను:- "దేవీ! క్రుద్ధవు కాకుము. బాల్యచాంచల్యమున నన్నవమానింపకుము. నేను నీకు హితకరమగు విషయమును జెప్పుచున్నాను. వధూవరులకు సామ్యము లేకున్నచోఁ బ్రేమ వృద్ధిపొందఁ జాలదు. ప్రేమ లేని దాంపత్య జీవనము నరకసమాన మగును. శివునియందును నీయందునుగల లక్షణములన్నియు నసమానములే. చూడుము

నీ నీల అలకావళి, మెడమీఁద వఱకు వ్రేలాడుచు నాగినివలె నున్న వేణి యెంతో సుందరముగను నాకర్షకముగను నున్నది. దీనికి విపరీతముగ శివుని జటాజూటము గడ్డివనమువలెనుండి పక్షులుగూడ గూండ్లు పెట్టుకొనునట్లున్నది. దానిలో గంగ యును విహరించును, పాములును దిరుగును. ఆ జడలన్నియు నేమి? రాక్షస సమూహము. నీపూర్వజన్మపు తండ్రి యజ్ఞ మును విధ్వంసమొనర్చుటకు శివుఁడొక జడ చేతనే సుమేరువు వంటి వీరభద్రుని బుట్టించెను. నీమస్తకమెంతో విశాలమైనది. ఆతని మస్తకమున వక్రుఁడగు చంద్రుఁడు తనయధికారమును గూర్చుకొనెను. అందువలన నాతఁడును వక్రుఁడైనాఁడు. నీ కర్ణములకే కమ్మలెంతో కమనీయముగ నున్నవి. శివుని కర్ణ ములు చీలియున్నవి. అందువలన నాతనిఁ జెవులు తెగినవాఁ డందురు. వానిలోఁ బెద్దపెద్ద గవ్వకుండలములు పడియున్నవి. నీకన్నులెంతో యమాయకముగను, నందముగను మృగము యొక్క కన్నులవలె నున్నవి. శివునకు రెండుకన్నులకు బదు లుగ మూఁడుకన్ను లున్నవి. అవి యెల్లప్పుడు నెఱ్ఱగనుండును. ముఖము కమలముకంటె కోటిరెట్లు కోమలముగను, చంద్రుని [illegible]టె ననేకరెట్లు ప్రకాశవంతముగను, కోటిరతీదేవుల సౌందర్య [illegible]నుగూడ తిరస్కరించుచున్నట్లుండెను. శివున కొక్కముఖము [illegible]దు, ఐదుముఖము లున్నవి. అవైనను చిన్నవి పెద్దవికావు, పెద్ద కొండలంతవి. అవి తలఁచుకొనిన విశ్వబ్రహ్మాండములోని సమస్తప్రాణులను మ్రింగఁగలవు. ముత్యములవలెను, దానిమ్మ గింజలవలెను నీదంతములెంతో మనోహరముగను నుజ్జ్వలము గను నున్నవి. శివుని దంతములు నాఁగలి కొఱ్ఱులవలెఁ దీక్ష్ణ

ములు. ఆ నోటిలో నెవఁడుపడిన వారిని నమలివేయును. నీ యున్నత పీనపయోధరయుక్తమగు వక్షస్థలముపై నానావిధ మణిమౌక్తిక సువర్ణహారములు శోభనొసంగుచున్నవి. శివుని వక్షస్థలము చితాభస్మముచే నలఁదఁబడి అపవిత్రముండమాలా మండితమై యున్నది. నీకరద్వయము మృణాలనాళమువలె నతి కోమలముగను గమనీయముగను నున్నది. శివునకుఁ బది చేతులు గలవు. వానిలో డమరు, ధనుస్సు, ఖడ్గము, బాణము, కపాలము మొదలగు భయంకరములగు వస్తువులు కలవు. ఈ సమయమున నీవు వల్కల వస్త్రములను ధరించినను నీ నిండు పృష్టమగు జఘనభాగమున దువ్వలువలెంతో సుందరముగ నుండును శివుఁడు గజచర్మమును ధరించి ఊరక నున్మత్తుని వలెఁ దిరుగుచుండును. నీచరణము లెంతో సుందరముగను, కోమలములుగను నుండును. శివుని చరణము లేమిటి? పశువు యొక్క గిట్టలవలె నున్నవి. ఆ పాదములలో సర్పములు దాగు కొనునట్లుగఁ బగుళ్ళుండును. చూచుటకు విరూపాక్షుఁడు, మాటలాడుటకు క్రోధి, ఆచారహీనుఁడు, మోహమమతా శూన్యుఁడు, స్నేహరహితుఁడు. ఇట్టి శివుని నీవు వివాహము చేసి కొనఁ గోరుచున్నావు. దీనినిబట్టి నీయదృష్టము బ్రద్దలైపోయిన దని నేననుకొనుచున్నాను. అందుకనియే నీకిట్టి కుబుద్ధిపుట్టినది. అందుకనియే అశుచియు, ఆచారహీనుడును, అఘోరియునగు శివుని వివాహమాడ నిచ్ఛించుచున్నావు."

ఇది విని గిరిజ అత్యంత కుపితయయ్యెను. ఈ శివనింద కుని నాల్కను బెఱికివేయించవలయునని ఆమెకు బుద్ధికలిగెను. కాని బ్రాహ్మణుఁడని విచారించి ఆమె అట్లు చేయజాలక

పోయెను. ఆతనిని మాటిమాటికి అడ్డుపెట్టుచుండెను. చెవులు మూసికొనెను. శివనిందనొనర్చుట అట్లుంచుఁడు, శివనిందను వినుటయును నపరాధమే. అందువలన నామె కుపితయై యా స్థానమును వీడి యింకొకచోటకుఁ బోయెను.

ఆమెకు తనయం దనన్య, అవ్యభిచారిణీభక్తి కలదని శివుఁడు గ్రహించెను. భవానీపతి భక్తికి వశపడును. వెంటనే ఆ జటిలుఁడు ఛద్మవేషమును వీడి సాక్షాత్సదాశివరూపమునఁ బ్రత్యక్షమయ్యెను. ఆతఁడు నవ్వుచు నిట్లనెను:- "దేవీ! నేను నీ ప్రేమను బరీక్షించుటకై వచ్చితిని. నీవు నా కనన్యభక్తవు. నాయందు నీకు బ్రగాఢమగు ననురక్తి కలదు. నీవు నాదానవు. నేను నిన్ను స్వీకరించితిని. ఇఁకను బోవుదముపద కైలాసమునకు."

తన యెదుటకువచ్చిన యిష్టదేవునిఁ గాంచి పార్వతి మాటలాడఁజాలక పోయెను. హర్షవిస్మయానంద లజ్జాది సమస్తభావము లొక్కసారిగా నుదయించుటచే నామె కొంచెముసేపటి వఱకు దిగ్భ్రమను జెందియుండెను. అంత విధ్యుక్తముగ శివునిఁబూజించి, చేతులను జోడించుకొని వినీత వచనములచే నిట్లనెను:- "దేవా! నేనెల్లప్పుడు నీదానను. సదా నీ దాననుగానే యుందును. కాని నేనెట్టి రూపమును ధరించితినో ఆ రూపానుసారముగనే నన్ను వరించుము. ఇట్టె నన్నుఁగొని పోవుటచే మీకును నపకీర్తి కలుగఁగలదు. నా తండ్రికిని నప వాదములు రాఁగలవు; నేనింకను గుమారిని. కుమారి నొసంగుటకును, వివాహమొనర్చుటకును నధికార మామె తండ్రికే కలదు. మీరు మా తండ్రికడకుఁబోయి నన్నడుగుఁడు. మీ రడి

గిన నాతఁడు కాదనఁడు. ఆతఁడు నన్నొసంగుచో మీరు నన్ను లౌకిక వైదిక విధిచే సాంగోపాంగముగ వివాహము చేసికొన వచ్చును. పూర్వజన్మమున మీరు దేవతలనుగాని, గ్రహము లను గాని పూజింపనీకు లేదు. అందువలన మనకిద్దర కిట్టి విరహ దుఃఖము సంభవించినది. ఈసారి అట్లు కారాదు. ఇప్పుడు మీ రందఱను బూజించి విధివిధాన పూర్వకముగ నన్నుఁ బాణిగ్రహణమును జేసికొనుఁడు.”

శివుఁడిట్లనెను:- “నేనెవ్వరి సమ్ముఖమునఁ జేయినిఁ జాచను. యాచించుటయును, నడుగుకొనుటయును నివి యన్నిటి కంటె నీచకర్మలు.”

పార్వతి యిట్లనెను:- “స్వామీ! మీకు ఉచ్చనీచము లేమి కలవు? మీకిది యంతయును గ్రీడ. కావునఁ గ్రీడార్థము గనే నా విన్నపమును మన్నించి మీరీ కార్యమును నవశ్యము చేయుఁడు.”

సదాశివుఁడు సేవకులయిచ్చను సదా పూర్ణముకావించు చుండును. అందువలన నాతఁ డంగీకరించెను. ఇంతలోనే వెం టనే శివుఁడచ్చటికచ్చట నే అంతర్ధానమయ్యెను. పార్వతీదేవికి పరమానందము కలిగెను. ఆమె సఫలమనోరథయై తన తండ్రి భవనమునకు వచ్చెను. తమకుమార్తె వనమునుండి వచ్చుటను గాంచి ఆమె తల్లిదండ్రు లత్యధికానందమును జెందిరి. ఉత్స వము నొనర్చిరి. వివిధవాద్యములు వాయించఁబడెను. అత్యంత మూల్యములగు వస్తువులు దానమొసంగఁబడెను. పార్వతీదేవి యింటికివచ్చి శివుఁడు ప్రసన్నుఁడైన వృత్తాంతమును జెప్పఁగా

తల్లిదండ్రులిద్దరును బరమానందమునుజెందిరి. శివునకుఁ బార్వతి నిచ్చి వివాహము చేయవలయునను నిశ్చయమయ్యెను; కాని శివుఁడు చాలచమత్కారి, ఆతఁడొక నూతన లీలను రచించెను.

హిమవంతుఁడు తన కుమార్తెను శివునకొసంగి వివాహ మొనర్చునను సంగతినిఁ దెలిసికొనఁగానే దేవతలచింతకు మేఱ లేకుండెను. శివమాయకు మోహితులై వారు విపరీతముగఁ దలఁచుచుండిరి. వారిట్లనుకొనిరి:- "సాక్షాద్విశ్వనాథుఁడగు శివునకుఁ గన్యాదానమొసంగి హిమవంతుఁడు తత్కాలము ననే ముక్తినిఁబొందును. ఆతని స్థావరత్వము నశింపఁగలదు. హిమాలయము నశించుటచేఁ బృథివియంతయును నష్టప్రా యము కాఁగలదు. యజ్ఞములు జరుగవు. మనకు హవిర్భాగ ములును లభింపవు. మన మాఁకలిచేఁ జావవలసినదే. కావున నేదో విధముగ శివపార్వతీ వివాహము నాపవలయును."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! స్వార్థపరులు చాల దూర మాలోచించెదరు. ప్రపంచకర్తలము తామే యనుకొను చుందురు. తమ స్వర్థకల్పిత స్వార్థముకొఱకు పరుల మంచి కార్యమును జెడఁగొట్ట నుంకించుచుందురు. దేవతలు తమ యభిప్రాయమును తమగురువగు బృహస్పతికి విన్నవించి యిట్లు ప్రార్థించిరి:- "మీ రేవిధముగనైన వెడలి హిమాలయ మేనా దేవుల సమ్ముఖమున శివనిందనొనర్చి వివాహము నాపుఁడు."

ఇది విని చెవులుమూసికొని బృహస్పతి వారిఁ గసరుచు నిట్లనెను:- "మీరు గొప్పస్వార్థులు. పాం డావలకు. జాగ్రత్త మరల నిట్టిమాటలను నాతో మాట్లాడినచో. ధూర్తులారా!

శివనిందా విషయమున నొకశబ్దము పలికినను నేను వెంటనే ఆ నాలుకనుగోసి పారవేయుట శ్రేయస్కరమని తలఁచుచున్నాను. దేవతల మనోరథము లన్నియును విఫలములైనవి. అచ్చట తమ పప్పులుడకవని తెలిసికొని బ్రహ్మకడకుఁబోయిరి. ఆతఁడు వృద్ధుఁడు - ప్రేమతో నిట్లనెను:- "నాయనలారా! నా వలన నీ పనిగాదు; అది నా వశమునకు మించినది."

దేవత లిట్లనిరి:- "ఇప్పుడు మే మెచ్చటికి వెళ్లఁగలము? మీరే మా కేకైకాశ్రయము. ఇప్పుడు మీరే యేదైన నుపాయము నొనరింపుఁడు."

బ్రహ్మ యిట్లనెను:- "సరియే, నేను నుపాయమును జెప్పెదను. ప్రపంచములో శిష్టసమ్మాననీయ ధార్మికపురుషుఁడెవఁడును శివనిందనొనర్పఁడు. మీరు శివుని శరణు వేడుఁడు. ఆతఁడు శరణాగతవత్సలుఁడు, ఆతఁడు తననిందను దానే జేసికొనుటచే నితరుల కుపకారము కలుగుచో, బుద్ధిమంతుఁడగువాఁడు తన నిందను దాను జేసికొనవలెను. దీనివలన నాతనికి పుణ్యము కలుగును. నిందించువారికి పాపము లభించును. ఈ పనిని శివుఁడే చేయఁగలఁడు."

దేవతలు స్వార్థాంధులైరి. స్వార్థపురుషులు దోషమును జూడరు. దేవతలు శివునికడకుఁ జేరి దూరమునుండియే గొప్పగా నమస్కరించిరి. స్వార్థపురుషులు వగలదండములను బెట్టినచో వీరికేదో గొప్ప స్వార్థముకలదని యెఱుఁగవలయును. సర్వజ్ఞుఁడగు శివున కన్నియును దెలియును. ఆతఁడు నవ్వి యిట్లనెను:- "దేవతలారా! నేఁడు గొప్పగా నమస్కారములు చేయుచున్నారే? మీ కేమి పనికలదో చెప్పుఁడు."

దేవతలు చేతులుజోడించుకొని తమ యభిప్రాయములఁ జెప్పిరి — విని శంకరుఁడు నవ్వి యిట్లనెను:— "ఇదెంతటి గొప్ప కార్యము? నేను వివాహమును జేసికొన నువ్విళ్ళూరుచున్నాను. బ్రహ్మ విష్ణువులును, మీరందఱును గలిసి నా మెడకు నుఱి వేయుచున్నారు. జడుఁడైన యీ హిమాలయుని యమాయుకపు కన్య వ్యర్థముగ హఠ మొనర్చుచున్నది. అందువలన నే ననన్యయనస్కతతో నీమె తల్లి చీదరించుకొని నిందించునట్లు చేయుమనని చెప్పితిని. మేనా హిమవంతునియింట నీ విషయమునఁ గలహము సంభవింపవలెను."

ఇంకేమున్నది ? శివుఁడు జ్యోతిష్కుని వేషమును ధరించెను. పెద్దపెద్ద బొట్లను బెట్టుకొనెను. పట్టుశాలువను గప్పుకొనెను. పసుపుపచ్చని పాగాను ధరించి, స్ఫటికమాలను త్రిప్పుచు మాటిమాటికి 'నారాయణ! నారాయణ!' అని పలుకుచు వెంటనే హిమవంతుని సభకుఁ జేరుకొనెను. అప్పుడు హిమవంతుఁడు తన ఆత్మీయులగు పురుషులతో సుఖముగఁ గూర్చుండియుండెను. పార్వతి ఆతని సమీపమునఁ గూర్చుండెను. దూరమునుండియే పెద్ద బొట్లు పెట్టుకొనిన బ్రాహ్మణునిఁ గాంచి హిమవంతుఁడు శాస్త్రవిధిచే నాతనిఁ బూజించి, రాకకుఁ గారణ మడిగెను."

కపటజ్యోతిష్కుఁ డిట్లనెను:—"ఈ పిల్ల మీపిల్ల కాదా?" ఆపిల్లమాత్రము కపటవేషమున నున్న శివుఁడని నూతనకౌతుకము నొనర్ప వచ్చినాఁడనియు గ్రహించెను.

చేతులను జోడించుకొని హిమవంతుఁడిట్లనెను:—"అవును, స్వామీ! మా పిల్లయే. ఈమె చేతిని చూడుఁడు."

జ్యోతిష్కుఁడు తండ్రియెదుటనే పార్వతీ పాణిగ్రహణ మొనర్చుచు మిక్కిలి ధ్యానముతో నామె రేఖలను జూడ సాగెను. పార్వతీహృదయము ముప్పొంగిపోవుచుండెను. శరీరమంత యును రోమాంచిత మగుచుండెను. ప్రియతముని స్పర్శచే నామె ఆత్మవిస్మృతినిఁ జెందెను. వృద్ధజ్యోతిష్కుఁడు చేతిని తన కన్నులవఱకును గొనిపోయి చూపు బాగుగాఁ గనఁబడనట్లు నటించెను. చూచి పరీక్షించి ఆతఁ డిట్లనెను:- "రాజా! నేనంతయును దెలిసికొంటిని. మీరు నిశ్చయించినది మంచిది కాదు."

కుతూహలముతో గిరిరాజిట్లనెను:- "స్వామీ! నేనేమి నిశ్చయ మొనర్చితిని?"

జ్యోతిష్కుఁ డిట్లనెను:- మీరీ యమాయకపు పిల్ల నొక నిర్గుణ, కులహీన, సదాచార రహితుఁడును, అశుచియును, అఘోరియును, వృద్ధుఁడును, జటాధారియు, రూక్షస్వభావము కలవాఁడును, క్రోధియును, భిక్షగాఁడును, ఇల్లువాఁకిలి లేనివాఁ డును, దిగంబరి, విషభక్షకుఁడు, విభూతిధారి యగు శివుని కొసంగఁదలఁచుచున్నారు. మీరీ పుష్పమువంటి అమాయకపు పిల్ల కన్యాయ మొనర్చుచున్నారు. నిర్గుణుఁడును, నీరసుఁడును నిరాకారుఁడు నగు నా శివునివలన నేమి సుఖమును బొందఁ గలదు?" ఇట్లు పలికి, తన వస్త్రమును దీసికొని శివుఁడు హిమ వంతుని దగ్గఱనుండి వెడలిపోయెను. తన దక్షిణావిషయమును నడుగలేదు. ఆతఁడు దక్షిణకొఱకు రాలేదు. ఆతఁడు కలహ బీజమునను నాటుటకు వచ్చినాఁడు. పరస్పరము కలహములు పెట్టుట ఆతనికి కావలసినది. ఆతని బాణము గుఱిగనే తగిలెను.

తెఱచాటునఁ గూర్చుండి మేన అంతయును విన
జ్యోతిష్కుఁడు వెడలిపోయిన తరువాత మేన
"కాళికా పితా! జ్యోతిష్కుఁ డేమి చెప్పుచున

ఉపేక్షాస్వరమున హిమాచలుఁ డిట్లు
చెప్పును వానినెత్తి. ఏదో దానదక్షిణల క
అవి యివి వాగుచున్నాఁడు. ఈ జ్యోతిష్కులు
చెప్పుచుందురు."

మేన తన మాటమీఁద నిలుచుచు నిట్ల
నేనంతయును వినుచునే యున్నాను. మున
గుణవంతుఁడుగాఁ గనఁబడు చున్నాఁడు. అ
చెప్పినాఁడు. మీరవుననుఁడు కాదనుఁడు.
నాపిల్లను శివున కొసంగను."

ఇది విని కోపముతో హిమవంతుఁ డిట్ల
మాతృదేవి! నీవు గోరంతను గొండంతగాఁ
సూదిని దబ్బన మొనర్చు చున్నావు. వాగున
శివుఁడు మహాదేవుఁడు. మన పిల్లను స్వీకరించు
డంగీకరించుట మన యదృష్టము. కాకున్న న
నకు వివాహాది స్పృహ యేమికలదు?"

మేనాదేవి యిట్లనెను :- "చూడుఁ
వినుఁడు. శివుఁడు మహాదేవుఁడే యగుఁగాక
యింటిలోనే గొప్పదేవతగా నుండనిండు. ఆ
మును మేమేమియును లాగుకొనము. నేన
గూపములోఁ ద్రోయను. నేను తెలిసి తెలి

ములోఁ బడవేయను. ఆమె కనురూపుఁడగు వరుఁడు లభింప కున్నచో మాపిల్ల జీవితాంతము వఱకును గన్యకగానేయుండి యిట్టే తపస్సు చేసికొనఁగలదు. మీరు అదీయిదీ కాదంటిరా నేను నాపిల్లను దీసికొని బావిలో దుమికెదను. లేక గొంతునకు నుఱిపైచికొందును. లేదా తల్లి కూఁతుండ్రము మెడలో బండ లను గట్టుకొని ఆయెదుటనున్న నెత్తైన శిఖరము మీఁదనుండి క్రిందకు దుమికెదము. శివుఁడు సమస్తకల్యాణగుణసంపన్నుఁ డైన నగుగాక నేను మాత్ర మేస్థితిలోను మాపిల్లను నాతనితో వివాహమొనర్ప నిచ్ఛగింపను. నేను చచ్చిపోవుదును; కాని శివునకును నాపిల్లకును వివాహము కానీయను, కానీయను. నీవొక్కసారి కాదు. వేయిమారులు చెప్పుడు, లక్షమారులు చెప్పుడు నేను కానీయను."

సూతుఁ డిట్లనెను :- "శౌనకా! దీనికే స్త్రీహఠ మం దురు. స్త్రీకి మనస్సులో నేదిపడినదో దానినొక చతురస్త్రీ తొలఁగింప వలసినదే కాని కాకున్న బ్రహ్మకూడ స్త్రీలకోడి పోయినాఁడు. హిమవంతుఁడును నామె మాటయే మాటలా డెను. ఆతఁడు పిల్లలకొఱకు తనకాపురము నేలచెడగొట్టు కొనును?"

పార్వతి లోలోన మహాదేవుఁడు గొప్పచతురుఁడు. కూర్చుండీ కూర్చుండి మాయింటిలోఁ గలహబీజమును నాటి నాఁడని నవ్వుకొనుచుండెను. కారణము లేకయే యిచ్చట మహాభారతయుద్ధము చెలరేగెను; కాని ఆమెకు శివుని వాక్యము లందు విశ్వాసము కలదు. తండ్రి యెదుట పాణిగ్రహణ మొన ర్చినవాఁ డిప్పుడు వదలునాయని ఆమెకు విశ్వాసము.

ఇచ్చట శివునకీ సమాచార మంతయును దెలియఁగానే ఆతఁ డిట్లనుకొనెను :- "అయ్యో! ఇది నవ్వులు నువ్వులైనది. నవ్వుచున్నంత వఱకే చక్కిలగింతలు. చక్కిలగింతలోఁ గన్నుల నీరువచ్చుటయు, ఏడ్పువచ్చుటయును మంచిది కాదు. ఏదో విధముగ విషయమును సరిచేయవలయును."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! శివలీలల నెఱిఁగిన వాఁ డెవఁడును లేఁడు. దొంగను దొంగతనము చేయుమనును. రాజుతో మేల్కొనుమని చెప్పును. తానే నిప్పుపెట్టి, తానే ఆర్పుటకుఁ బరువిడును. ఆసమయమున నాతఁడు సప్తమహర్షులను స్మరించెను. స్మరింపఁగానే అరుంధతీ సహితముగ సప్తర్షులు శివుని సమీపమునకు వచ్చిరి. అప్పుడు శివుఁడు వారితోఁ నిట్లనెను:- "ఋషులారా! మీరు వెంటనే శైలరాజగు హిమవంతుని కడకు బోవలయును. ఆతనికి మీరు నచ్చఁజెప్పి మా సంబంధమును స్థిరమొనర్పుఁడు. హిమవంతుఁడు మీరుచెప్పిన వినఁగలఁడు; కాని ఆతని భార్య మీరుచెప్పినను వినదు. ఆమెకు పతివ్రతా శిరోమణియగు నీయరుంధతి నచ్చఁజెప్పఁ గలదు. చూడుఁడు. మీరు వారినిఁ జిక్కులలోఁ బడవేయకుఁడు. సామ, దాన, భేద, దండోపాయముల ద్వారా త్రోవకుఁ దీసికొని రండు." వివాహములోని పిండివంటల రుచిచూచుట కందఱి నోళ్లలో నీరూరుచున్నది. అందువలన నరుంధతీ సహితముగ సప్తర్షులు హిమవంతుని కడకుఁబోయిరి. హిమవంతున కన్నియును దెలియును. అందువలన నాతనికి జెప్పుట కేమంతశ్రమ పడవలసిన పనిలేకుండెను; కాని మేనాదేవినిఁ ద్రోవకు దీసికొని వచ్చుట కష్టము. అస్తు. అరుంధతీదేవి అనేకములగు నితిహాస

ములను, గథలను జెప్పి ఆమెనుగూడ నంగీకరింపఁజేసి త్రోవకుఁ దెచ్చెను. వివాహ విషయమును గట్టిచేసి సప్తర్షులు శివుని కడకుఁ బరువిడివచ్చి రొప్పుచు రొజుచు నిట్లనిరి:- "స్వామీ! ఇప్పుడాలస్య మొనర్చినచో నంతయును గందరగోళమై పోఁగలదు. తాళి మెడలోఁ బడనంతవఱకు పిల్ల పుట్టినింటిదేయగును. మనస్సెప్పుడు తిరుగునో తెలియదు. కావున దేవా! శుభస్య శీఘ్రమ్! మీరిప్పుడు వెంటనే తొందఱపడవలయును. స్త్రీల మతి చంచలముగనుండును. మేనాదేవి యింకెవరైన మోస మొనర్చి పెడదారినిఁ బట్టించిరా జీవితకాలమంతయును వివాహము లేకయే యుండవలసి వచ్చును." శివుఁడు ఇప్పటికి చాల ఆలస్యమైనది. పార్వతి అత్యధిక ఉత్కంఠతతో నున్నదని తలఁచి సప్తర్షులతో నిట్లనెను:- "మహర్షులారా! మాకింకను నిశ్చిత పురోహితుఁడు లేఁడు. క్రొత్తపెండ్లి, నేనిట్టి వివాహమెన్నఁడును జేసికొననే లేదు. వివాహమందేమి చేయవలసి యుండును?"

సప్తర్షు లిట్లనిరి:- "స్వామీ! మీరీ వివాహములను మిక్కిలి యీడు జోడుగను వైభవముగను జేయవలయును బ్రహ్మ, విష్ణు, దేవేంద్రాది సమస్త లోకపాలురను, సమస్త దేవోపదేవతలను బిలువవలయును. హిమవంతుఁడు నిర్ధనుఁడ కాఁడు. కైలాసమందు బాగుగ వైభవముగ నుండుఁడు."

ఇదివిని నవ్వుచు శివుఁ డిట్లనెను:- "మంచిది, ఈవివాహ మందిప్పుడు మీరందఱును మీయిష్టము ప్రకార మొనర్చుఁడు.' ఇదివిని పరమహర్షమును జెందుచు సప్తర్షులు తమతమ లోకములకుఁ బోయిరి."

ఇచ్చట హిమవంతుఁడు తమ జాతివారిని, సంబంధులను బిలుచుకొనెను. హిమవానుని యాహ్వానము ననుసరించి, ఉదయాచల, అస్తాచల, మలయ, మంగళప్రస్థ, త్రికూట, ఋషభ, కూటక, కోల్లక, సహ్యా, దేవగిరి, వింధ్యాచల, శక్తిమంత, ఋక్షగిరి, పారియాత్ర, ద్రోణ, చిత్రకూట, గోవర్ధన, రైవతక, కకుభ, నీల, గోకాముఖ, ఇంద్రకీల, కామగిరి మొదలగు వేలకొలఁది, లక్షలకొలఁది పర్వతములు మిక్కిలి వైభవముగ వచ్చెను. నదులన్నియును దివ్యదివ్యరూపములనుధరించి పార్వతీ వివాహమును జూడవచ్చెను. వానిలో గంగా, యమునా, సరస్వతీ, చంద్రవశా, తామ్రవర్ణి, అవటోదా, కృతమాలా, వైహాయసీ, కావేరి, వేణీ, పయస్వినీ, శర్కరావర్త, తుంగభద్రా, కృష్ణా, వేణ్యా, భాగీరథి, గోదావరి, నిర్వింధ్యా, పయోష్ణీ, తాపీ, రేవా, సురసా, నర్మదా, చర్మణ్వతీ, సింధు, మహానదీ, వేదస్మృతి, ఋషికుల్యా, త్రిసామా, కౌశికీ, మందాకినీ, దృషద్వతీ, గోమతీ, సరయూ, రోధస్వతీ, సప్తవతీ, సుషోమా, శతద్రు, చంద్రభాగా, మరుద్వృధా, వితస్తా, అసిక్నీ, విశ్వా మొదలగునవి ముఖ్యములు. ఇట్లు లక్షలకొలఁది కోట్లకొలఁది నదులు వచ్చెను. సమస్త వృక్షములు మొదలగునవియును వచ్చెను.

హిమవంతుఁ డందఱ యభిప్రాయములను గైకొని శివుని కడకు లగ్నపత్రికను బంప నిశ్చయించుకొనెను. వివాహ శుభ ముహూర్తమును సప్తర్షులు నిశ్చయించి వెడలిరి. ఇప్పటికి వివాహ మింక నేడుదినములు మాత్రమే యుండెను. అందువలన శుభలేఖలు, లగ్నపత్రిక ఒక్కసారియే వ్రాయఁబడెను

వృద్ధుఁడగు గర్గునిఁ బురోహితునిఁగఁ బిలిచిరి. శుభలేఖ వ్రాయఁ బడిన తరువాత వస్త్రాభరణాలంకృతయై పార్వతి మండపము లోనికి వచ్చెను. విధ్యుక్తముగఁ బూజను జేయించి కన్యక చేతిమీఁదుగా లగ్నపత్రికను దాఁకించి వినిపించిరి. స్త్రీలందఱు నిట్లడిగిరి:– 'తలంబ్రాలెన్ని?' పురోహితుఁ డైదుతలంబ్రాలని చెప్పెను. అంత మేనాదేవి యిట్లడిగెను:– "పసుపుకుంకుమ పంచు టెప్పుడు? పండ్లు పంచు టెప్పుడు? గీత మే దినమున నారంభమగును? కంకణబంధన మెప్పుడు? మండపారాధన మెప్పుడు?" ఈ విష యముల నన్నిటినిఁ బురోహితుఁడు చెప్పెను. అంతఁ బత్రిక మీఁద కుంకుమ చల్లఁబడినది. పసుపుతో స్వస్తికము లిఖింపఁ బడినది. దూర్వాక్షత, పోకల నుంచి పసుపుదారమును జుట్టి శ్రీఫలమును దక్షిణనొసంగి, వడిలోఁ బత్రిక నుంచి, దానినిఁ బూజచేయించి బ్రాహ్మణునిచేత శివునికడకు పత్రిక పంపఁ బడెను.

శివునికడఁ బండిత పురోహితులు లేరు. తానే దానినిఁ జదువుకొని నవ్విరి. ఇంతలోనే వీణను వాయించుచు, హరిగుణ గాన మొనర్చుచు నారదుఁడు వచ్చెను. నారదునిఁ గాంచి శివుఁడు నవ్వి మిక్కిలి స్నేహముతో నిట్లనెను:– "వహ్వా నారదా! నీవు సమయమును జారవిడువవు. సరిగా సమయ మున కరుదెంచితివి."

నారదుఁ డెఱుఁగనివానివలె నిట్లడిగెను:– "స్వామీ! ఏదియో చదువుచున్నారే?"

శివుఁడు నవ్వుచు నిట్లనెను:– "నారదా! అన్నియును నీవు నాటిన విత్తనములే. పైఁగా నడుగుచున్నావు. నీవు

పంచాక్షరీ మహామంత్రము నిచ్చి పంపించిన శిష్యురాలికిని నాకును వివాహము.''

ఇది విని నారదుఁ డిట్లనెను:- ''స్వామీ! మంచిది. తినుటకుఁ బిండివంటలు లభించును. నేఁటివఱకు నే నెన్నడును బెండ్లికి పోలేదు. నాకా కోరికయును దీరిపోఁగలదు.''

ఇది విని తన గడ్డమును నిమురుకొనుచు శివుఁడిట్లనెను:- ''నాయనా! ఒకటి పని చేయవలయును. వివాహప్రయత్న మొనర్పవలయును. రాజుకడకు వివాహమునకుఁ దరలిపోవలసి యున్నది. వైభవముగఁ బెండ్లివారితోఁ దరలిపోవలెను.''

నారదుఁడు లగ్నపత్రికను దెచ్చిన పురోహితునితో నిట్లనెను:- ''పెండ్లికి ఎందఱతో రమ్మన్నారు?''

ఇది విని పురోహితుఁడు కొంచెముగఁ గోపమును బ్రదర్శించుచు నిట్లనెను :- ''స్వామీ! ఇట్టివి అడుగవలసినది దరిద్రులను. మా రాజుగారికి కొదువేమియు నుండదు. మీరెంత మందితోనైనను రావచ్చును.''

ఇది విని నారదుఁడు నవ్వెను. శివుఁడు మామగారికి గొప్పఁదనము తేఁదలఁచి యిట్లనెను:- ''పురోహితమహాశయా! ఈ నారదున కెన్నఁడును వివాహము కాలేదు. ఈతఁడట్లే యనుచుండును. మీరు కోపగించుకొనకుఁడు. అందఱకును నా శ్రీరామస్మరణములను జెప్పవలెను. సమస్త దేవతలతో రాఁగలమని గిరిరాజుతోఁ జెప్పుఁడు.'' ఇది విని పురోహితుఁడు శివునకును నారదునకును బ్రణామము కావించి హిమవంతుని కడకుఁబోయి సమస్తవృత్తాంతమును జెప్పెను. సమస్త దేవతలు

రాఁగలరను సమాచారమును విని గిరిరాజింక నధికముగఁ బ్రయత్న మొనర్చుచుండెను. పర్వతముల నన్నిటినిఁ బిలిచి ఆతఁ డిట్లనెను :- "పర్వతములారా! మంచి ఫలవృక్షము లెన్నికలవో వానినన్నిటినిఁ బిలువుఁడు. జనవాసములలో సదా పక్వములైన స్వాదిష్టఫలములను వర్షింపజేయవలయునని చెప్పుఁడు." వంటవారికిట్లు చెప్పవలయును:- "పులుపు, తీపి, ఉప్పు, వగరు, కారము, చేదుతోఁగూడిన షడ్రసయుక్తములగు పదార్థములన్నిటిని దయారు చేయవలయును. లేహ్య, చోష్య, పేయ, ఖాద్యములలో నెన్నికలవో వానినన్నిటినిఁ జేయవలయును." నదుల కిట్లు చెప్పెను :- "కొందఱు పాలై పాఱవలెను. కొందఱు ఘృతముగను, కొందఱు మధువుగను, కొందఱు పెరుగుగను బాఱవలయును. అందఱును జేయిచేసికొను నట్లుగ నుండక, అందఱిముఖములలో బ్రవేశించు నట్లుండవలెను. చాలనదులు క్షీరాన్నమును బ్రవహింపవలెను. పైకి జలముగఁ గనఁబడవలయును. లోనపాయస ముండవలెను. దేవతలు స్నానముచేయుటకు మునుఁగఁగానే వారి నోటిలోనికి వెంటనే పాయసము పోవలెను. చాలవృక్షములు హలువాలు పడవేయ వలెను. వారు నిద్రపోవుచుండ హలువాతోఁ గప్పఁబడ వల యును. చాలనదులు పాలుపెరుగులు, పచ్చళ్లు వడ్డింపవలసిన యవసరము లేకుండునట్లు వారికడకుఁ బోవలెను. కొన్నినదులు జిల్లేడు, ఉమ్మెత్త, భంగు వృక్షములను బిండిచేసికొనుచుఁ బ్రవహింపవలెను. అవసరమునుబట్టి ఆ మడ్డినీటినిఁ బాలలోఁ జక్కెరతోఁ గలుపుకొని వెంటనే భంగుత్రాగున ట్లుండవల యును. శివుని భూతప్రేతపిశాచములు ఇష్టమువచ్చినట్లు భంగు

ప్రాఁగవచ్చును. ఈవిధముగఁ బెండ్లిమర్యాదల కేర్పాటుచేసి గిరిరాజు విశ్వకర్మను బిలిపించి దివ్యాతిదివ్యమంటపమును, జన వాసమును నిర్మింపఁజేసెను. అన్నిటియందును వేలువేలుగఁ బరుపులు దిండ్లు ఉంచఁబడెను. ఒక్కొక్క దేవతకు వందమంది యప్సరసలను నియమించెను. నానావిధములగు కట్టుగుడ్డల తోడను, గప్పుకొను దుప్పట్లతోడను, ఆహారపానీయముల తోడను నింపివైచెను. వివిధప్రకారములగు నేర్పాట్లు గావించుటకై సమస్తపర్వతములకు సమస్తకార్యములు ఒప్పగింపఁ బడెను.

ఇచ్చట శివుఁడు నారదునితో నిట్లనెను:- "నారదా! నీవిపుడు కొన్ని యేర్పాట్లు కావింపవలయును."

నారదుఁడిట్లనెను:- "స్వామీ! మీరెట్లాజ్ఞాపించిన నట్లు చేయుదును." శివుఁడిట్లనెను:- "అన్నా! ఆజ్ఞ నిచ్చువాదెవరు? నీ పనియే యిది. వైకుంఠమునుండి విష్ణువును, బ్రహ్మలోకము నుండి బ్రహ్మను, స్వర్గమునుండి యింద్రుని, అష్టదిక్పాలురను, యక్ష గంధర్వాదులందఱను బిలువవలెను. అందఱను వారి వారి భార్యాబిడ్డలతో రమ్మని చెప్పవలెను. ఎవరురారో వారిని నేఁటినుండి పంక్తిబాహ్యులను గావింపఁగలము."

నారదుఁడిట్టి కార్యములకు నడుము కట్టుకొని కూర్చుండును. ఆతనికి కాలునిలువదు. కాని యందు నుడియున్నది; నిమిషములో సమస్త లోకములఁ జాటించి వచ్చెను. "శివ వివాహమున కందఱకు నాహ్వానము. అందఱును దప్పక రావలయును." అని కేక వేసెను. వైకుంఠము, బ్రహ్మలోకము

స్వర్గలోకము, మహర్లోకము మొదలగువాని నన్నిటిలోఁ నేక
వేసి నిమిషములో శివుని కడకు వచ్చెను. ఇప్పుడు పెండ్లివారు
వచ్చుట ప్రారంభమయ్యెను. అందఱును దమ తమ భార్యా
బిడ్డల తోడను, సేవకులతోడను, సేనలతోడను గైలాసమునకు
వచ్చిరి. లక్ష్మీదేవి వచ్చి శివునకుఁ దలయంటి నలుఁగు పెట్టెను.
సమస్త దేవతాస్త్రీలు వివాహ ప్రయత్నములన్నియును గావిం
చిరి. పితర దేవతల పూజనము కావించెను. చాముండాదేవి
నారాధించెను. విష్ణువు నవ్వి యిట్లనెను:- "స్వామీ! ఇప్పుడు
మీరు వివాహమగునంతవఱకు మహాదేవత్వమును మఱచి
పొండు. నూటికి నూఱుపాళ్లు పెండ్లికొడుకు కండు. ఏలననఁగా
మీరెట్టి యాచరణమును గావించెదరో లోకమున కదియే
ప్రమాణము కాగలదు. లోకము దాని ననుసరించెదరు."

ఇది విని శివుఁడు నవ్వుచు నిట్లనెను:- "స్వామీ! మీ
రెట్లు చెప్పిన నిప్పుడట్లే చేయుదును. పెండ్లి పెత్తనము నీవే
చేయవలయును."

శివుని యంగీకారమును బొంది భగవానుఁడు అత్రి, వశిష్ఠ,
వామదేవ, పులహ, క్రతు, భృగు, అంగిర, జాబాలి మొదలగు
గొప్ప వేదజ్ఞులను, ఋషులను, మహాత్ములను బిలిపించెను. అంద
ఱును స్వస్త్యయనాది వైదిక కర్మల నొనర్చిరి. శివుఁడందఱి
చరణములకును బ్రణామ మొనరించెను. అందఱును బ్రసన్నులై
యాశీర్వాదముల నిట్లొసరించిరి:- "ఇంటిలోఁ గులుకుచు, ఘణ
ఘణమను శబ్దము నొనర్చుచుఁ దిరుగు పెండ్లికుమారుఁడు లభింపఁ
గలుగు" ఈ విధముగ సమస్త లౌకిక వైదిక కృత్యములైన
తరువాత శివుఁడు పెండ్లికి బయలుదేరెను."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! మీ రెప్పుడైన నే పెండ్లికైనఁ దరలిపోయినారా? మీరు చిన్నతనముననే విరాగులైతిరి. పెండ్లికి దరలి పోవుటకుఁ బిల్లలకును, వృద్ధులకును, నందఱకును నుత్సాహముగ నుండును. వివిధములగు బిండివంటలుండును. ఎంత గంభీరమగు పురుషుఁడైనను సరియే పెండ్లివారింట నీరు ద్రాగిరా వారికి మత్తెక్కును. వివాహమంటపు నలువైపులను వైభవమే యుండును. సరసత సజీవమై విచరించును."

అందఱును గొప్పవైభవముతో బయలు దేరిరి. విష్ణు భగవానుఁడు పరిహాసప్రియుఁడు. అతఁ డిట్లనెను:- "స్వామీ! మీ సేన అందఱకంటె ముందు పోవలెను. మీ గణములే మీకు శృంగార మొనర్ప వలయును." శివుఁ డిప్పుడు పెండ్లి కొడుకు. పెండ్లికొడుకుచే దేనినైనఁ జేయింప వచ్చును. గుంట్రాయినిఁ బూజింపఁ జేయుదురు. నూపమును దినిపించెదరు. పెండ్లికూఁతురు పాదములను బట్టించెదరు. శివుఁడు 'చిత్త' మనెను. ఇప్పుడు శివగణములు శివునకు శృంగార మొనరించుచుండిరి. జడలను సరిచేసి చుట్టి, సర్పములను ముకుటముగ నొనర్చి, కపాలమాలను ధరింపఁ జేసిరి. ఆభూషణములకు బదులుగా వ్యాళములను జుట్టి యెద్దుమీఁద నెక్కించి ముందుంచిరి, ఆతని వెనుక నల్లగను, గరాళ ముఖములతో నుండు శాకినీ, డాకినీ, శాంకినీ, భూతనీ, పిశాచనీ, చాముండా, రేవతీ, పూతనలు ఆడుచుఁ బాడుచు హాహాహూఁహూఁ యని పలుకుచుఁ బ్రచుండిరి. భూత, ప్రేత, పిశాచ, బధిరాంధ, కుబ్జ, పంగు, గాతముగనుండు వారును, ఏక పాదులును, బహుపాదులును,

బహు శిరస్సులు కలవారును, శిరస్సు లేనివారును, నల్లనివారును, తెల్లనివారును, నెఱ్ఱనివారును, భయంకర మూర్తులును, పొట్ట పొడుచుకొనివచ్చిన వారును, నాలుకను వ్రేలాడ వేసి కొనువారును, చప్పరించువారును, వివిధములగు వాహనముల నెక్కిపోవుచుండిరి. వెనుక సమస్త దేవతలు తమతమ వాహనములను విమానములను నెక్కి వివాహమునకుఁ దరలి పోవుచుండిరి.

గిరిరాజగు హిమవంతుఁడు మిక్కిలివైభవముగ స్వాగత సత్కారము లొసంగి విడుదులొసంగెను. శివుని యీ రూపమును గాంచి గ్రామ నగరములలోని బాలబాలికలు మిక్కిలి భయభీతులైరి. భూతములను గాంచి అందఱును భయపడిరి. శివుని యీ వికరాళ రూపమును గాంచఁగానే అందఱకును ధైర్యము వీడిపోయెను. ఈ సమయమున శివుఁడు పంచముఖములతోడను, దశహస్తములతోడను నుండెను. గజచర్మమును ధరించెను. కపాలమాలను, శరీరమునిండఁ జితాభస్మమును ధరించెను. పెండ్లివారు జనవాసమునకుఁ బోవుచుండగా మేనాదేవి యుత్సాహముతో నారదు నిట్లడిగెను:– "నేను పెండ్లికొడుకును జూడఁగోరుచున్నాను. నారదా! ఇందులోఁ బెండ్లి కుమారుఁ డెవరు?"

నారదుఁ డిట్లనెను:– "మహారాణీ! ఐదుముఖములు కలిగి యెద్దుమీఁదఁ గూర్చుండినవాఁడే నీ పిల్లకు మగఁడు." ఇది వినఁగానే మేనాదేవి దుఃఖమున మూర్ఛిత యయ్యెను. క్రోధకారణమున నామె పెదవు లదరసాగెను. ఆమెయిట్లనెను:– "ఈ సప్తర్షులు నన్ను మోసగించినారు. వారంద ఱిప్పుడు నాకుఁ

గనఁబడిరా వారి గడ్డముల నన్నిటినిఁ బెఱికివేయుచును. ఇట్టి భయంకర భూతనాథునితో మా సుకుమారి కుమార్తెకు హాశ్చ ముగ సంబంధము కుదిర్చినారు.''

నారదుఁ డింకఁ గొందఱు ఋషులను మహర్షులను బిలుచుకొనివచ్చెను. సప్తర్షులును వచ్చిరి. శివుఁడు తనమాయచే నిట్టి రూపమును ధరించెనని అందఱును మేనాదేవికి చెప్పిరి. 'నీవు కల్యాణసమయములోఁ జూడు మెంతటి సుందరరూపమును ధరించునో' అని నచ్చఁజెప్పిరి.

ఏదోవిధముగ నందఱును మేనాదేవికి నచ్చఁజెప్పిరి. అంత ద్వారపూజ జరిగెను. మేనాదేవి రత్నపళ్లెరమున హారతి యొసంగెను. దేవతలతోఁగూడి శివుఁడు మండపమునఁ బ్రవేశించెను. నియతలగ్నమున వేదజ్ఞులగు బ్రాహ్మణులు పార్వతీ పరమేశ్వరులకు వివాహ సంస్కారమును గావించిరి. అంత సమస్తగ్రహ దేవతాది పూజనమైన తరువాతఁ గల్యాణ సమయము సమీపించెను. పార్వతీ పరమేశ్వరుల కొంగులను ముడివైచి స్త్రీలు లోనికిఁ గొనిపోయిరి.

స్త్రీలందఱును గుమికూడిరి. సరస్వతి, లక్ష్మి, శచీదేవి, ఇంకను మేనాదేవియొక్క సంబంధులగు స్త్రీలు వచ్చి హాస వినోదము లొనర్చి శివుని బాగుగాఁ బరిహాస మొనర్చిరి. కాని శివుఁడును దక్కువవాఁడు కాఁడు. ఆ సమయమున రతీదేవి వచ్చి తన పతియగు గాముని జీవితు నొనర్పఁ బ్రార్థించెను. వివాహసమయమున శివుఁడు కాముని నొకవిధముగఁ బ్రదికించెను. అనేక భోజ్యపదార్థములతో సారెలు పెట్టిరి. రెండు మూఁడు దినములు మిక్కిలి వైభవముగఁ బెండ్లివారుండిరి.

యథేష్టముగ హాస్యవినోదాదులు జరిగెను. హిమవంతుఁడు వచ్చిన పెండ్లివారందఱకును యథాయోగ్యముగ స్వాగత సత్కారములను గావించెను. అందఱును గిరిరాజు సత్కార ముచే నత్యధికముగ సంతుష్టులైరి. చివర కంపకాలసమయము సమీపించెను. మేనాదేవి తన కుమార్తెకు పాతివ్రత్యమునకు సంబంధించిన బుద్ధులు చెప్పెను. పార్వతీదేవి భర్తతో వెడలు నప్పు డందఱ నాలింగనమొనర్చుచుఁ గన్నుల నీరు నించెను. తల్లిదండ్రులు తమ ప్రియపుత్రికను హృదయపూర్వకముగఁ గౌఁగిలించుకొని వీడ్కోలు సలిపిరి. శివుఁడు తన ప్రియను వెంటఁబెట్టుకొని కైలాసమునకు వచ్చెను. పెండ్లివారిండ్ల ముఖ ములను బట్టి తమతమస్థానములకుఁ బోయిరి. శివుఁడు పార్వ తితోఁ గైలాసముననుండి వివిధప్రకారములగుఁ గ్రీడ లొనర్చు చుండెను. అనేకప్రకారములగు హాస్యవినోదము లొనర్చుచుఁ దన ప్రాణప్రియయగుఁ బార్వతిని సంతోషపెట్టుచుండెను."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! నే నిప్పుడు మీ కత్యంత సంక్షేపముగ శివవివాహ ప్రసంగమును వర్ణించితిని. శివచరిత్ర అనంతమైనది. దానిని విస్తారపూర్వకముగ వర్ణించు టకు చతుర్ముఖుఁడగు బ్రహ్మకుగాని సహస్రముఖుఁడగు శేషు నకుఁగాని సాధ్యముకాదు. దీని నెవరు శ్రద్ధగా వినెదరో వారికి శివుని కృప కలుగును. చివరకు పరమపదమున కధికారు లగుదురు."



# పరమపవిత్ర శివచరిత్రోపసంహారము.

## (౨౧౬)

శ్లో॥ ఇదం పవిత్రం పరమీశ చేష్టితమ్
యశస్య మాయుష్య మఘౌఘ మర్షణమ్ ।
యో నిత్యదాకర్ణ్య నరోఽను కీర్తయేత్
ధునో త్యఘం కౌరవ భక్తి భావతః॥
— శ్రీభాగ. ౪ స్కం. ౭ అం. ౬౧ శ్లో॥

కం. ఈ యాఖ్యానముఁ జదివిన
ధీయుతులకు వినినయట్టి ధీరుల కైశ్వ
ర్యాయుః కీర్తులు గలుగును
బాయును దురితములు దొలఁగు భవబంధంబుల్.
— శ్రీమదాంధ్రభాగవతము.



శక్తిసహితముగ శివుఁడీ ప్రపంచమున సర్వత్ర సరసక్రీడ నొనర్చుచున్నాఁడు. శివశక్తులు సర్వత్రవ్యాపించి యున్నారు. స్త్రీ సంజ్ఞకలవారందఱును శక్తులు. పురుషసంజ్ఞకులందఱును శివలీలయే. ఈ విధముగ శివున కనంతరూపములు కలవు. అనంత రూపమందు వారసంఖ్యాకములుగ నగణితములుగ లీలల నాది కాలమువఱకు జరుపుచునేయుందురు. దానికాది లేదు, మధ్యము లేదు, అంతములేదు, దిక్కునులేదు. దివాణమునులేదు. ఆతఁ డేది చేసినను సంభవమే. ఆతని లీలల కసంభవమనునది లేదు. ...ఁడు కర్మాధీనుఁడై - ప్రారబ్ధవశుఁడై కార్యముల నొనర్పఁడు. ...ఁడు కర్మనియామకుఁడు. ప్రారబ్ధవిధాత. జీవుల కీశ్వరుఁడు.

ఆతఁడు స్వేచ్ఛచే వినోదముకొఱకు కాళికా శివాదేవిని గ్రహించి క్రీడించును.''

సూతుఁ డిట్లనెనుః- "మునులారా! కాళికాదేవి మరల గిరిజా పార్వతీరూపమున నెట్లు శివునిఁ బెండ్లిచేసికొనినదియు నే నతిసంక్షేపముగ మీ సమ్ముఖమున వర్ణించియుంటిని. ఇప్పుడు మీరేమి వినఁగోరుచున్నారు?''

శౌనకుఁ డిట్లడిగెనుః- "సూతా! నీవు పార్వతీదేవిని మాటిమాటికి కాళీ, కాళీయని సంబోధించుచున్నావు. ఇదివ ఱలో నీ వామె శ్రీయంగములను వర్ణించుచు నీలకమలమువంటి రంగుకలదని చెప్పియుంటివి; కాని మేము సదా పార్వతి గౌర వర్ణయని వినుచున్నాము. అందువలననే శివుని గౌరీశంకరుఁడను చుందురు. ఈ రెంటివిషయములకు విరోధము కలుగుచున్నది. మా యీ శంకకు సమాధానము కావలెను.''

ఇది వినగానే సూతుఁడు బిగ్గఱగ నవ్వెను. ఆతఁడు నవ్వుచుఁ గ్రిందఁబడి దొరలసాగెను. ఆతఁడు నవ్వుటనుగాంచి శౌనకుఁ డిట్లడిగెనుః- "స్వామీ! నీ వింతగా నవ్వుట కే కథ జ్ఞాపకమునకు వచ్చినది?''

తన నవ్వునాపుకొని, ఆచమనముగావించి సూతుఁ డిట్ల నెనుః- "మునులారా! ఇప్పుడు మీ కేమి చెప్పఁగలను? మీ రందఱును సాధువులు. మీ రెన్నడును వివాహమును జేసి కొననులేదు, పెండ్లికిని వెడలలేదు. గృహస్థుల మొగతాళి పరి హాసములు మీ కేమి తెలియును? ఇంతకు విషయ మేమనఁగాఁ గ్రొత్తకోడలు వచ్చినపుడు పరిహాసములాడ చిత్తము కాం

క్షించు చుండును. నవ్వులాటాలలో రెండువైపుల నుండియు మాటలు చెలరేగుచుండును. ఒక్కొక్కప్పుడు చేతులు కలియు నంతటి పరిస్థితియును సంభవించుచుండును. ఒక్కొక్కప్పుడు జీవితకాలపర్యంతము మఱపునకురాని ప్రసంగము వచ్చుచుండును. పరిహాససమయములందు జాగ్రత్తగ నాలోచించుకొని మాటలాడవలయునను నియమమును లేదు. ఏ మాటను మాటలాడవలయునో ఏ మాటను మాటలాడరాదో యను వివేకము కూడ పోవును. అయినను క్రొత్తగాఁ బెండ్లిచేసికొనిన వరుఁడు తాను పెండ్లాడిన పిల్లయొక్క రూపలావణ్యములను గూర్చియు, చరిత్రనుగూర్చియు నవ్వులాటాలకైనను నాలోచింపరాదు. ఈ రెండువిషయములును స్త్రీల హృదయములలో బాణములవలె గ్రుచ్చుకొనును. అందువలన నవ్వులాటాలకైనను వారి రూప ప్రశంసనే చేయవలసియుండును. శివునివలన జరిగిన పొరపాటిది ఒక్కటియే. ''

శౌనకుఁ డిట్లడిగెను :- "సూతా ! ప్రాకృతుల పరిహాస విషయములు మాకు బాగుండవు, కాని పార్వతీపరమేశ్వరుల వినోదము పాపములను నాశనమొనరించును. కావున మాకు నీవాప్రసంగము నవశ్యము వినిపింపవలయును."

ఇది విని సూతుఁ డిట్లనెను :- "స్వామీ ! వివాహము చేసికొని శివుఁ డింటికి వచ్చెను. ఇంటిలోఁ దల్లిదండ్రులు, పెద్ద వారుండినచో వారు వినగలరను శంకయుండును. పరిహాసము లొకనిశ్చితకాలమున నొకహద్దులో జరుగును. శివుఁడే అందఱకును తల్లి, తండ్రి, తాత. క్రొత్త పెండ్లికూఁతు రింటికి వచ్చినది. మాటిమాటికి నెగతాళి పలుకుచుఁ బరిహాసములాడుచు

మాటలను వినుచుండెను. ఒకానొక దినమున జరిగిన విషయ మిది— శివుఁడు పార్వతి మెడమీఁద దన శ్రీహస్తములనుంచి ప్రేమపాశమున బంధించి యిట్లనెను :- "గిరిజా! నీవు నా పాశమున నెట్లు బంధింపఁబడితివో చెప్పుమనా ?"

పార్వతీదేవి ఉల్లాసముతో నిట్లనెను :- "సరియే, చెప్పుఁడు. ఎట్లున్నది ?"

శివుఁడు పరిణామమునుగూర్చి విచారించలేదు. ఆతఁడు వినోదమున దల్లీనుఁడై యిట్లనెను :- "సుందర స్వచ్ఛవర్ణము గల చందనవృక్షమునకు కాలనాగిని చుట్టుకొని నట్లున్నావు. అన్నియును బాగుగా నున్నవి కాని నీయీ కాలరూపము ఈ యెట్టని చీరెముసుఁగులో నీరూపము ఎఱ్ఱమబ్బులు చంద్రునిఁ గప్పినట్లున్నది. నీ నల్లని శరీరము కృష్ణపక్షములోని కాళరాత్రి వలెఁ గనఁబడుచున్నది."

ఇంకేమున్నది ? పార్వతికిఁ గోపకారణమునఁ బెదవు లదర సాగెను. ఒక్క విదళింపును విదలించి, శివుని చేతినుండి వదలించుకొని దూరముగఁబోయి నిలుచుండి, కన్నులెఱ్ఱఁజేసి యిట్లనెను :- "మానవుఁ డందఱును దన కన్నులతోఁ జూచును. కుటిలపురుషులకు బెఱవారి దోషములు గోరంతలు కొండంత లుగఁ దోఁచుచుండును. తనదోషము కొండంత యున్నను గనఁబడదు. నన్ను కాలనాగిని యనుచున్నారు. మిమ్ములను మీరు చూచుకొనలేదు. హాలాహలము నంతను గడగడఁ ద్రాగితిరి. మీకంఠములో నింకను విషము నిండియున్నది. మీ పేరే నీలకంఠుఁడు. అట్టియెడ మీకంఠమునుండి యెట్టిమాటలు వెలువడును ? విషసిక్తములగు బాణములవలె వెలువడు

చున్నవి. మీరు నాతండ్రిని జంపించితిరి. పాపము భృగుని గడ్డమును బీకించితిరి. భగుని నేత్రములను పెఱికించితిరి. పూషుని దంతములను రాలగొట్టించితిరి. ఈ పనులు చేయించుటకు మీకు సిగ్గు వేయుట లేదు. నన్ను కాళీ యనుచున్నారు. మీ పేరు మహాకాళుఁడు కాదా? నన్నుఁ గురూప యనుచున్నారు. మీవైపు మీరు చూచుకొనుఁడు. కపాలమాల, స్మశాన నివాసము, చితాభస్మాంగరాగము, భూత, ప్రేత, పిశాచ, డాకినీ, శాకినీ సమ్ముఖమున దిగంబరిగా నెగురుచుండుట మీకు సిగ్గుగ లేదా?"

శివుని ముఖము వాడిపోయెను. ఈమాటకిట్టి దుష్పరిణామము కలుగునని ఆతనికేమి తెలియును? నవ్వులాటలు నువ్వులాటలయ్యెను. ఆనందము భంగమయ్యెను. ఇప్పుడేమి జరుగవలయును? ఆతఁడు మిక్కిలి మధురవచనములతో నిట్లనెను:- "ఓసీ గిరిజా! నీవన్యథా తలంచితివా యేమి? నేను నిజము చెప్పుచున్నాను. నే నెగతాళి కీమాట లంటిని."

విదిలించుకొని గిరిజ యిట్లనెను:- "పొండావలకు, నాకిటి యెగతాళులు బాగుండవు. మీరు నా రూపమును దిరస్కరించుచున్నారు. ఇందులకేనా నాయంతట నేను నిన్నుఁ బెండ్లాడఁదలఁచినది. నీకొఱకు తపమొనరించితిని. అర్థి నిట్లే తిరస్కరించుచుందురు."

శివుఁడు నమ్రతతో నిట్లనెను:- "దేవీ! నేను నిన్నుఁ దిరస్కరింపలేదు. నీవు నాకు ప్రాణాధికవు. గృహస్థాశ్రమము నానాచింతలకు నిలయము. రాత్రింబవళ్లేదో చింత యుండనే యుండును. ఇందులో నున్నది ఒక్కటే సుఖము. భార్యా

భర్తలు పరిహాసము లాడుకొనుచు మనస్సును నానందింపఁ జేసికొనవచ్చును. నీరస జీవనమునందు సరసతా స్రోత నుత్పన్నము గావింపఁగలరు. ఇఁకఁ బొరపాటుననైన నట్టి మాటలు మాటలాడనని నేను ప్రతిజ్ఞ చేయుదును.”

పార్వతి యిట్లనెను:- “ఇప్పుడు నేనీ ముఖప్రీతి మాటలను నమ్మఁదానను గాను. నేను నల్లగా నుండుటచే నన్నవమానము గావించితిరి. నేను తపస్సుచేసి గౌరవర్ణనగు నంతవఱకు నేను మీయింట నడుగుపెట్టను.”

శివుఁడు భయపడెను. ఆతఁడనేక విధముల దేవికి నచ్చఁజెప్పెను. చేతులను జోడించెను. కాళ్లమీఁదఁబడెను. గడ్డము పట్టుకొని బ్రతిమలాడెను; కాని దేవి చండీరూపమును ధరించెను శివునిమాట నొక్కటైన వినక హిమాలయము వైపునకుఁ బోయెను.

శివుఁడు తనయందెట్టి ప్రేమను గలిగియున్నాఁడో పార్వతికిఁ దెలియును. తన రూపము నుధరించి శివుని నెవరును మోసగింప కుండునట్లు వీరకుని ద్వారపాలునిగా నియమించి లోనికి స్త్రీ నెవరిని రానీయవలదని కట్టుబాటొనరించెను. పార్వతికి అనుమానమేదియో అదియే జరిగెను. ఆడిదైత్య సర్ప వేషమును ధరించి వీరకుని వంచించి లోనఁ బ్రవేశించి, లోపల నామె పార్వతీ వేషమును ధరించెను. శివుఁడామెను గుర్తించి చంపివైచెను.

ఇచ్చట పార్వతి ఒక పర్వత శిఖరమునకుఁబోయి ఘోర తపస్సు చేయసాగెను. ఒకానొక దైత్య ఆమె రూపమును

ధరించి శివునితో సరససల్లాపము లాడుచున్నదని వాయువు పోయి ఆమెతోఁ జెప్పెను. దీనిమీఁద నామెకుఁ గోపమెక్కు డుగ వచ్చెను. ఆమె కోపమువలన నొక సింహాము పుట్టెను. పార్వతి దాని ముఖమునఁ బ్రవేశింపఁదలఁచు నంతలో నచ్చట బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. ఆతఁడు పార్వతిని నివారించి యిట్లనెను:- "దేవి! ఇదియేమి నీవు చేయుపని? నీవు నావలన నీకుఁగావలసిన వరమును గోరుకొనుము."

పార్వతి యిట్లనెను:- "లోక పితామహా! మీరు నాకు వరమీయఁ దలంచు నెడల నాకు నాకాల రూపముపోయి గౌరీరూపము వచ్చునట్లు వరమిమ్ము."

బ్రహ్మ యిట్లనెను:- "ఏవమస్తు! తథాస్తు" అక్షణ ములోనే దేవి శరీరమునుండి కాళీరూపమును గైకొని ఒక భీమాకారము కలిగిన త్రినేత్ర, గంటను జేతధరించి కాళీదేవి యుత్పన్నమయ్యెను. బ్రహ్మ ఆ దేవితో నిట్లనెను:- "దేవీ! నీవు వింధ్యాచలమునకుఁ బోయి నివసించుము. ఈ సింహాము నీకు వాహానమగును. అచ్చట నీ వందఱచేఁ బూజింపఁబడెదవు" బ్రహ్మయొక్క ఆజ్ఞనుబొంది ఆమె వింధ్యాచలమునకుఁ బోయి నివసింపసాగెను.

ఇచ్చట శరీరమునుండి నలుపుదనము పోఁగానే పార్వతీ దేవి దివ్యరూప ధారిణియై సువర్ణమునలె మెఱయుచు గౌరి యయ్యెను. శివయోగ్యమగు నిట్టి సుందరరూపమును ధరించి పార్వతీదేవి తన ప్రాణపతియగు శివుని సమీపమునకుఁ బోయెను. ఆమె రూపము మారిపోవుటచే ద్వారపాలు రామె నడ్డగించిరి. పదోవిధముగ నామె తన సంగతినిఁ జెప్పుకొని దేవి

లోపలకుఁ బోయెను. శివుఁడీ మెయొక్క యీ యద్భుత రూప మును గాంచి మిక్కిలి ప్రసన్నుఁడయ్యెను. ఆదినమునుండి పార్వతీ పరమేశ్వరులు గౌరీశంకరులను ప్రసిద్ధినిఁ జెందిరి.

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! నీవు మాకు చక్కని కథను వినిపించితివి. మా కింకను నొక్కశంక కలదు. పార్వతికి షడాననుఁడు, గజాననుఁడను నిద్దరు పుత్రులు కలరని చెప్పు చుందురు. కొందఱు పార్వతికి పుత్రులే లేరందరు. ఇందులో నేది నిజము?"

సూతుఁడిట్లనెను:- "ఈ దేవతల చరిత్రలనుగూర్చి మీ రేమియు నడుగకుఁడు. మీరు వినిన విషయములు రెండును సత్యములే. షడానన కార్తికేయుఁడు శివవీర్యము వలననే యుత్పన్నమైనాఁడు. ఆతని వీర్యము కొంత అగ్నిముఖమునఁ బడినది, కొంత పార్వతి ధరించినది. అది జలములో అదికూడు కొనెను. గంగ ధరించెను. అదియును దానిని ధరింపఁజాలక యేకాంతమున దానిని తెల్లులో దాచెను. కృత్తికలు తమ పుత్రునిఁగ భావించి ఆతనికి పాలనొసంగెను. ఈతఁడప్పు డాఱు ముఖములతోఁ బాలుత్రాగెను. ఈ విధముగ నాతఁడు పార్వతి కిని, అగ్నికిని, గంగకును, ఆఱు కృత్తికలకును బుత్రుఁడుగఁ బిలువఁబడుచుండెను. ఈతఁడు దేవతలకు సేనాపతి యయ్యెను. ఈతఁడే ప్రబలపరాక్రముఁడగు తారకాసురునిఁ జంపెను. ఆ కథ చాల పెద్దది. దానిని నేను విస్తారముగఁజెప్ప నసమర్థుఁడను."

గణేశ్వరుని ఉత్పత్తివిషయమునను నిట్టి కథయే వచ్చు చుండును. ఒకనాఁడు పార్వతీదేవి తన శరీరమునుండి నలుగును

నలిచి, ఆ పిండితో నొక పురుషాకారమూర్తినిఁ జే
ముఖము గజముఖమువలె నుండెను. ఆతనినిఁ
భావించి గంగలోఁ బడవైచెను. అప్పుడు గంగ గా
యగుటచే నాతనినిఁ బ్రేమించెను. ఈవిధముగ గణేశు

పురాణములలో నింకొకకథకూడ కలదు. పా
గణేశుఁడు పుట్టగానే పిల్లవానినిఁ జూచుటకున
లొసంగుటకును సమస్తదేవతలు వచ్చుచుండిరి.
బిల్లవానినిఁ జూచి, వాని నాశీర్వదించి, పార్వతినిఁ
వాని కనేక కానుకలొసంగిరి. శనైశ్చరుఁడుకూడ
పుత్రునిఁ జూచుటకు వచ్చెను. కాని వచ్చి యా
జూచుచుఁ గూర్చుండెను. ఆతఁడు పార్వతినిఁ జూ
పతినిఁ జూడలేదు. తన పత్నీశాపభయముచే నాతఁ
వైపునఁ గన్నెత్తియైనను జూడలేదు.''

అంత శౌనకుఁ డిట్లడిగెను:- ''సూతా!
నాతనిభార్య యేల శాపమొసంగినది?''

ఇది విని సూతుఁడిట్లనెను:- ''స్వామీ! ఇప్
దును? సర్పములను వశపఱచుకొనుటయైనను సు
ఇంటిలోనివారిని సంతోషపెట్టుట చాల కష్టము.
చిత్రరథుఁడను గంధర్వుని పుత్రికను బెండ్లాడెను. ఆ
ఉగ్రస్వభావ.

ఒకానొకదినమున శనైశ్చరుఁడు తలవంచ
ధ్యానములోఁ దల్లీనుఁడై యుండెను. ఇంతలోనే
ముస్తాబొనరించుకొని, షోడశశృంగారములతో నెగ

లిడుచుఁ గులుకుచు వయ్యారముగ మదమత్తయై ఆతని సమీపమునకు వచ్చెను. ఈతఁడు భగవద్ధ్యానములో నిమగ్నుఁ డగుటచే నామెను జూడలేదు. ఆమె వచ్చుటయే ఆలస్యముగ శనైశ్చరునకు శాపమొసంగెను. "నేనెంతో అభిలాషతో, ఎంతో మనోరథముతో నీకడకు వచ్చితిని. నీవు నన్ను మాన సమ్మానము లొనర్చుట యటులుంచి దృష్టితోనైనను సత్కరించలేదు. నావైపునకు గన్నునెత్తియైనను జూడలేదు. అందువలన నేను నీకు శాపమొసంగు చున్నాను. 'నీదృష్టి యెవరి మీఁద బడునో, ఎవరిని నీవు కన్నులెత్తి చూచెదవో అది నశించి పోవునుగాక!' అందుకనియే శనైశ్చర దృష్టి మారకమని చెప్పఁబడినది. అందువలన సమస్త దేవతల సమ్ముఖమున సూర్యపుత్రుఁడగు శనైశ్చరదేవత పార్వతీ గణేశ్వరుల వైపునకుఁ జూడలేదు."

పార్వతి యిట్లడిగెను :- "ఏమి శనైశ్చరదేవతా! నీవు నావైపు నాపిల్లవానివైపుచూడవేమి? తలవంచుకొని కూర్చుంటివేమి?"

ఇది విని తలవంచుకొని దుఃఖముతో శనైశ్చరుఁ డిట్లనెను :- "ఏమి చెప్పుదును? అమ్మా! మాయింటి ఆవిడ ఉగ్రస్వభావ! నాకిట్టి శాపమొసంగినది. ఈ నీపిల్లవాని కనిష్ట మేమియును గలుగకుండుటకై నేనిట్లు తలవంచుకొని నీవైపును నీ పిల్లవాని వైపును జూచుటలేదు."

పార్వతి నవ్వుచు నిట్లనెను :- "భార్యాభర్తలలో శాపములు జరుగుచునే యుండును. నీవు నిర్భయుఁడవై పిల్లవానినిఁ జూడుము."

ఇప్పుడు శనైశ్చరుఁ డేమిచేయఁ గలఁడు ? ఆతఁడు తన కుడిక్రీకంటి దృష్టితోఁ జూడఁగానే శిశువుయొక్క శిరస్సు మొండెమునుండి తెగి క్రిందఁబడెను. దానినుండి బయలు వెడలిన జ్యోతి తనయంశమగు కృష్ణభగవానునిలోఁ గలిసెను. ఇప్పుడు పార్వతీ శోకమునకు మేఱలేకుండెను. ఏడ్చి ఆమె యిల్లంతయును బొరలాడెను. ఇంతలోనే విష్ణువునకు దయ కలిగెను. ఆతఁడు గరుత్మంతు నెక్కి పుష్పభద్రానదీతటమునకుఁ బోయెను. అచ్చట నొక ఆడుయేనుఁగు, మగయేనుఁగు నిద్రించుటను గాంచెను. వాని కప్పుడే పుట్టిన ఒకపిల్ల ఆవలఁ బడియుండెను. భగవానుఁడు వెంటనే చక్రముతో నా గజశిశువు యొక్క శిరస్సును ఖండించి, వెంటనేవచ్చి గణేశ్వరుని మొండెమున కంటించెను. గణేశ్వరుఁడు లేచినిలుచుండెను. అప్పటి నుండి యాతఁడు గజాననుఁ డనియు, గజవదనుఁడనియుఁ బిలువఁ బడుచుండెను.

అంత శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా ! ఈ గణేశ్వరుఁడు సమస్త దేవతలకును నగ్రపూజ్యుఁ డెట్లయ్యెను ? తండ్రి కంటెను ముందాతఁడేలఁ బూజింపఁబడు చున్నాఁడు ?"

అంత సూతుఁ డిట్లనెను :- "స్వామీ ! ఈ సంబంధమునను నొక పౌరాణిక కథకలదు. గణేశ కార్తికేయులు గౌరీ పుత్రులైన తరువాత దేవత లమృతముతో నొక మోదకమును జేసి పార్వతి కొసంగిరి. దేవతలు రెండుమోదకముల నిచ్చియుండినచో నిద్దరకును జెరియొకటి యిచ్చియుండెడిదే. మోదుకమొకటె, పిల్లలిద్దరు. అమృతమోదుకమును విఱిచి యిచ్చుటకు

పేలు లేదు. పిల్లలిద్దరును దల్లిని లడ్డడిగిరి. తల్లి యిట్లనెను :- "ధర్మాచరణముచే నెవరు శ్రేష్ఠులుగ నెన్నఁబడెదరో వారే యీ మోదకమున కధికారు లగుదురు."

స్కందుఁ డిట్లనుకొనెను:- "అన్నిటికంటె శ్రేష్ఠమగు కార్యము పుణ్యతీర్థస్నానము, ప్రసిద్ధధామముల దర్శనము, భూ ప్రదక్షిణము. అందువలన నాతఁడు తన మయూరవాహనముపై నెక్కి శీఘ్రాతి శీఘ్రముగ సమస్తతీర్థములలో స్నానమొనర్చి వచ్చెను. సమస్త ధామములను దర్శించి వచ్చెను. గణేశ్వరు నకు బొజ్జ పెద్దది. దొంద శరీరమగుటచే నడుచుట కష్టము. ఆతని వాహనమగు మూషకమును బాగుగాఁ బోఁజాలదు. అందువలన నాతఁడు మిక్కిలి శ్రద్ధతో తన మనస్సులో నిట్లను కొనెను:- తల్లి దండ్రులు కోటి తీర్థములకంటె కోటిరెట్లు శ్రేష్ఠ మైన వారు. కావున నేను వీరికి ప్రదక్షిణ మొనర్చెదను" అని అనుకొని యాతఁ డత్యంత శ్రద్ధాభక్తులతోఁ దలిదండ్రులకుఁ బ్రదక్షిణము గావించి చేతులు జోడించుకొని శివ సమ్ముఖమున నిలుచుండెను.

ఇంతలోనే స్కందుఁడును వచ్చి మోదకము నడిగెను. అప్పుడు నవ్వి తల్లి యిట్లనెను:- "వత్సా! ఈ మోదకమును దినువాఁడు గొప్ప లేఖకుఁడును, చిత్రకారుఁడును, విద్వాంసుఁ డును, శాస్త్ర, జ్ఞాన విజ్ఞానములందుఁ బారంగతుఁడు కాఁ గలఁడు. దీని కధికారి గణేశ్వరుఁడే. ఏలననఁగా నింటిలోనుండిన తల్లిదండ్రులను వీడి తీర్థములందుఁ దిరుగువాని తీర్థయాత్ర నిష్ఫ లము కాఁగలదు. తల్లి దండ్రులు కోటి తీర్థముల కంటె

శ్రేష్ఠమైనవారు. కావున నీ మోదకమును గణేశ్వరుఁడే తన బుద్ధి బలముచే గెలుచుకొన్నాఁడు.”

పార్వతి వాక్యములను విని శివుఁడును నిట్లనెను:- “అవును, నిజమే, గణేశుఁడు మోదకమున కధికారియే, నేఁటి నుండి యీతని కగ్రపూజ జరుగునట్లాశీర్వదించు చున్నాను. ఈతని పూజవలన సమస్త దేవతలు సంతుష్టినిఁ జెందుదురు గాక !”

సూతుఁ డిట్లనెను:- “మునులారా ! అప్పటినుండి విఘ్న వినాయకుని సమస్త కార్యములందును ముందుగఁ బూజించు చుందురు.”

ఇది విని శౌనకుఁ డిట్లనెను:- “సూతా ! తల్లి యీ విషయమునఁ బక్షపాతము వహించినది. మాతృ హృదయము దయామయముగ నుండవలయును. ఏదైన వస్తువును బంచు టలోఁ దల్లి గుణ నిర్గుణులని పుత్రులలో భేదమెంచరాదు. ఆతఁడు పుత్రులందఱి మీఁదను దయను బ్రదర్శింపవలయును.

సూతుఁ డిట్లనెను:- “మహాభాగా ! న్యాయము విష యము వేఱు, దయ విషయము వేఱు, మనము న్యాయముగ సింహాసనముపైఁ గూర్చుండఁ దలఁచుచో మనము ధర్మపూర్వక ముగ సత్యమైన విషయముననే న్యాయమొనర్ప వలయును. దయా విషయములో దయ తలఁచు నెడల మన ప్రాణముల నర్పించియైనను పరుల దుఃఖములను దూరము కావింపవలయును. న్యాయశాస్త్రదృష్టి ననుసరించి మోదకముపై గణేశున కధి

కారము కలదు. అందువలనఁ దల్లి ఆతని కోసం గెను. తల్లి దయ అగాధమైనది. తన పిల్లల విషయ మట్లుంచుఁడు. ఆమె అందఱి యందును సమాన రూపమున దయను జూపును. ఏలననఁగా నందఱును నామెకు స్వపుత్రులే. జగన్మాత యయ్యుఁదన తపస్సు నంతను నర్పణము కావించి ఒకానొక అనాథ బాలకుని మొసలినుండి రక్షించెను.

ఇది విని శౌనకుఁ డిట్లనెను:- "పార్వతీదేవి మొసలి నోటినుండి బాలునెట్లు రక్షించినది ? ఈ ఆఖ్యానమును సూతా! మాకు తప్పక వినిపింప వలయును."

శౌనకుని యుత్సాహమును గాంచి సూతుఁ డిట్లనెను:- "మహాభాగా ! పార్వతీ పరమేశ్వరులకు వివాహము కాఁగానే కుతూహలవశమునఁ బార్వతీదేవి ఒకానొక సరోవర సమీపమున నుండెను. ఆదినమున శివుఁ డెచ్చటికో కార్యాంతరమునఁ బోయెను. జగదంబిక అచ్చట సరోవర స్వచ్ఛ సులలిత సలిల వీచికా సందోహములను వీక్షించుచుఁ దన్మయయై యుండు నంతలో నామెకొక అత్యంత కరుణాపూర్ణమగు నార్తస్వరము వినఁబడెను. జగదంబిక సంభ్రమముతో నటునిటుఁ దన కమల సదృశ నేత్రములను విస్ఫారిత మొనర్చుచు జూచుచుండెను.అకస్మాత్తుగనామెకు ఎదుట జలములందొక మొసలి కనఁబడెను. అది ఒకపిల్లవానినిఁ బట్టుకొని యుండెను.ఆతనికి నాలుగైదు సంవత్సరము లుండును. మిక్కిలి సుందరుఁడు, దృఢము కలవాఁడు, తేజస్వి, అందమైనవాఁడు. ఆతని తడిసిన ముంగురులు ముఖము మీఁదఁ గ్రమ్ముకొని అందముగ నుండెను. భయకారణమున

నాతఁడు గడగడ వణఁకుచుండెను. బిగ్గఱగ బలముకొలఁది యిట్లఱచుచుండెను. "నేననాథుఁడను. నన్నెవరైన రక్షింపుఁడు. ఈ గ్రాహము నన్నుఁబట్టుకొనినది. క్షణములోఁ దినివేయఁ గలదు, నేను చావఁగలను."

పిల్లవాని కరుణాక్రందనమును విని కరుణామయి యగు తల్లియొక్క నవనీతము కంటెను స్నిగ్ధమైన హృదయము కరిగి పోయెను, ఆమె కరుణాభరిత వాక్కులతో మొసలితో నిట్లనెను;- "గ్రహరాజా ! నీవీ యమాయకపు పసిపాప నేల పట్టుకొంటివి ? వీనిని వదలిపెట్టుము;"

మొసలి యిట్లనెను:- "దేవీ ! ఏమిచేయుదును. బ్రహ్మ మా కిదేవృత్తి నేర్పఱచినాఁడు. సాయంకాలమున నాకేది లభించునో అదియే నాకాహారమగును. నేను చాల దినముల నుండి ఆఁకలిఁ జెందియున్నాను. ఈ పిల్లవాఁడు నాకదృష్టమున లభించినాఁడు, వీనినిఁదిని నేను నా ప్రాణములను ధరించెదను."

అత్యంత దయతోఁ బార్వతీదేవి యిట్లనెను:- "గ్రాహ రాజా ! నీకు దయ్యమైన రాదేమి ? ఎంత అందమైన పిల్ల వాఁడో చూడుము. వీనినిఁ దినినందున నీకేమి తృప్తి కాఁ గలదు ? వీనిని నీవు వదులుము."

గ్రాహ మిట్లనెను:- "దేవీ ! ఆవు గడ్డిని దయదలఁ చుచో నది యాఁకలిచేఁ జావ వలసినదే. తన యాహారముపై నెవరు దయఁదాల్పఁ గలరు ? చీమ పురుగును దినును. పురుగు మంచి అందమైన చెట్లను వ్రేళ్లతోఁ దినివేయును. మంచి పచ్చగానున్న మొక్కలను గొఱ్ఱెలు, మేఁకలు, ఆవులు తిని

వేయుచుండును. అమాయకముగను, కోమలముగను, సుందర ముగను నున్న మేకపిల్లలను మాంసాహార జంతువులు తిని వేయును. వాని ఎముకలనుగూడ మిగుల్చవు మంచిమంచి పండ్లను మానవులు కోసికొని తినుచుందురు. జామ, మామిడి, మొదలగు ఫలములను మానవులు లేతగానుండఁగనే తిని వేయు చుందురు. వానిలో జీవము లేదా ? వానికి మాత్రము కష్టము కలుగదా ? మాంసాహారులు తమ యిండ్లలో మేకలను, కోళ్లను బెంచుచుందురు. వాని గ్రుడ్లను బిల్లలను దినుచుందురు. ఆఁడు సర్పము తన పిల్లలనే తినివేయును. ఈ పొట్టనేదో విధ ముగ నింపవలసియుండును. ప్రపంచములో జీవములేని పదార్థ మేమున్నది ? సమస్తజీవులు జీవుల బలముమీఁదనే జీవించు చున్నవి. ఒక జీవి యింకొక జీవిచేఁ బ్రదుకుచున్నది. నాకు జీవిక యిదియే.''

గ్రాహముయొక్క పాండిత్యపూర్ణమగు నీ వాక్యములను విని తల్లియగు పార్వతీదేవి యిట్లనెను:-''గ్రాహరాజా ! జీవుల వలననే జీవులకు జీవిక కలుగుననుట యథార్థమే. అయినను ప్రపంచములో దయయనువస్తువు కలదు. కేవలము తనపొట్టను నింపుకొనుట పశుత్వమే కాఁగలదు. నీవు బుద్ధిమంతులవలె మాటలాడుచున్నావు. ఇది నీ యాహారమనునది నే నొప్పుకొం దును. అయినను నేను నీకు నమస్కార మొనర్చెదను. నీకు చేతులను జోడించెదను. వీనిని నీవు వదలుము. వీనికి బదులుగా నీవు నన్ను దినుము.''

పార్వతీదేవియొక్క యీ వచనములను విని గ్రాహ మిట్లనెను:- ''భగవతీ ! నేను నిన్నుఁ దినను. నా కింకొక ప్రియ

వస్తువును దేనినైన నిమ్ము. నేను వీనిని వదలెదను. నీవు గిరి రాజముపైఁ గూర్చుండి చేసిన తపోఫలమును నా కిమ్ము. నేను వీనిని వదలెదను."

వెంటనే జగదంబిక యిట్లనెను:- "గ్రాహరాజా! ఆ తపమునే కాదు, నేను జీవితకాలమంతయును, జన్మజన్మాంతరములందును జేసిన తపస్సునంతను నొసంగెదను. నీ వీ పిల్లవానిని వదలుము." ఇట్లు పలికి ఆమె చేతిలోనికి నీటిని కుశలను దీసికొని తన తపస్సునంతను గ్రాహమునకు సంకల్పపూర్వకముగ నర్పించెను. జగదంబికయొక్క తపస్సును బొంది ఆ మొసలి సూర్యునివలెఁ దేజస్వియయ్యెను. అది పిల్లవానిని వదలివైచెను. అంబిక మిక్కిలి ప్రేమతో, ముద్దుగా, వాత్సల్యముతో నా పిల్లవాని నెత్తుకొని కౌఁగిలించుకొనెను. మొసలి యిట్లడిగెను:- "దేవి! నీ వెంతో కష్టముచే సంపాదించిన యీ తపస్సును నీ బాలకునికొఱకు వ్యర్థముగ నాశము గావించుకొంటి వేల?"

తల్లి యిట్లనెను:- "గ్రాహరాజా! తపస్సును మరలఁ జేయవచ్చును; కాని యీ పిల్లవానిని నీవు తినినచో మరల నెట్లు రాఁగలఁడు? తపస్సును మరల నేను సంపాదింపఁగలను." ఇది విని యా మొసలి అచ్చటనే అంతర్ధానమయ్యెను. పిల్లవాఁడు స్వేచ్ఛగా వెడలిపోయెను. ఇంతలోనే శంకరుఁడును వచ్చెను. పార్వతి యిట్లనెను:- "దేవా! ఇప్పుడు నాకు తపస్సు చేయ నాజ్ఞయిమ్ము. నేను తపోహీననైతిని."

శివుఁ డిట్లనెను:- "ఏ పాపముచే నీవు తపోహీనవైతివి?" పార్వతి యిట్లనెను:- "పాపమునలనఁ గాదు. పిల్లవానిమీఁద దయనుజూపి నేను నా తపస్సునంతను నర్పించితిని."

ఇది విని శివుఁడు నవ్వి యిట్లనెను:-"దేవీ! దయవలనఁ దపస్సు క్షీణింపదు. అది యింకను బెరుగును. పరోపకారము కొఱకర్పించిన తపస్సు నశింపదు కాని అధికవృద్ధినిఁ బొందును. ఆ గ్రాహ మెవరును గాదు. నేనే నీ దయను బరీక్షించుటకై గ్రాహ బాలక రూపములను ధరించితిని. భక్ష్య భక్షక రూపములు రెండును నేనే. నీవు నీ తపస్సును నాకే అర్పించితివి. నాకర్పించిన వస్తువు నశింపదు, అక్షయమగును. దయామూల మెంతగా నశింపఁజేయవలయునని కోసినను నది తెగదు. కావున నిప్పుడు నీవు తపము చేయనక్కఱలేదు. నీ తపస్సు అక్షయమైనది. నీవు దయనొసంగి నన్నుఁ గొనివైచితివి. నే నిప్పుడు నీవాఁడ నైతిని." ఇట్లు పలికి శివుఁ డామెకుఁ దన యర్ధాంగము నొసంగెను. తనలోఁ గలుపుకొని ఒక్కటిగాఁ జేసికొనెను."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! పార్వతీ పరమేశ్వరుల, ఉమామహేశుల, గౌరీశంకరుల చరిత్ర అనంతమైనది. సమస్తవృక్షములను గాల్చి దానితో సిరాను జేసి, సుమేరు పర్వతమును లేఖినిగాఁ జేసి, సమస్త భూమండలమును కాగితముగఁ జేసి శారదాదేవి సదా వ్రాయుచుండినను బార్వతీ పరమేశ్వరుల సంపూర్ణచరిత్రమును వ్రాయ సమర్థ కాదు. శివచరిత్ర మహత్తరమైనది. అగాధమైనది. అపారమైనది. దానిని దాటుట అసంభవము. అందువలన నే నిచ్చట భాగవతకథా

ప్రసంగమున నత్యంత సంక్షేపముగ శివుని చరిత్రము కొంచెము సంక్షేపముగ వర్ణించితిని. అవిచ్ఛిన్న మహాత్ప్రవాహము గల గంగాజలమునుండి యాత్రికు లొక చిన్నపాత్రలో దీనిని నింపి తీసికొని యింటికిపోయి 'మేము గంగను దెచ్చితి' మనునట్లుగ నతిసంక్షేపముగఁ జెప్పితిని. వాస్తవమునకు తమ క్షుద్రపాత్రములలోనికిఁ దెచ్చినది సంపూర్ణగంగ కానేకాదు; కాని పాపములను హరించుశక్తి యీ గంగాజలకణములలో సంపూర్ణముగఁ గలదు. ఆ బిందువులను నెవరు గ్రహించెదరో వారి పాపములు నశించిపోఁగలవు. అదేవిధముగ నీ చరిత్రములను శ్రద్ధతో నెవరు వినెదరో, విని యెవరు మననముచేయుదురో, ఇతరులకు వినిపించెదరో, చదువుటకుఁ బ్రేరేపించెదరో వారి పాపముల నన్నిటిని సదాశివుఁడు తన త్రిశూలముయొక్క కొనతో నాశము గావించును. ఇది నిస్సందేహ విషయము. నే నిది గంగమధ్యలోఁ గూర్చుండి త్రివేణీమధ్యలోనుండి చెప్పుచున్నాను."



# అధర్మ నివంశము

## (౨౧౩)

శ్లో॥ మృషాఽధర్మస్య భార్యాసీద్దంభం మాయాం చ శత్రుహన్।
అసూత మిథునం తత్తు నిరృతిర్జగృహేఽప్రజః॥

— శ్రీ భాగ. ౪ స్కం. ౮ అ. ౨ శ్లో.

---

నిర్గుణములో సృష్టి లేదు. నిర్వికారమందు సృష్టి లేదు. శుద్ధమందు సృష్టి లేదు. సామ్యమందు సృష్టి లేదు. జ్ఞానమందు సృష్టి లేదు. సృష్టికి సగుణ, కామన, అవిద్య, విషమత, మాయ మొదలగునవి ఆవశ్యకములు. భగవంతునిలోని కీ చెడ్డవస్తువు లెచ్చటనుండి వచ్చినవి? ఆతనిలో నీ వస్తువులన్నియు నున్నచో నాతఁడు శుద్ధ, బుద్ధ, ముక్త, అజ, నిర్వికార, నిర్లేప, నిరాధార నిరంజన, నిర్ద్వంద్వ, నిష్కల, నిర్గుణుఁడు కాఁజాలఁడు. ఆతనిలో నివి లేనిచో నివి యెచ్చటనుండి వచ్చినవి? అన్నిటికిని జనకుఁడును నుత్పాదకుఁడును నతఁడే. అతఁ డీ చెడ్డవస్తువుల నెచ్చట నుండి యుత్పన్నము గావించినాఁడు?

ప్రపంచములోఁ జెడ్డ యనునది లేనే లేదు. చెడ్డదనుటయే చెడ్డ. దేన్నైనను జెడ్డదనుట హృదయమునుండి త్రోసివేయుము. నలువైపులను నీకు మంచియే కనఁబడును. అన్నియును భగవంతుని నుండియే యుత్పత్తి యైనవి. భగవంతుఁడు శివ స్వరూపుఁడు. శివుఁడ శివ సృష్టినిఁ జేయఁడు, మృత్తికచే నేర్పడిన పిడత, కుండ, బాన, చట్టి, మూఁకుడు ఇవి యన్నియును మృత్తిగా స్వరూపములే. పవిత్ర ప్రభుని సృష్టి యంత

యును బవిత్రమైనదే. మనస్సు మకిల యైనచో నట్టివారు పవిత్రమైన వాటినిఁగూడ నపవిత్రములుగఁ జూచుచుందురు. తన మనస్సులోనుండి మలినమును ద్రోసివేసినచో బ్రపంచము లో మలినమంతయును నశించును. ప్రపంచములో మలినము లేనే లేదు. అది మన మనస్సులలోనే బుట్టినది.

సృష్టిప్రకరణమును వ్యాపింపఁజేయుటకై విదురుఁడు మైత్రేయమహాముని నిట్లడిగెను:-"ప్రభూ! మీరు స్వాయంభువ మనువుయొక్క ఆకూతి, దేవహూతి, ప్రసూతి అను నీముగ్గురు కన్యకలయొక్క వంశమును వర్ణించితిరి. ఈ ప్రసంగమున మీరు బ్రహ్మయొక్క మరీచాదిక మానసిక పుత్రుల వంశవర్ణనమును సంక్షేపముగఁ జేసియుంటిరి. ఇప్పుడు నేనిది వినఁగోరుచున్నాను. బ్రహ్మకు పదిమంది మానసపుత్రులలో నారదుఁడుకూడ ఒకఁడు కలఁడు. ఋభు, హంస, అరుణి, యతి, సనకాదులును నాతని పుత్రులు. వీరి వంశవర్ణనమును మీరు చేయలేదు."

ఇది విని మైత్రేయ మహాముని నవ్వి యిట్లనెను:- "విదురా! సృష్టిసంగ్రహములో నున్నది. నీవేవస్తువునైనను నాదనుకొంటివా ప్రపంచము వృద్ధిపొందును. అప్పుడు నూతన సృష్టి కలుగును. సంగ్రహమే లేకున్న దానికి వృద్ధి యెట్లు కలుగును? 'మొండిమొలతో స్నానమొనర్చి యిఁక దేనిని పిడుచును? వీరందఱును నివృత్తి మార్గోపాసకులు. సనక, సనందన, సనత్కుమార, సనాతన, నారద, ఋభు, హంస, అరుణి, యతి వీరందఱును నూర్ధ్వరేతస్కులగు బ్రహ్మచారులు. వీరు భగవంతుని మాయారూపమగు భార్యకు సదా దూర ముగ నుందురు. అట్టియెడ వీరికి పిల్లలెట్లు సంభవించెదరు? వీ

కెల్లప్పుడును బిల్లలుగనే యుండును. పిల్లలను గననివాఁ డెల్ల ప్పుడును బిల్లవాఁడుగనే యుండును."

విదురుఁ డిట్లనెను :- "స్వామీ! మీరుగాక బ్రహ్మ కింకను బుత్రులు కలరు కదా! మీరు ధర్ముని పదమువ్గురు పత్నులను గూర్చియు వారి సంతానమును గూర్చియు వర్ణించి యుంటిరి; కాని అధర్ముఁడు, నిర్ఋతియు నాతని పుత్రులే కదా. అధర్ముఁడు భగవంతుని పృష్ఠభాగమునుండి పుట్టినాఁడు. నిర్ఋతి పాయుదేశమునుండి పుట్టినాఁడు. కావున మీరు వీరి సంతానమును గూర్చియు వర్ణింప వలయును."

సూతుఁ డిట్లనెను :- "మునులారా! విదురుఁ డడుగఁగా భగవానుఁడగు మైత్రేయుఁ డధర్మ వంశవర్ణనమును జేయ నుద్యుక్తుఁ డయ్యెను."

అంత శౌనకుఁ డిట్లడిగెను :- "సూతా! అధర్ముని వంశమునుగూర్చి వినుటవలన నేమిలాభము? మేమందఱమును ధర్మతత్త్వమునుగూర్చి తెలిసికొనఁ గోరుచున్నాము."

ఇది విని సూతుఁ డిట్లనెను :- "స్వామీ! అట్లుకాదు. వారి వారి స్థానములలో వారి వారి హద్దుల ననుసరించి అస్తిత్వము కలదు. అప్పుడే సృష్టికార్యము జరుగును. అధర్మము నాశము కావలయునని మీరు కోరు నెడల నది అసంభవము. అది సృష్టికి అత్యావసరము; కాని అది మర్యాదోల్లంఘనమును గావించి ధర్మము నణఁచినప్పుడును, సర్వత్ర అధర్మమునకు అభ్యుత్థానము కలిగినప్పుడును దానిని క్షీణింపఁ జేయుటకును, ధర్మమునకు వృద్ధినిఁ గావించుటకును భగవంతుఁ డవతరించును".

శౌనకుఁ డిట్లనెను :— "మంచిదే, ఉండనిమ్ము, అట్లే కాఁగలదు. కాని మా కధర్మచర్చను వినుచుట యేమి ? దానికి నపరిచితులమై యుండుటే మంచిది."

అంత నవ్వుచు సూతుఁ డిట్లనెను:— "స్వామీ ! అజ్ఞానమునకును ద్యాగమునకును మిక్కిలి భేదము కలదు. గుణదోషములను దెలిసికొని త్యాగసంగ్రహ మొనర్చినవాఁడే యథార్థమునకు త్యాగి. ధర్మాధర్మములను దెలిసికొని, అందులో ధర్మమును గ్రహించి, అధర్మమును ద్యజింపవలయును. కావున రెంటియొక్క జ్ఞాన మవసరమగుచున్నది. ఇది ధర్మము, ఇది అధర్మము అని తెలియుట ముఖ్యము. ఒక్కొక్కప్పుడు ధర్మ మధర్మరూపమును ధరించును. కావున వీనియొక్క పూర్ణ పరిచయ మవసరము. మైత్రేయుఁడు విదురునకు అధర్మవంశము నెట్లు వర్ణించెనో అట్లే నా గురుదేవుఁడగు శుకమహర్షి పరీక్షిన్మహారాజు సమ్ముఖమున వర్ణించియుండెను. దానినే నేను మీ సమ్ముఖమున వర్ణించెదను. మీరు మిక్కిలి శ్రద్ధతో వినవలయును."

మైత్రేయమహాముని యిట్లనెను:— "విదురా ! బ్రహ్మయొక్క పృష్ఠదేశమునుండి అధర్ముఁడు పుట్టినాఁడు. పాయుదేశమునుండి నిరృతి (అసత్యము) పుట్టినాఁడు. వీరిద్దరు నొకే స్వభావము కలవారు. అధర్ముఁడు మృషను వివాహమాడెను. అధర్ముని వీర్యమువలన మృషాగర్భమున దంభుఁడను పుత్రుఁడును, మాయయను బుత్రికయు నుద్భవించిరి. సాధారణముగఁ బుత్రునకు తండ్రిగుణములును, బుత్రికకు తల్లిగుణములును వచ్చునని చెప్పుచుందురు. అధర్మము వెంట నెల్లప్పుడును దంభ

ముండును. అధర్మరక్షణ దంభమువలననే కలుగుచుండును. దంభమునకుఁ బాషండమనియుఁ బేరు కలదు. పాషండమనఁగాఁ బాపమునకుఁ జిహ్నము. ఇదేవిధముగ మృష (అబద్ధము) వలన మాయ పుట్టును. మృషయొక్క రక్షణ మాయవలనఁ గలుగును. అధర్ముని సోదరుఁడగు నిర్ఋతికి వివాహము కాలేదు. అందువలన నాతఁడీయిద్దరను బెంపుడు తీసికొనెను. ఆతఁడే యీ యిద్దరును బెంచి పోషించెను. ఏలననఁగా నధర్మునకు తన సంతానముమీఁద ననురాగములేదు. అధర్ముఁడేకదా! అందువలన వీరిద్దరును నిర్ఋతి (అసత్యమునకు) పిల్లలనుచుండిరి.

దంభము, మృష వీరిద్దరు నొకే తల్లిదండ్రులకు సంతానమైనను అధర్ముని సంతతి యగుటచే వీరిద్దరును వివాహమాడిరి. అందువలన వీరు భార్యాభర్తలైరి. వీరి కిద్దరు పిల్లలు పుట్టిరి. లోభుఁడను బుత్రుఁడును, నికృతి (శఠత్వము) అను పుత్రికయును బుట్టిరి.''

తండ్రులు తాత లేమిపని చేయుదురో తమ పిల్లలు నదే పనినిఁ జేయుచుందురు. లోభుఁడు తన చెల్లెలగు నికృతిని భార్యగాఁ జేసికొనెను. వీరికి క్రోధుఁడను బుత్రుఁడును హింసయను బుత్రికయును బుట్టిరి. ఇది కులాచారమగుటచే క్రోధుఁడును తన సోదరియగు హింసను బెండ్లాడెను. దక్షిణదేశములోఁ జెల్లెలుకూఁతురినిఁ బెండ్లి చేసికొందురు. అనఁగా మేనమామ మేనకోడలినిఁ బెండ్లాడును. ఆమెపై నియమానుసారముగ నధికారము కలుగును. మేనమామకూఁతురునిగూడ పెండ్లి చేసికొందురు. మేనత్త, మేనమామ పిల్లలనుగూడా పెండ్లి చేసికొందురు. ఈ విధముగనే అధర్ముని వంశమందును అన్నయుఁ

జెల్లెలు పెండ్లి చేసికొను యాచారము జరుగుచుండెను. క్రోధమును, హింసయును భార్యాభర్తలు కాగానే వారికి మహా పురుషుఁడగు కలియుగదేవత పుట్టెను. ఆతఁడే నేఁడు ముక్కుత్రోశనగలు నమలించుచున్నాఁడు. ఆతని కొక చెల్లెలు దురుక్తి (కటువచనము, నింద) కలిగెను. ఆతఁ డీమెను దన వంశాచారము ననుసరించి భార్యగాఁ జేసికొనెను.

"దురుక్తి దేవి కలివీర్యము వలన భయ మృత్యువులను గనెను. భయము మృత్యువును వివాహమాడెను. వారికిని నిద్దరుపుట్టిరి. ఒక పిల్ల, తరువాత పిల్లవాఁడు. పిల్ల పేరు యాతన, పిల్లవాని పేరు నిరయ (నరక)ము నరకుఁడు వివాహమాడలేదు. సాంసారుల క్లేశములను గాంచి యాతఁడూర్ధ్వరేతస్కుఁడయ్యె నని తోఁచుచున్నది. అందువలన యాతన వేఱుగనుండెను. నరకము వేఱుగ నుండి అందఱ దుఃఖములకును ఫలమును భోగింపఁ జేయుచుండెను."

మైత్రేయ మహాముని యిట్లనెను:— "విదురా! అధర్మని వంశము చాల పెద్దది; కాని నేను నీకత్యంత సంక్షేపముగఁ జెప్పితిని. దీనిని ఒక్కసారి మాత్రమే విని సంతోషింపకుఁడు. మాటిమాటికిని వినవలయును. మూఁడుసారులు దీని నెవరు వినెదరో వారికి దీనిని వినుటచేతనే గొప్పపుణ్యము కలుగును. వారి మనస్సులలో నధర్మవంశములోనివారు దాగుకొనియుండిరా వారు పారిపోవుదురు."

విదురుఁ డిట్లనెను:— "స్వామీ! వినుటచేతనే అధర్మ వంశజులెట్లు పారిపోఁగలరు?"

మైత్రేయ మహాముని యిట్లనెను:- "విదురా! ఈ యధర్ముఁడు చోరుఁడు, మోసగాఁడు. చోరునకు సాహసము మెండు. ఎందఱో మనుష్యులు నిద్రించుచున్నను గన్నమును వైచి లోనికి దూఁకును, కాని వానికాళ్లు దుర్బలములైనవి. కొంచెముగఁ గదలినట్లుండెనా, చప్పుడును వినెనా, కొంచెముగ దగ్గు వినఁబడెనా పాఱిపోవును. వానిజాడ తెలియనంత వఱకే చోరుఁడు జనులలోను, ఇండ్లలోను దాగియుండును. తానెవని కొడుకో యెచ్చటనుండునో తెలియనంతవఱకే దాగి యుండును. వానిసంగతి లోకులకుఁ దెలిసెనా అతఁడు నిలువనే నిలువఁడు, ఈ విధముగా అధర్మము, మృషా, దంభము, మాయ, లోభము శఠత, క్రోధము హింస, కలి, దురుక్తి, భయమృత్యువులు, నిరయ యాతనలు వీని నెఱుఁగనంతవఱకే అవి హృదయములో దాగియుండును. వానియొక్క యథార్థ విషయము తెలిసెనా సద్వృత్తులు వానిని దిరస్కరించును. అప్పుడివి తిరస్కృతములై పాఱిపోవును, కావున నీ వంశ పరంపరను జ్ఞాపకము పెట్టుకొన వలయును. వీనిలో నెవరైనను గనఁబడిరా ఈతఁడు ఫలానివాని పిల్లవాఁడనియు, వీని తల్లి యిట్టిదనియు, వీనితండ్రి యిట్టివాఁడనియుఁ దెలిసికొనవలయును."

ఇది విని శౌనకుఁ డిట్లనెను:- "సూతా! ఈ యధర్ముఁ డెవఁడు? పూర్వజన్మమున నీతనికి భగవంతుని పుత్రుఁడగు భాగ్యమెట్లు కలిగినది?"

శౌనకునియొక్క యీ వాక్యములను విని సూతుఁ డిట్లనెను:- "మహాభాగా! ఇప్పుడు నేనేమి చెప్పఁగలను? ఈ సృష్టి అనాదియైనది. దీనిలో నొక్కొక్కప్పు డొక్కొక్కరు

మఱొకప్పు డింకొకరు పైకి వచ్చుచుందురు. ఒక కల్పములో నొక్కఁడొక విధముగ నగును. రెండవ కల్పమున వాని కింకొక పేరు వచ్చును. ఇప్పుడు మనువైనవాఁడు తర్వాత కల్పమున నింద్రుఁడగును. నేఁడింద్రుఁడుగ నున్నవాఁడు రెండవ కల్పమున మనువుగనో మనుపుత్రుఁడుగనో పుట్టును. ఈ యర్థమ్మని విషయమునను నేను పురాణములలో నొక కథను వింటిని."

ప్రయాగరాజమందు ప్రతి మాఘ మకరమందును గల్ప వాసము జరుగుట మీ రెఱిఁగినదే. గంగాయమునలు వర్షా కాలములోఁ బెఱిఁగి యెన్ని నవీనస్థానములను గల్పించినవో ఆ రెంటికిని మధ్యనున్న భూమికి కల్పస్థల (నూతనభూమి) మని పేరు. అచ్చట నొక నెలయుండుటకుఁ గల్పవాస మందురు. మాఘము రాఁగానే అచ్చట నొక గొప్ప ఉత్సవము జరుగును. సాధు సజ్జనుల కుటీరములు, రాజులు మహారాజులయొక్కయు, శెట్లు సాహుకార్లయొక్కయు కుటీరములు వెలయును. దుకాణ ములను బెట్టుదురు. బజారు లేర్పడును. లక్షల కొలఁది జనులు వచ్చుచుఁ బోవుచుందురు. ప్రపంచములోని అన్నివస్తువుల వ్యాపారము జరుగును. తెలియని యాత్రీకులు వచ్చుచో నీ వైభవమంతయు నెల్లప్పు డుండునని భావించుచుందురు. ఇచ్చట నెప్పుడును నగరముండు ననుకొందురు; కాని శ్రావణ భాద్రపద మాసములలోఁ బోయి చూచినచో బజారులును లేవు, దుకా ణములు నుండవు. రసగుల్లాలు, మిఠాయి దుకాణములున్న చోట నేఁడు అఖండ అగాధ జలరాశి యున్నది. ఎన్నోనిలువుల లోతున నీరు సుడులు తిరుగుచుండును. తర్వాత మరల కల్ప వాసములో నదే యాడంబరోత్సవము జరుగును.

ఈ కల్పనాసము బ్రహ్మకల్పమున కొకనమూనా. బ్రహ్మ యొక్క ఒక్కదినమైన తరువాత సూర్యుఁడు ప్రచండరూప మునఁ బ్రపంచములోని నీటినంతను నింకించును. ప్రాణులు నీరు లేక చచ్చుచుందురు. అప్పుడిచ్చటనే ప్రయాగరాజమునుండి గంగాయమునల మధ్యనున్న వేణీకుండమునుండి జలముబుకును. ఆ జలము సప్తసముద్రముల నేకము కావించును. కుండములో మొదట నేస్రోతబయలుదేరి అన్నిసముద్రములను గలిపినదో ఆస్రోత ప్రతిష్ఠానపురము (ఝూసీ) యందు సముద్రకూపమను పేర విఖ్యాతిఁ జెందినది. అప్పుడు జీవులుగాని వృక్షములుగాని ఉండవు. ప్రపంచములో జలమునకు జలమే యుండును. ఒక్క అక్షయవటము మాత్రముండును. దాని ఆకులమీఁద బాల ముకుందుఁడు క్రీడించు చుండును. కల్పాంతమందు భగవానుని నాభికమలమునుండి బ్రహ్మ యుత్పన్నమై సృష్టిచేయ నారం భించును.

ఒకసారి బ్రహ్మ సృష్టిసంకల్పము చేయఁగానే మధు కైటభులను నిద్దరు రాక్షసులు వచ్చి బ్రహ్మను వేధింప నిట్లు మొదలిడిరి:– "నీ వెవఁడవు ? ఈ కమలమున నేలగూర్చుంటివి?"

బ్రహ్మ ఆ దానవు లిద్దరి గద్దింపునకు భయపడెను.

అంత శౌనకుఁ డిట్లడిగెను:–"సూతా! ప్రళయమందంద ఱును నశించఁగా నింక నీ దైత్యు లెచ్చటినుండి వచ్చిరి ? వీరు లోకపితామహునే భయపెట్టునంతటి బలవంతులా ?"

సూతుఁ డిట్లనెను:– "స్వామీ ! ఇఁక నేమియు నడుగ వలదు. ఈ భగవల్లీల లపరంపారములు. ఈతని క్రీడావిషయ

మున నేవిధముగను నాలోచింప వీలులేదు. ప్రళయమందును నశింపనట్టి జీవులు కొంద అనుగ్రహ సృష్టిజీవు లుందురు. వారు ఘోర తమోగుణులుగనో ఘోర సత్వగుణులుగనో ఉందురు. మార్కండేయ లోమశాది మహామునులు ప్రళయమందును నుందురు. ఇదేవిధముగ నీ దైత్యు లిద్దరును ప్రళయజలమందు నిర్భయులై తిరుగుచుండిరి. బ్రహ్మ భయపడినట్లు భగవానునికిఁ దెలియఁగానే అప్పు డాకాశవాణి యిట్లు పలికెను:– "ఈ కమల నాళముయొక్క ఛిద్రములోనికి దూరుము. అచ్చట నా దర్శ నము కాఁగలదు." బ్రహ్మ అట్లే చేసెను. ఈ దైత్యులును తక్కువవారు కారు. బ్రహ్మ భయభీతుఁడయ్యెను. వారితో యుద్ధముచేయుట ఆతనికి ఉచితముగఁ దోఁచలేదు. భగవానుని యుద్ధమునకుఁ బిలిచెను. భగవానుఁడు నిద్రించి నిద్రించి విసుగు జెందియుండెను. ఆతఁడు యుద్ధమునకు తలపడి ఆ యిద్దరితో వేలకొలఁది వత్సరములు యుద్ధమొనర్చెను. కాని దైత్యు లజేయులు. భగవానుఁడు వారి నోడింపఁజాలకపోయెను. ఆహా! విచిత్రము భగవల్లీల! ఎవని భ్రుకుటివిలాసముచే నసంఖ్యాకము లగు బ్రహ్మాండములు పుట్టి నశించుచుండునో అట్టివాఁ డీ పురు గులవంటి దైత్యులను జంపఁజాలకపోయెను. చంపినచోఁ దా నాడఁదలఁచిన ఆట చెడిపోవును. ఆతఁ డాట నాడవలయును గదా!

బ్రహ్మ మరలఁ దన కమలముపైకి వచ్చి కూర్చుండెను. దైత్యులు మరల నాతని బాధింప నారంభించెను. ఈసారి భగవానుఁడు నడుము బిగించి, పీతాంబరమును ముడిచి, జబ్బ కొట్టి యుద్ధముకొఱకు నిలుచఁబడెను. కాని ఆతని ప్రయత్నము

లన్నియును వ్యర్థములయ్యెను. ఆతఁడు దైత్యుల నేమియును జేయఁజాలకపోయెను. ఇప్పు డాతఁడు కపటమును బ్రారంభించెను. ఈ విద్యలో భగవానుఁడు గొప్ప నిపుణుఁడు. ఆతఁ డిట్లనెను:– "ఓరీ! మీరు మంచి బలవంతులు. నేను మీ యెడలఁ బ్రసన్నుఁడనైతిని. మీ కేదైన వరమును గోరుఁడు."

ఇది విని ఆ దైత్యు లిద్దరును గట్టిగా నవ్వి యిట్లనిరి:– "ఇది చాల బాగున్నది. నిన్ను వరములు కోరుటకు నీతో మేము ఓడిపోయితిమా ? నీవే మాచే నోడితివి. కావున నీవే నీ కిష్టము వచ్చిన వరమును వేడుము. నీవు కోరిన వరమును మే మొసంగెదము."

భగవంతుని కేవిషయమునను లజ్జా, శీల, సంకోచము లుండవు. బిచ్చగాఁడగును, దాసుఁడు, సేవకుఁడు, భృత్యుఁడు, సారథి వేయేల తన కిష్టమువచ్చినట్లగును. వారి మాటలను విని యిట్లనెను:– "మంచిది, మీరు నా యెడలఁ బ్రసన్నులరైనచో నాకు నాచేత మీ రిద్దరును జచ్చునట్లు వరదానమిండు."

ఇది వినఁగానే దైత్యుల ధైర్యము వీడిపోయి తల వంచుకొని యిట్లనిరి:– "ఈతఁడు మనలను మోసగించినాఁడు. అస్తు. మే మిప్పుడు నీకు వరము నొసంగితిమి; కాని ఒక్క వరమును మా కొసంగవలెను." భగవానుఁ డిట్లనెను:– "మీ కేమి కావలయునో చెప్పుఁడు. ఆ వరమును మీ కిచ్చెదను."

దైత్యు లిద్ద రిట్లనిరి:– "నీవు మమ్ములను జంపవచ్చును. కాని తరువాత మేము మీకు పుత్రులమై పుట్టవలెను."

భగవానుఁడిట్లనెను:- "సరియే." అని పలికి భగవానుఁడు వారిని తొడలమీఁదఁ బెట్టుకొని చంపెను. వారి మేదస్సు చేతనే యీ మేదిని యేర్పడినది. ఆయిద్దరే విరాట్ భగవానునకు అధర్మ, నిర్ఋతులను బుత్రులైరి. ఈ కల్పమందు వారే బ్రహ్మయొక్క పృష్ఠభాగమునుండియు, పాయుస్థానమునుండియుఁ బుట్టిరి.

మైత్రేయముని విదురునితో నిట్లనెను:- "విదురా! నేను అధర్మని వంశమును, అధర్మని, నిర్ఋతియొక్క పూర్వజన్మ వృత్తాంతమును జెప్పితిని. ఇప్పుడింక మీరేది అడిగిన దానికి జవాబొసంగెదను."

నైమిశారణ్యమందు సూతుఁడు శౌనకాదిమునులతో నిట్లనెను:- "మహర్షులారా! విదురుఁ డధర్మవంశమును విని మిక్కిలి యానందమును జెంది తరువాత కథ నడుగుట కాలోచించు చుండెను.



# మ హ ద వ కా శ ము

భాగవతకథా గ్రంథమాల' చందాదారులకు శ్రీరామశరణ్, కుందుర్తి
ంనరసయ్యగారి గ్రంథములు, రు. 1-0-0 కు, రు. 0-4-0 లు తగ్గించి
ంబడును. వ్రాయునపుడు చందాదారు నెంబరు నుదహరింపవలయును.

# భా గ వ త క థ

మహాత్ములును, సాధుపుంగవులు నగు శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్తజీ
చారీ మహారాజుగారు అష్టాదశ పురాణములందలి సమస్త కథలు కలిసి
కట్లుగా భాగవతము నాధారముగ జేసికొని 'భాగవతకథ'ను 60 భాగ
రచించిరి. ఈ యరువది భాగములను మహామండలేశ్వర్, శ్రీరామ
కుందుర్తి వేంకటనరసయ్య పాకయాజిగారు లలితాంధ్రభాషలో
ంచిరి. ఇదివఱకు వీనిని సాధన గ్రంథమండలి వారు 7 వ భాగము
ప్రచురించిరి. ఇప్పుడు మిగిలిన భాగములను మేమే ప్రకటింపదలంచి
వీనిని ప్రచురించుటకు శ్రీ బ్రహ్మచారిగారు అధికారపత్ర మొసంగి
గ్లెజు ప్రతి రు. 2-50. ఒక్కసారిగా రు. 101-00 లు చెల్లించువారికి
గములు లీయబడును.

సంవత్సర చందా రు. 24-00. 12 పుస్తకము లీయబడును.

మావద్ద 1 నుండి 10 భాగములు వఱకు ఇప్పుడులభింపగలవు. ప్రతినెల
ఒక్కొక్కటి చొప్పున ప్రకటించెదము. లైబ్రరీల యజమానులును,
యు ధర్మకర్తలును, పాఠశాల ప్రధానోపాధ్యాయులును ముఖ్యముగ
నించి చందాదారులుగ చేరవలయునని ప్రార్థించుచున్నాము. పుస్తక
ను, వివరములకును ఈ క్రింది చిరునామాకు వ్రాయుడు.

భాగవతకథా గ్రంథమాల, బుద్దాం పోష్టు,

బాపట్ల తాలూకా.

బ్రాంచి:— తెనాలి, బాపట్ల.